'హాసం
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇదీ సంగతులు

## హాస్యం - సంగీతం



**కర్టెసీ :**

75వ పేజీలో ఎన్.టి.ఆర్. తైలవర్ణ చిత్రం - విజయచిత్ర ప్రత్యేక సంచిక కోసం ప్రఖ్యాత చిత్రకారుడు టి.వి.రత్నం ప్రత్యేకంగా చిత్రించినది. టి.వి.రత్నంగారికి, విజయచిత్రకు కృతజ్ఞతలతో..... - హాసం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'సంతోషం'
'హాయ్'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్ స్ప్రెడ్'లో





ముఖచిత్రం: ఆర్యన్ రాజేష్, నికిత - 'హాయ్' చిత్రంలో



# శ్రేయో జనవాక్యం

గన్‌వదిలి పెన్‌తో అద్భుతాలు సాధించిన 'ఆనంద్ బక్షీ' గారి గురించి ఈ పక్షం హాసంలో చదవ గలిగాం. మాకోసం ఏమీ లేదా? అని అడిగే బాలల కోసం సమ్మర్ స్పెషల్‌గా "రాక్షసుడూ పదమూడో ఎక్కం ఖద!" అందించడం ఆనంద దాయకం!

నిరంతరం సుమధుర గానవాహిని సంగీత జానకి గారూ, "ఇప్పుడు పాడినా... అదే గొంతు అదే మధురం" జానకి గార్కి ప్రత్యేక అభినంద నలు. వ్యాసకర్త పి.బి.శ్రీనివాస్‌గారికి ధన్య వాదాలు.

-నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్.

నేను పత్రికలు ఎక్కువగా చదవడం జరుగ లేదు. హాసం చూసినప్పటి నుంచి నాకు కావలసిన పత్రిక వచ్చిందని నేను పడ్డ ఆనందానికి హద్దు లేదు. ప్రతి సంచిక చదువుతున్నప్పుడు తరువాత సంచిక ఎప్పుడొస్తుందో అని ఎదురు చూస్తూవుంటాను. "హాసం" కలకాలం దాచుకునే పత్రిక అని నిస్సందేహంగా చెప్పవచ్చు. 16-30 ఏప్రిల్ 2002లో హిందీ లిరిక్ రైటర్ ఆనంద్ బక్షీ గారి గురించి చాలా బాగా వ్రాశారు. పాటల లిస్ట్ కూడా వ్రాశారు. అలాగే కొన్ని పాటలైనా ప్రింట్ చేసుంటే బాగుండేది. తరువాత ఝునక్‌ఝునక్ పాయల్ బాజేలోని 'నైన్ సే నైన్' సాంగ్ గురించి చాలా బాగా వ్రాసారు. యిక ఆపాత మధురం అనార్‌కలి సినిమా పాటల గురించి వ్రాసిన రాజా గారికి నా స్పెషల్ థాంక్స్. శ్రీ జానకి గారిపై పి.బి.శ్రీనివాస్ ప్రత్యేక వ్యాసం, పాటలు చాలా బాగున్నాయి.

-ఎస్.ఇ.రావు. వి.పురం

దాదాపు 'హాసం' ప్రారంభ సంచిక నుండి చూస్తున్న నాకు ఈ సూచన చేయాలనిపించి రాస్తున్నాను - చిత్తరంజన్‌గారి లలిత సంగీతం శీర్షిక చివరిలో ఈ రాగంతో వచ్చిన సినిమా పాటల గురించి ఇస్తున్నారు బావుంది. దీనినే ఇంకాస్త పొడిగిస్తూ ఒక రాగం తీసుకొని దానిపై ఆధారపడిన గీతాల స్వరరచన కూడా సంచికకొకటి ఇచ్చినట్లయితే పూర్తిగా శాస్త్రీయ సంగీతావగాహన లేని ఔత్సాహిక వాయిద్య కళాకారులకు ఎంతో సాయపడిన వారవుతారు. తద్వారా వేణువు, కీ బోర్డులాంటివి స్వయంగాను, కరెక్ట్‌గాను నేర్చుకోవటానికెంతో ఉపయోగ పడ్తుంది కదా! సూచన ఆమోదయోగ్యం, ఆచరణీయం అవుతుందని ఆశిస్తూ....

-వై.రాజేష్, విశాఖపట్నం

ఎన్నో సంవత్సరాలుగా హాస్యపత్రికలు లేని లోటును, సంగీత సాహిత్యములను చర్చించే మహదవకాశమును కల్గించినందుకు చాలా కృతజ్ఞతలు.

మధుర మంజులగానంతో రంజింపజేసి, నా పంచప్రాణాలకన్న అధికంగా అభిమానిస్తున్న పి.బి.శ్రీనివాస్‌గారిని, వారి ద్వారా ఎ.ఎం.రాజా, ఎస్.జానకిగార్ల మధుర గానాన్ని మరోసారి తలుచుకొని మురిసేలా అవకాశాన్ని కలిగించిన మీకు మనఃపూర్వకంగా అభినందనలు.

-ఆత్కూరి వెంకట సూర్యనారాయణ,
విద్యానగర్, హైదరాబాదు

'హాసం' పత్రిక 16-30 ఏప్రిల్ అందంగా ఆకర్షణీయంగా పదిలంగా దాచుకొనే స్థాయిలో ఉంది. మిగతావి కాదా అని కాదు. 'అట్ట' హాసం హైలైట్ అయినా లో(పలు) పేజీలు మరింత మందహాసాన్ని ఆనందించే స్థాయిలో ఉన్నాయి.

రాక్షసుడూ-పదమూడో ఎక్కం ఖద నా మనమడు 'బుడ్డి' గాడికి చెప్పాను. వాడిలో హాశ్చర్యం ఆనందం. చాలా సేపు వాడు 'పుస్తకం' వదల్లేదు. మీకు సమ్మర్ స్పెషల్ థాంక్స్.

ఎప్పుడో చిన్నప్పుడు హాల్లో నేల టికెట్టు మీద కూర్చుని చూసిన 'ఝునక్ ఝునక్ పాయల్ బాజే' చిత్రం, తర్వాత వీడియో కేసెట్ చూసినా హాసంలో వ్యాసం చూశాక నా పెదవులపై ఒక దర హాసం. మల్లాది వారు మమ్మల్ని ఎంతగానో ఆ 'కట్టు' కుంటున్నారు.

చిత్తరంజన్‌గారి 'లలిత సంగీతం' మాకు ఎంతో 'మే'లు చేస్తోంది. వారి సంగీత చల్ల దనంతో 'మే' ఎండలు హాయిగా గడపగలం. ఈసారి 'ఉడ్‌హౌస్ ఫర్ యూ'లో కథా కథనం, యర్రంశెట్టి శాయిగారి నవలిక ప్రేమకు ఫుల్ స్టాప్ ఉందాకు చాలా దగ్గరగా ఉంది. పాత్రల పేర్లు తేడా! స్వభావాలు ఒక్కటే. ఉడ్‌హౌస్ కథల్ని మా కాలేజ్ డేస్ గుర్తు చేస్తూ వ్రాస్తున్న ఎం.బి.ఎస్. ప్రసాద్‌గార్కి హేట్సాఫ్!

రాజా గారి భైరవదోషం మనకి మరిన్ని చిట్కాలు బోధిస్తోంది. భార్యాభర్తల విషయంలో! తిండి విషయమే కాదు, ఏదైనా! ఆదివిష్ణు నాట కాల్లోని కేరక్టర్లు జ్ఞాపకం వస్తున్నాయి. వడ్డన ఇంకా ఉందిగా చూద్దాం!

పాత సిన్మాల్లో అంజలి! వాహ్! అనార్‌కలి ఆ సినిమా పాటల్ని మీ వ్యాఖ్యానంతో చదువు కుంటుంటే ఆనందపు అంచులు చూశా! పద ప్రయోగం పై మీ వ్యాఖ్యానం లోతులు చూపింది. సంగీత - సాహిత్యాలను సాధన చేసి మన బొంట్లకు ఇచ్చిన ఆ మహనీయమూర్తులకు 'హాసం' ద్వారా వారి చరణాలకు ప్రణమిల్లుదాం!

-టి.వి.సత్యనారాయణ, (త్యాగి),
హైదరాబాద్

"నీరు-మీరు" అంటూ 'నారా' వారు యజ్ఞాలు, తపస్సులు చేస్తున్న టైములో (అందుకోసం ఫుల్ పేజీ కేటాయిస్తున్న టైమ్‌లో) విజయ నీటి కథ నీట్‌గా వుంది. సామాజిక సమస్యల మీద వ్రాయబడ్డ కథల్లో కనబడే తరుగుదల, మంద కొండితనం, కనపడనివ్వకుండా సెటైరికల్‌గా, హ్యూమర్ టచ్‌తో సాగిన 'సరళి' కథను వదలకుండా చదివేట్లు చేసింది.

నీటియుద్ధాలు, పాలచెట్టీలు, నీటి ట్యాబ్లెట్స్ - చెమట స్నానాలు వళ్లు తుడుచుకోవడాలు లాంటివి ఎంతగా నవ్వు తెప్పిస్తాయో కాస్త లోతుగా చూస్తే కన్నీళ్ళు తెప్పిస్తాయి కూడా. కథలో 'నాయిక 'నీరజ' చేసిందదే. (నవ్వి నవ్వి ఏడ్చింది).

పెళ్లాన్ని ముద్దుగా 'నీరు' అని పిలవడానికి కూడా భయపడేంతగా భయపెడుతున్న నీటి సమస్య గురించి సరయిన టైములో చదవబుల్ కథ గురించి 'విజయ'గారు అభినందనీయులు. అక్కినేని గారు ఈ మధ్య నీటి సమస్య గురించి వ్రాస్తూ 'ఈ నా రచన చదివి ఎవ్వరయినా స్పందించి నీటి వాడుక తగ్గిస్తే నా జన్మ, నా ప్రకటన ధన్యమయినట్లే... అన్నారు.

అలాగే... ఈ "నీటి కథ" చదివి నీటి విషయములో ఎవ్వరయినా కాస్తంతయినా జాగ్రత్త వహిస్తే ఈ కథా జీవితం ధన్యమయినట్లే.

-యస్.కె.నాయుడు, శ్రీకాకుళం

'హాసం' మొదటినుండీ చదువుతున్నాను. అన్నీ బాగానే ఉంటున్నా ఇటీవల నాకు బాగానచ్చిన రెండింటి గురించి ప్రస్తావించి తీరాలి. 'రిటర్న్ ఆఫ్ ది టైగర్స్' ప్రభుత్వాధీశుల దుస్థితికి, 'ఉందిలే మంచే కాలం ముందు ముందునా' నీటి ఎద్దడికి అద్దం పట్టాయి. అంత సీరియస్ విషయాలను హ్యూమరస్‌గా మనసులో నాటుకొనేట్లు చక్కగా చెప్పారు గోపీ, విజయ గార్లు. వారికి అభినందనలు.

-ఎం.వి.జి.పద్మావతి, హైదరాబాద్





సంపుటి :1 సంచిక: 16

16 - 31 మే 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్వీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 16

వేసవి శలవులు. పరీక్షలయిపోయాయంటే పిల్లలకంటే పెద్దలకు ఎక్కువ ఊరట. ఉక్కగా ఉన్నా, గాడ్పులు వీచినా, కరెంటు పోయినా సెలవుల మజా సెలవులదే.

సెలవులెలా గడపాలన్నది ఎప్పటినుండో ఉన్న ప్రశ్నే. ఇటీవల ఆ ఐడియాను పూర్తిగా కమర్షియలైజ్ చేసి సమ్మర్‌క్యాంపులు నిర్వహిస్తున్నారు. అనేక కళలు నేర్పుతామంటున్నారు. ఈ క్యాంపులలో ఆయా కళలతో, క్రీడలతో పరిచయం మాత్రమే కలుగుతుంది కానీ ప్రావీణ్యత సంపాదించాలన్నా, కనీసం నేర్చుకున్నది మర్చిపోకూడదనుకున్నా, నిరంతరసాధన అవసరం. స్కూళ్ళు తెరిచాక స్కూలు బస్సులకై నిరీక్షణలు, బండెడు హోంవర్కుల మధ్య సాధన కొనసాగుతుందా అన్నది అనుమానమే-

సాధన అవసరంలేని హాబీ-నచ్చినవి సేకరించడం. మనకు నచ్చిన కథో, కవితో, బొమ్మో కనబడినప్పుడు దాన్ని కత్తిరించి దాచుకోవడం మంచి అలవాటు. ఇదివరలో సీరియల్స్ కత్తిరించి దాచుకునే అలవాటు చాలామందిలో-ముఖ్యంగా మహిళల్లో బాగా ఉండేది. క్రమక్రమంగా ఆ అలవాటు తగ్గిపోయింది. పాశ్చాత్యదేశాల 'యూజ్ అండ్ త్రో' పాలసీనే మనమూ అనుకరిస్తున్నాం. 'అంతగా అవసరమైతే తరువాత చూసుకోవచ్చులే' అన్న ఫిలాసఫీ బాగా వంటబట్టింది.

తెలియకుండానే ఇది మనలో వేళ్ళూనుకుంటోంది. ఈ తరం మాతృమూర్తులకు మన సంస్కృతి గురించి అవగాహన చాలా తక్కువగా ఉంటోంది. ఇక సంతానానికి వారేమి నేర్పగలుగుతారు? సంస్కృతి కావచ్చు, సాహిత్యం కావచ్చు, కళ కావచ్చు - భద్ర పరచడం అనే అలవాటు మనం చేసుకోకపోతే భావితరాలకు ఇవ్వడానికి ఏమీ మిగలదు.

ఈనాడు "హాసం"లో కనబడుతున్న ఎన్నో అరుదైన చిత్రాలు, అపురూప రచనలు జనాలను అలరిస్తున్నాయి. నిక్షిప్త చిత్రాలను పాఠకులు గుండెలకు హత్తుకుంటున్నారు. ఇవన్నీ కొందరు వ్యక్తులకున్న 'భద్రపరిచే' హాబీ పుణ్యమే! అంతే కాదు, 'హాసం'లో కనబడే అనేక పరిశోధనాత్మక వ్యాసాలు కూడా ఎన్నో సంవత్సరాలుగా దాచుకున్న సమాచారం ఆధారంగా రూపొందించినవే! నచ్చిన విషయానికి సంబంధించినవి సేకరించడం, వర్గీకరించడం, జాగ్రత్తగా దాచడం, అవసరమైనప్పుడు అందుబాటులో తెచ్చుకోవడం-ఇవన్నీ జరిగినప్పుడే ఆయా వ్యాసాలకు పరిపూర్ణత కలుగుతుంది.

గతకాలంలోని మంచిని ఆకర్షణీయంగా ఈ తరానికి అందించడమే 'హాసం' చేస్తున్న పని. మహానుభావులైన నిన్నటి కళాకారులను, ఉత్కృష్టమైన వారి సృష్టిని రేపటితరం కూడా స్మరించుకోవాలన్నదే మా ఆకాంక్ష, అందుకు మాకు ఆలంబన - ఎందరో సంగీత హాస్యాభిమానులు దాచుకున్న సంపదే! ఈనాడు 'హాసం' చదువుతున్న పాఠకులు కూడా ఈ హాబీని అలవాటు చేసుకుంటే మన సాంస్కృతిక వారసత్వం కొనసాగుతుందని మా నమ్మకం. ఆ అలవాటు తమ పిల్లలకు కూడా అలవరిస్తే మరింత ఎక్కువకాలం పాటు మన కళా సంపద మనగలుగుతుంది. ఆ విధంగా దాచుకోదగ్గ పుస్తకాల్లో 'హాసం' కూడా ఉంటే మా కృషికి తగిన గుర్తింపు వచ్చినట్లే భావిస్తాం.





# మా ఆవిడ ఇంతే... మరి మీ ఆవిడ?



-భువనచంద్ర



మొదటిసారి కథరాసే ప్రయత్నం చేశా. ఈ మధ్య వాస్తు వ్యవహారాలు చూసి చూసి అడిగిన వాళ్ళ దగ్గర అడగని వాళ్ళ దగ్గర కూడా 'ఉచిత' సలహాలు పొంది పొంది నాకే నా చాదస్తం మీద విసుగొచ్చి రాసిన కథ యిది. అంతేగానీ 'శాస్త్రాన్నో' పండితుల్నో కించపరచాలనీ బాధపెట్టాలనీ కానేకాదు. కాసేపు సరదాగా నవ్వుకోవడానికి మాత్రమే.

(నమోస్తే!)

పరీక్ష రాశాను....
రిజల్టు కోసం ఎదురుచూస్తూ...
మీ
భువనచంద్ర,
13/11 గుల్షన్ వీధి,
వెస్ట్ కామకోటి నగర్,వాలసరవక్కం,
చెన్నై-87

నేను 'ఎడ్డెం' అనేలోగానే ఆవిడ 'తెడ్డెం' అంటుంది. అలా అని 'తీరాలనీ' లేకపోతే 'ఆడజన్మకానే కాదనీ' వాళ్ళమ్మ ఉగ్గుపాలతో ఉపదేశించిందిట.

అంతేగాక పెళ్ళయిన ఆడదంటే ఎలా వుండాలో 'ప్రాక్టికల్'గా చిన్నతనం నించే చూపించిందిట. (ఈ విషయం వాళ్ళ ఊరివాళ్ళని వాకబు చేస్తే తెలిసింది.. 'కొంచెం ఖర్చయినా కరెక్టు ఇన్‌ఫర్మేషనే...)

'కాఫీ' అంటాననుకోండి... గ్యారంటీగా 'టీ' తెస్తుంది.

ఇవ్వాళ 'గారెలు వెయ్' అని ఓ ఆర్డరు పడేశాననుకోండి.

ఆ రోజు టిఫిన్ ఉండనే వుండదు.

ఇలా కాదని పతివ్రతల కథలు చదివించాను.

పతివ్రతల సినిమాలు చూపించాను.

పక్కింటాయనతో సమాలోచనలు కూడా జరిపాను.

దేశ విదేశాల్లో వున్న 'కలం' ఫ్రెండ్స్‌నీ కన్సల్టు చేశాను - అబ్బే....!

పోనీ నేను రివర్సులో ట్రై చేద్దామనుకుని 'తెడ్డెం' అనేలోగానే ఆవిడ 'గడ్డెం' అని రూటు మార్చింది. ఇంకేం చేసేది?

నేను 'ఇండియా' ఐతే ఆవిడ 'పాకిస్తాన్'

నేను 'ఇజ్రాయెల్' అయితే ఆవిడ 'పాలస్తీనా'

నేను 'ఘరానా మొగుడ్న'ని అనుకుంటే ఆవిడ కత్తిపూసిన 'కడప రెడ్డెమ్మ'-

నేను గలగలా నవ్వుతూ ఇంటికొస్తే ఆవిడ ధుమధుమలాడుతుంది.

నేను 'గరాం బూరాం' అంటూ రంకెలేస్తుంటే ఆవిడ స్వీటుగా ఓ స్మైలిచ్చి 'ఇంకేం చేసుకుంటావో చేసుకో పో' అన్నట్టు భుజాలెగవేస్తుంది.

ఒక వేళ 'మన' జాతకం సరిగ్గాలేదేమోనని జ్యోతిష్యుల్ని హస్తసాముద్రికుల్ని రప్పించి పక్షం రోజుల పాటు ఫలహారాల్తో పాటు 'ఆ' సీసాలు కూడా నవ్లయి చేసి మీనవేషాలు గుణింపజేశాను.

ఈ వ్యవహారం ఏమిటో ఒక్కడికీ అర్థవైతే ఒట్టు. ఒకాయన మాత్రం "బాబూ.... నీ తలరాతని ఆ బ్రహ్మదేవుడు ఏ మూడ్‌లో రాశాడో గానీ శాస్త్రాన్ని తిరగేసి మరగేసి చదివినా... ఒక్కముక్క తెలియటంలా... నీ జీవితం మొత్తం 'ఆవిడ' చేతుల్లోనూ, చేతల్లోనూ మాత్రమే వుందిగానీ నవగ్రహాల్లో ఏ గ్రహం చేతిలోనూ లేదని ఘంటాపథంగా చెప్పగల"నని చెప్పి బస్సెక్కాడు. మా ఆవిడ ఏం చేసిందో తెలీదుగానీ ఒకాయన 'బంగారంలాంటి పెళ్ళాన్ని పెట్టుకుని 'అడ్డ' మాడుతుందంటావుటయ్యా.... నీ బుద్ధి బుగ్గిలో కలవా...!జాగ్రత్తగా కాపరం చేసుకో...." అవటాని ఓ లెక్చరిచ్చి మరీ వెళ్ళాడు.

ఇంకోడైతే ఇంకాస్త ముందుకెళ్ళి -

"మీ కళ్ళు ఇరుకు.... మీ ముక్కు వంకర - ఏదో విధి వక్రించినందువల్ల మీ భార్య అయిందిగానీ... లేపోతే... ఆవిడ.... రాజ్యాలేలాల్సింది కాదఠండీ..." అని అక్షింతలు వేశాడు.

(ఈయనకి మాత్రం నాకు తెలీకుండా మా ఆవిడ మరో పచ్చనోటు ఎక్కువిచ్చి వుంటుందని నా ప్రగాఢ నమ్మకం).

చెయ్యాల్సినవన్నీ చేసి 'రావుల్‌దప్పెను' టైప్‌లో మొహం వేలాడేసు క్కూచుంటే ఓ నాడు మా ఫ్రెండొకడొచ్చాడు.

"అబ్బాయ్... అన్ని కష్టాలకీ కారణం ఖచ్చితంగా వాస్తే. ఆ 'వాస్తే' సరి చేయించావా.... చేత్తో తీసేసినట్టు అన్ని కష్టాలూ చులాగ్గా తీరిపోతాయి" అని ఓ బ్రహ్మాండమైన సలహా ఇచ్చాడు. అంతేగాక వాళ్ళ వూళ్లో ఎంతమంద 'వాస్తు' సరిచేశాక బాగుపడ్డారో సోదాహరణంగా వివరించి మరీ 'ఇంప్రెస్' చేశాడు.

వేంఠనే 'వాస్తువిద్వాన్' ఒకాయన్ని ఫస్టుక్లాసు టిక్కెట్టు 'బుక్' చేసి మరీ రప్పించా...!

మా యిల్లు తాతల నాటిది. నా ఎరికంలో ఏనాడూ మా యింటి 'మగువలు' భర్త గీచిన 'గీటు' దాటలేదు సరికదా 'మొగుడు' అంత దూరంలో వుండగానే వీళ్ళు ఒణుక్కుంటూ లేచి నిలబడే వాళ్ళు.

మా 'వా.వి' తెలివైన ముండావాడే. పేద్ద 'టేప్' తీసుకొచ్చి మొత్తం కొలిచి... 'దిక్సూచి' టెస్టులన్నీ 'సక్రమంగా' చేసి 'గృహవాస్తు'లో కించిత్తు కూడా లోపం లేదని తేల్చాడు.

"మరైతే నా కష్టాలకి మూలం ఏమిటి స్వామీ.... నేను 'ఎడ్డెం' అంటే ఆవిడ 'తెడ్డం' అనటానికి గల కారణాలు ఏమైవుండాలి స్వామి" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నా....! ఆయన తలపంకించి చాలాసేపు ఆకాశం వంకా నా ముఖం వంకా మార్చిమార్చి చూసి.... 'యాహూ' అని షమ్మీకపూర్ స్టయిల్లో అరిచి ఒక్క గంతువేశాడు.

"ఏంసార్... ఏవయింది సార్" అనడిగా.

"తెల్సింది బ్రదర్ తెల్సింది... నీ అగచాట్లకి



మళ్ళీ తనే "డోంట్ వర్రీ. మరో మాంచి సలహా కూడా ఇస్తా.... పొద్దున్నే లేచి మొహం కడుక్కునేటప్పుడు కుడి నుదిటినించి అంటే మొహంలో 'నైరుతి' నించి 'పశ్చిమం'గా 'ఎడం నుదుటి' వైపు వెళ్ళి అక్కడ్నించి 'ఎడం చెంప మీదుగా' అంటే ఉత్తరంగా దిగి 'ఈశాన్యం'లోకి అంటే 'మీసం లేని చోటుకి నీళ్ళు వచ్చేట్టటుగా మొహం కడుక్కో. 90 శాతం కష్టాలు తీరతయ్. అలాగే 'కుడి మీసం' 'ఆగ్నేయం' వైపు కొస్తుందిగదా.... సిగరెట్లు తాగేటప్పుడు 'జాగ్రత్తగా' వుండాలి..." లేకపోతే కాలుతుంది... సరేనా?" అంటూ ఫటఫటా పది ముక్కలు చెప్పి అక్షరాలా 'పది వందలు ఫీజు'గా తీసుకుపోయాడు. వాస్తు విద్వాన్‌గారు చెప్పినట్టే "ముఖవాస్తుని" మార్చా....!

మూలం గృహవాస్తుకాదు" అని గర్వంగా నవ్వాడు.

"మరేమిటిసార్... ఇంకేమిటి సార్... తొందరగా చెప్పండి సార్" అంటూ ఆయన చేతులు పుచ్చుకున్నా.

"మీ కడగండ్లకి కారణం గృహవాస్తు కానే కాదు. మీ ముఖ వాస్తు" అని సస్పెన్స్‌ని బ్రేక్ చేశాడు.

"ముఖవాస్తా?" నాకు మతిపోయింది. "అదేంటి సార్.... అలాంటి వాస్తువున్నదని నేను విననే లేదే..." అయోమయంగా అడిగా.

"నేనూ విన్లేదు... కానీ ఇప్పుడే కనిపెట్టా..." థియెరీ ఆఫ్ రెలెటెవిటీ కనిపెట్టిన ఐన్‌స్టీన్‌లా ఆనందంగా అన్నాడు వా.వి.

"ఎలా కని పెట్టారు?" నాకర్థంగాక అడిగా.

"మీ మొహాన్ని చూసి... వివరిస్తా వినండి! సూర్యుడికి ఎదురుగుండా నుంచొని వుంటే తూర్పు ఎటు వైపుంటుంది?" ప్రశ్నించాడు.

"ముక్కు సూటిగా వుంటుంది."

"అవునా? మీదసలే బొంగ్రముక్కు. అదీగాక కూలిపోయే విమానంలాగా ముందుకు వాలి వుంది... అంటే-

తూర్పువైపున 'వెయిట్' పడిందన్న మాట. అది మొదటి దోషం. ఇహపోతే ఈశాన్యం ఎటు వైపుంది?"

"అదీ..." చెప్పబోతుంటే కట్ చేశాడు.

"నేనడిగింది మామూలు ఈశాన్యం గురించి కాదు.

మీ ముఖంలో ఈశాన్యం ఎటువేపుంది?"

"నా ఎడం పక్క మీసం వైపు" జవాబిచ్చా..

'అవునా! ఈశాన్యం వేపు అస్సలు పూచిక పుల్లంత బరువు కూడా పడకూడదు! అలాంటిది అంతలావు మీసం బరువు పడిందంటే ఇహ చెప్పేదేముందీ..." పెదవి విరుస్తూ అన్నాడు.

"మరేం చెయ్యాలి?" భయంగా అడిగా.

"ముందు ముఖవాస్తుని సరిచేసుకోండి...." తాపీగా అన్నాడు.

"అంటే..."

"ఎడం వైపు మీసం పూర్తిగా కట్ చెయ్యండి... అలాగే ఎడం చెంప మీద నుంచి యీశాన్యం మీదకి వాలే జులపాన్ని కూడా కట్ చెయ్యండి. వీలుంటే ముక్కుని కొంచెం కట్ చేయించి ప్లాస్టిక్ సర్జరీ చేయించుకోండి.... కొంతలో కొంత బెటర్‌మెంటు వస్తుంది."

"అదేంటిసార్ ఒక పక్కమీసం వుంచి మరో పక్క తీసేస్తే ఛండాలంగా వుండదూ" చికాగ్గా అడిగా.

"పిచ్చివాడా! ఇక్కడ నువ్వు చూసుకోవల్సింది 'అందాన్ని గురించి కాదు' 'ఆనందాన్ని' గురించి!! ఆనందం కావాలంటే ముఖవాస్తులో మార్పులూ చేర్పులూ తప్పవు!", అనునయంగా అన్నాడు.

(అన్నట్లు వా.వి. గారు చెప్పిన మరో విషయం మీతో చెప్పడం మరిచా....

"మొహం కడుక్కునేటప్పుడు సరేగాని మరి తలంటు పోసుకోవాలంటే ఎలా గురువుగారూ" అని అడిగితే - ఆయన నన్ను దగ్గరుండి మంగలి షాపుకి తీసుకెళ్ళి నెత్తిమీద నీళ్ళు పడగానే అవి 'నైరుతి' నించి 'పశ్చిమంగా' ప్రవహించి 'ఉత్తరం' మీదుగా 'ఈశాన్యం' చేరేట్టూ ఆ తరువాత 'ఆగ్నేయం' గుండా బైటికొచ్చేట్టూ నా ఉంగరాల జుట్టుని కాలువలుగా కట్ చేయించి మరీ ఇంటికి పంపాడు)

ఇంక అన్ని కష్టాలు తీరిపోయాయి గదా అని మనోధైర్యంతో వీధిలోనే "ఓయ్... కాఫీ పట్రా" అని కేకేశా.

రెండు నిముషాలు తర్వాత ఆవిడ ఓ కప్పు చేతిలో పెట్టి మొహం కూడా చూడకుండా లోపలికి పోయింది. టేస్టు చేద్దును గదా - అది కాఫీ కాధూ టీ కాదూ - వేడి 'చారు'!

ఇహ యీ జన్మకి మా ఆవిడ ఇంతే - మరి మీ ఆవిడ?.



**ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా 'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్ ఇది.**



# భైరవదోషం

-రాజా

**జరిగిన కథ**

**హాయిగా ఉంటున్న కమల, సుందరం కుటుంబంలో కోదండం బాబాయి వచ్చి తిష్టవేస్తాడు. ఎన్నాళ్ళయినా వదలకుండా భయంకరమైన రీతిలో తింటూ ఉంటాడు. అతన్ని మేపలేక ఉద్వాసన చెప్పటానికి రకరకాల ప్రయత్నాలు చేస్తారాదంపతులు. ఆయన భార్యకు సీరియస్‌గా ఉందని టెలిగ్రాం తెప్పిస్తారు. ఆ తర్వాత... అతగాడు ఫోన్‌చేసి కనుక్కుని వీళ్ళచేత మరింత డబ్బు ఖర్చుపెట్టిస్తాడే కాని అస్సలు కదలడు అటువంటి సమయంలో ...**

(డైనింగ్ టేబుల్ మీద ఓ నాలుగైదు కిలోల బియ్యం ఉంటాయి. కమల ఏరుతూ ఉంటుంది.

ఓ.బి.లోంచి కారు హారన్. కమల తల తిప్పి చూస్తుంది. చేతిలో చిన్న కుక్క పిల్లతో విమల ఎంట్రీ)

విమల : అక్కా!

కమల : అరె... విమలా... అదేంటే ఒక్కదానివే వచ్చావు. అమ్మా నాన్నా రాలేదా?

విమల : లేదే... ఎందుకో సడన్‌గా నిన్ను చూడాలనిపించింది. తెలిసిన వాళ్ళ కారు ఇటే వస్తుంటే ఎక్కేశా. మళ్ళీ రాత్రికి అదే కారులో వెళ్ళిపోవాలి.

కమల : అదేంటీ.... రెండు రోజులైనా ఉండకుండా....?

విమల : వచ్చే నెల్లో మళ్ళీ వస్తానే అప్పుడెన్ని రోజులుండమంటే అన్ని రోజులుంటా.

కమల : ఈ కుక్క ఎవరిదే?

విమల : మనదే అక్కా.... ఈ మధ్యనే కొన్నారు నాన్న. దాన్ని నీకు చూపించినట్టు కూడా ఉంటుందని తెచ్చేశా... బావుంది కదూ.

కమల : భలేగా ఉందే బుజ్జిముండ. ఇంకేంటి విశేషాలు.

విమల : నా విషయం మామూలే. చదువయ్యాకే పెళ్ళని తేల్చి చెప్పేశాను. నీ సంగతేంటి ఎలా ఉంది లైఫు?

కమల : ఏదో ఈడ్చేస్తున్నాల్లే బండి

విమల : పెళ్ళయి రెండు సంవత్సరాలైనా కాకుండా ఇంత నిరాశ ఏంటే... బావెలా ఉన్నాడు... సంసారం ఎలా ఉంది.?

కమల : ఫరవాలేదులే

విమల : అదేంటే అలా అంటున్నావు? కొంపదీసి బావగానీ... ఏదైనా... సెకెండ్ సెటప్పు...

కమల : ఛ.... ఛ.... అవేం మాటలే...

విమల : ఈ రోజుల్లో అది ఫ్యాషన్ అయి పోయిందే.

కమల : అయ్యయ్యో ఆయన దేవుడే బాబూ.... ఉండు కాఫీ తెస్తా.... తాగుతూ మాట్లాడుకుందాం.

విమల : అలాగేలే గాని ఈ కుంభం ఏవిటే? ఫ్రెండ్స్ ఎవరైనా భోజనానికొస్తున్నారా ఇవాళ?

కమల : బహువచనాల్లేవమ్మా - అంతా ఏకవచనమే - ఒక్కడే ఆయన తరపు బంధువు.

విమల : ఒక్కడు - ఇంత తింటాడా? అయితే వాడు బంధువు కాదు రాబందువే

(కోదండం రావటం గమనించి)

కమల : ష్...

కోదండం : అబ్బబ్బ... ఎండలు దంచేస్తున్నాయ్.... ఓ చెంబుడు మజ్జిగ ఇవ్వమ్మా (విమలని చూస్తూ) ఈ పిల్లా...?

కమల : విమల.. మా చెల్లెలు బాబాయ్‌గారూ

కోదండం : అలాగా... కోవా బిళ్ళలా ఉంది. ఊ ఏంటమ్మాయ్... ఏంటి మీ ఊరు విశేషాలూ....

విమల : ఏవుందండీ... జనం మామూలుగా ట్రాఫిక్ సెన్స్ లేకుండా బతికేస్తున్నారు. ఆటోవాళ్ళు యథాప్రకారం స్ట్రైకులు చేసేస్తూ రేట్లు పెంచేసి రక్తం పీల్చేస్తున్నారు... బస్సులు స్విమ్మింగ్ కాంపిటీషన్స్‌లో ఎలా ఫస్ట్‌రావాలా అని తెగతాపత్రయ పడిపోతున్నాయి. జనం రోజూ ఛస్తున్నా చచ్చినట్టు బతుకుతున్నారు.

కోదండం : మంచి సెన్సాఫ్ హ్యూమరుందమ్మా నీకు?!

(విమలని చరుస్తూ లోపలికి వెళ్ళిపోయాడు)

విమల : ఇలా కొడుతున్నాడేంటక్కా.... గట్టిగా ఓ రెండు టెంకి జెల్లలిచ్చుకోనా?

కమల : ఒద్దులే.... బావుండదు.. ఆయనే మా ఇంటికి పట్టిన పీడ, చీడ... లోపలికి పద.... మొత్తం చెప్తా....

-- కట్ --

(ఆఫీసులో ఫోన్ మోగుతుంది. సుందరం ఎత్తుతాడు)

సుందరం : హలో

విమల : నేను బావా విమలని

సుందరం : అరె విమలా... ఎక్కణ్ణించీ!

విమల : మీ ఇంటి నుంచే

సుందరం : ఎప్పుడొచ్చావ్?

విమల : ఆ వివరాలన్నీ సాయంత్రం నువ్వొచ్చేక చెప్తాగానీ ఈలోగా అక్కతో మాట్లాడు

(ఫోన్ కమల చేతికిస్తుంది)

కమల : హలో

సుందరం : ఏంటి కమలా

కమల : గుడ్‌న్యూసండీ మన బాబాయ్‌ని విమల ఒక్కగంటలో పంపించేస్తుందిట.

సుందరం : ఆ౯ గంటలోపా అదెలా?

కమల : అదంతా సస్పెన్స్ అట. ఆయన వెళ్ళిపోయాక చెప్తుందిట. ఈ లోగా మనం ఓ పని చెయ్యాలిట.

సుందరం : ఏమిటిట?

కమల : బాబాయ్ రాగానే నేను మీకు ఫోన్ చెయ్యాలిట. మీరేమో బాబాయ్‌తో 'నాకు సడన్‌గా యల్.టి.సి. శాంక్షన్ అయిందీ. వాడుకోకపోతే వేస్టయి పోతుందీ. అంచేత నేనూ, మా ఆవిడ ఓ నెల్లాళ్ళపాటు ఊళ్ళు తిరిగి రావాలీ. అంతవరకు మీకిబ్బంది లేకుండా మా మరదల్ని ఉంచుతున్నాం. మీరేం మొహమాట పడకండీ..." అని చెప్పాలిట.

సుందరం : ఓకే.... ఆ తర్వాత...?

కమల : నేను వెంటనే పెట్టేబేడా పట్టుకొని మీ ఆఫీసుకు వచ్చేసి, సామాన్లు అక్కడ పడేసి పక్కనే ఏ థియేటర్ ఉంటే ఆ థియేటర్‌లో సినిమా చూస్తూ కూర్చోవాలిట. బాబాయ్‌కి ఉద్వాసన చెప్పగానే విమల మీకు ఫోన్ చేస్తుందిట. మీరు థియేటర్‌కి వచ్చి నాకు చెప్తే మనం తిరిగి సామాన్లతో ఇంటికి వచ్చెయ్యొచ్చుట.

సుందరం : అబ్బా... చాలా స్క్రీన్ ప్లే ఉందే!? ఇంతకీ అంత కాన్ఫిడెంట్‌గా ఎలా చెప్తుందబ్బా!

కమల : ఏమోనండీ... నాకూ అదే అర్థం కావటం లేదు. అడిగితే తెగ ఫోజు కొడుతోంది. ఇంతకీ అది చెప్పినట్టు చేద్దామా ఒద్దా?

సుందరం : అయ్యయ్యో... ప్రసక్తి లేదు... ఆ బాబాయ్ గాడి పీఠం కదలడానికి ఎవరేం చెప్పినా చేస్తా.. ఇంక కొశ్చెన్లేం వెయ్యకు. తను చెప్పినట్టు చేసెసెయ్. ఉంటా?

(ఫోన్ పెట్టేశాడు)

విమల : ఏం అన్నారు బావగారు?

కమల : నువ్వు చెప్పినట్టు చెయ్యమన్నారు.

విమల : ఇంకేం అలా చెయ్యి మరి

కమల : నాకెందుకో భయంగా ఉందే.

విమల : అదిగో ఆ మెతక తనమే ఒద్దన్నది.
అందుకే నువ్వు, బావా ఇలా సఫర్ అవుతున్నారు. నే చెప్పింది చెప్పినట్టు చచ్చినట్టు చెయ్యి. ప్లాన్ ఖచ్చితంగా సక్సెస్ అవుతుంది.

(కుక్క మొరుగుతుంది)

విమల : చూశావా బల్లి శకునం పలికినట్టు శునకం పలికింది. శునకం శకునం విజయ తథ్యం.

కమల : (నవ్వుకుంటూ) సర్లే!

-- కట్ --

(కోదండం వంటింటి ముందు తచ్చాడుతూ ఉంటాడు. కొద్దిగా తొంగిచూస్తూ)

కోదండం : ఏమ్మా విమలా వంటయ్యిందా?

(వెనక నుంచి వచ్చి ఠాప్‌మని రెండు చేతులతో బాదుతుంది విమల)

కోదండం : వామ్మోవ్.... ఏంటిదీ

విమల : సారీ బాబాయ్ గారూ.... వీపు కనబడితే చాలు ఇలా రెండు చేతుల్తోను అనడం అలవాటయి పోయింది. చిన్నప్పట్నించీ...

కోదండం : ఇదెక్కడి అలవాటమ్మా.... ఇంకాస్తుంటే పాశర్లపూడి బ్లో అవుట్ లా నోట్లోంచి ప్రాణం 'జుయ్య' మని పోయుండేది నాకు.

విమల : సారీ బాబాయ్ గారు. మరోలా అనుకోకండి . క్షమించండి. ఈ అలవాటు మానుకోవాలని ఎంత ప్రయత్నించినా వీలు కావటం లేదండీ. అందుకే మా ఊళ్ళో అందరూ నాకు ఎదురొస్తారే తప్ప వాళ్ళ వీపు కనబడేలా రారు.

కోదండం : సర్లేమ్మా! వంటయిందా

విమల : ఓ.... ఎప్పుడో అయిపోయిందండీ. ట్రైన్‌కి టైమ్ అయిపోతుందని అక్క ముందరే తినేసింది.

కోదండం : ఆ... ఆ... ఫోన్లో మీ బావ నాకన్నీ వివరంగా చెప్పేడ్లేమ్మా!

విమల : అదే బాబాయ్‌గారు అక్కయ్యకి కంపెనీగా ఉంటుందని నేను కూడా తనతో తినేశాను. మీరొక్కరే ఉండి పోయారు.

కోదండం : ఏం ఫరవాలేదమ్మా అటువంటి పట్టింపులేవీ లేవు నాకు.

విమల : మరి వడ్డించనా బాబాయ్ గారూ?

కోదండం : అలాగేనమ్మా కాస్త కాళ్ళు కడుక్కొని వస్తా.

(పెరట్లో కోదండం కాళ్ళు కడుక్కోడానికి కాస్త ఒంగుతాడు.

(వడ్డిస్తున్న విమల గరిటె పడేసి పరిగెట్టుకుంటూ వచ్చి దభాలున బాదుతుంది. అతనీ వీపు మీద)

కోదండం : వామ్మో!

(అతన్ని లేవనెత్తుతూ)

విమల : సారీ బాబాయ్ గారూ.... ఒద్దనుకుంటూనే అనుకోకుండా ఇటు చూశాను. మీ వీపు కనిపించింది. కంట్రోల్ చేసుకోడానికి విశ్వప్రయత్నం చేశాను. నావల్ల కాలేదు. చెప్పేనుగా బాబాయ్‌గారు... అదొక్కటే నా వీక్‌నెస్ అని....

కోదండం : ఈ లెక్కన నేనెక్కువ కాలం బ్రతకనేమో తల్లీ

విమల : ఏం చెయ్యను బాబాయ్‌గారూ....
ఈ పాడు అలవాటుని తల్చుకుని తల్చుకొని లోలోపల నేనెంత కుమిలిపోతానో ఆ భగవంతుడొక్కడికే తెలుసు, లాభంలేదు. మీలాంటి పెద్దవార్ని కొట్టిన ఈ చేతులు రెండూ ఉండడానికి వీల్లేదు. ఆ బండకేసి బాదేసి విరక్కొట్టేసుకుంటాను. లేదా స్టౌలో పెట్టి కాల్చేసుకుంటాను.

కోదండం : అంత పని చెయ్యకు తల్లీ.... అంతపని చెయ్యకు. ఎంతో మందికి అన్నం పెట్టాల్సిన ఈ చేతులకి ఆ గతి పట్టడానికి వీల్లేదు.

విమల : మరెలా బాబాయ్‌గారూ.

కోదండం : నేనే నా జాగ్రత్తలో ఉంటాన్లేమ్మా... ఎప్పుడైనా పొరపాటున ఏమారితే నా వీపు కనబడి నువ్వు బయల్దేరే ముందు ఓ సౌండియ్యమ్మా తప్పుకుంటా!

విమల : సరే బాబాయ్ గారు! వడ్డించాను రండి.

కోదండం : ఊ... ఇంతకీ నీకు వంటలూ అవీ చేతనౌనా లేక నన్నేమన్నా నేర్పించమంటావా...

విమల : మీరు వంట నేర్పిస్తారా?

కోదండం : ఆ... మీ బావనడుగు... జీడిపప్పు వేపుడు నా ప్రత్యేకత.

విమల : అయితే మీ దగ్గర అది తప్పకుండా నేర్చుకుంటాను. ఏదో నా వరకు మా అక్కకన్నా బాగానే వండుతానంటారు మా ఇంట్లో.



కోదండం : ఇకనేం... ఈ నెల్లాళ్లు మీ బాబాయ్‌కి మృష్టాన్న భోజనమే అన్నమాట.

విమల : అంతే బాబాయ్‌గారూ అంతే.

కోదండం : అద్సరే, నీ పెళ్ళి ఏర్పాట్లేం చేయట్లేదా మీ పెద్దాళ్ళు?

విమల : చేస్తున్నారండీ ఈలోగా నేనోవ్రతం పూర్తి చేయాలటండీ అందుకే ఇక్కడికి వచ్చాను.

కోదండం : వ్రతమా... ఏమిటదీ?

విమల : అదే బాబాయ్‌గారూ... పెళ్ళయి పిల్లలు పుట్టకపోతే 'నాగ దోషం' ఉందని పూజలు అవీ చేయిస్తారు చూడండీ. అలా పెళ్ళికి కావలసిన అన్ని అర్హతలు ఉన్నా, ఇంట్లో అందరికి పెళ్ళయి, ఆఖరి పిల్లకి మాత్రం పెళ్ళికాకపోతే ఆ పిల్లకి భైరవ దోషం ఉన్నట్టు లెక్కట. ఆ భైరవదోషం పోగొట్టుకోడానికే ఇలా రావాల్సి వచ్చింది.

కోదండం : భైరవదోషమా? కొత్తగా ఉందే?

విమల : అవును బాబాయ్‌గారూ మా ఆస్థాన ఫామిలీ జ్యోతిష్కుడు చెప్పాడు. ఆయన చెప్పినవి ఇది వరకు చాలా కరెక్టయ్యాయి కూడా.

కోదండం : అలాగా.... ఆ దోషం పోగొట్టుకోడానికి ఏం చెయ్యాలిట?

విమల : అదంతా ముందు భోం చేసేక తాంబూలం ఇస్తూ చెప్తానేం?

కోదండం : ఓహో తాంబూలం కూడా ఉందా ఇవాళ

విమల : అవును బాబాయ్‌గారు మీరు తృప్తిగా తిని మనసస్ఫూర్తిగా ఆశీర్వదించి, నా వ్రతానికి సహకరించారనుకోండి. ఆ భైరవ దోషాన్ని ఇట్టే పోగొట్టేసుకుంటాను. నాకు హెల్ప్ చేస్తారు కదూ బాబాయ్ గారు?
(గద్గద స్వరం తెచ్చేసుకుంటూ)

కోడండం : అయ్యో ఎంత మాట తల్లీ అదేమిటో చెప్పు చిటికెలో చేసేస్తాను.

విమల : ఈ నెల రోజులూ మీరు నా వంట సుష్టుగా, తృప్తిగా తినాలి. రుచిగా చేసే హామీ నాది. ఒక్క వెంతుక్కూడా మిగలకుండా తినే పూచీ మీది. అదీ ఈ వ్రతంలో ఒక భాగం.



కోదండం : ఓస్ ఇంతేనా దీనికి ప్రత్యేకంగా కష్టపడవలసిన పనే లేదు. రోజూ నే చేసే పనే అది. హేప్పీ, హేప్పీగా తింటా... (కంచాన్ని నాకి నాకి మొత్తం వంటంతా తినేసిన తర్వాత) ఆహా... అమృతప్రాయంగా ఉంది. ఇలా ఉంటే ఒక్క నెల్లాళ్లే ఖర్మ తరాలతరబడి తినమన్నా తినొచ్చు. ఓహో ... ఒక్క ముక్కలో అద్భుతం. రెండు ముక్కల్లో మహా అద్భుతం.

విమల : థాంక్యూ బాబాయ్ గారు థాంక్యూ... మీరిలాగే ఇంత ఇష్టంగానే తింటే నా వ్రతం నిర్విఘ్నంగా, దిగ్విజయంగా పూర్తయి పోతుంది. నాకు పెళ్ళయిపోతుంది.

కోదండం : తప్పకుండా అవుతుందమ్మా దానికి నా ఆశీసులు నీకెప్పుడూ ఉంటాయి. ఆ కుక్కని బైట కట్టెయ్య లేకపోయావుటమ్మా. అదిచూడు ఎలా చూస్తోందో చండాలంగా...

విమల : దయచేసి దాన్నిమాత్రం ఏం అనకండి బాబాయ్‌గారూ! నా వ్రతంలో అదికూడా ఓ భాగం. మీరు చేతులు కడుక్కురండి. మీ పాదాలకు నమస్కరించి తాంబూలం ఇచ్చి మొత్తం వ్రతం గురించి చెప్తాను.

5(కోదండం చేతులు కడుక్కుంటూ ఉంటాడు. వీపు కనిపిస్తూనే ఉంటుంది. విమల దూరం నుండి 'కూ' అంటూ సైలెంజన్ సౌండ్ ఇచ్చి పరుగెత్తబోతుంది. కోదండం తుళ్ళిపడి ఇటు తిరిగిపోయి, వెనక్కి తల, వీపు తిప్పకుండా వాష్‌బేసిన్‌లో విచిత్ర భంగిమలో చెయ్యి కడుక్కుంటూ ఉండగా విమల ఆగిపోతుంది.)

కోదండం : (తనలో) హమ్మయ్య! బ్రతికాను. లేకపోతే తిన్నదంతా కక్కేట్టు కొట్టుండేది దీని వీక్‌నెస్‌కి నిప్పెట్టా.
(చేతులు తుడుచుకుంటూ వచ్చి - తాంబూలం అందుకుని)
ఓహో అద్భుతంగా రాశావమ్మా - ఆకులకి సున్నం! అన్నీ సమపాళ్ళలో ఉన్నాయి. ఓహో బ్రహ్మాండం.... అద్దిరి పోయింది నాలుక! శీఘ్రమే కళ్యాణ ప్రాప్తిరస్తు. ఇక చెప్పమ్మా నీ వ్రత విధానం. కథా కమామీషు....

విమల : అదే బాబాయ్‌గారూ.... ఆ కుక్క లేదూ... అది ఓ రోజు మా ఇంటికి సడెన్‌గా వచ్చేసింది. ఎంత అదిలించినా పోలేదు. మా అందరి కాళ్ళు నాకుతూ అలా ఉంది. అదే సమయానికి పెళ్ళి సంబంధాల కోసం నా జాతకం చూస్తున్న మా జ్యోతిష్కుడు కూడా అక్కడే ఉన్నాడు.

కోదండం : జ్యోతిష్కుడు ఏంటమ్మా కనిష్కుడు లాగ... జ్యోశ్యుడు అనాలి.

విమల : అదేలెండి బాబాయ్‌గారు.... ఆయన దీన్ని చూసి చెప్పాడు.

కోదండం : ఏమని?;

విమల : మూడు తరాల ముందు ఆ కుక్క మా ఇంట్లో పాలేరుగా పని చేసేదంట బాబాయ్‌గారూ! మా ముత్తాతలు ఆ పాలేరుకి సరిగ్గా తిండి పెట్టేవారు కాదంట. దాంతో మా వంశం ఆ పాలేరుకి ఋణపడి పోయింది. ఆ ఋణం తీరితే గాని మా ఇంట్లో ఆఖరి పిల్లకి పెళ్ళికాదట.

కోదండం : ఆ పాలేరు ఈ జన్మలో కుక్కగా పుట్టిందన్నావ్ కదా... కుక్కకి ఋణం ఎలా తీర్చుకుంటారు అది మనలా షడ్రసోపేతమైన భోజనం చెయ్యలేదుగా.

విమల : అందుకే బాబాయ్‌గారూ రోజూ కాఫీ, టిఫెను, భోజనం అన్నీ దానికి ఓ ప్లేటులో పెట్టి అది తిన్న తర్వాత ఆ ప్లేటు కడగ కుండా అందులోనే సుష్టుగా తినగలిగిన గెస్టుకి నెల్లాళ్ళపాటు పెట్టాలట. ఆ నెల్లాళ్ళపాటు ఆ గెస్టు ఏంతిన్నా ఏం తాగినా అవన్నీ ఈ కుక్క ప్లేట్లోనే.... అది తిన్న తర్వాతే! అంతే కాకుండా ఆ గెస్టు తింటున్నప్పుడు, తాగుతున్నప్పుడు ఎదురుగా ఈ కుక్క కూచోవలసిందే. ఈ కుక్క కూచోక పోయినా ఆ అతిథి దేవుడు మధ్యలో ఎక్కడైనా బ్రేక్ ఇచ్చినా మళ్ళీ మెదట్నించీ మొదలు పెట్టి మరో నెల్లాళ్ళు చెయ్యాలట.

(అన్నీ కోదండం ఊహించుకుంటూ ఉంటే కళ్ళముందు కనిపిస్తూ ఉంటాయి).

అలా ఆ అతిథి దేవుడు వరసగా ఓ నెల్లాళ్ళ పాటు మన స్ఫూర్తిగా, సుష్టుగా తృప్తిగా, పొట్ట పగిలేట్టు, తింటే దాని ఋణం తీరిపోతుంది. మా ఇంటికి పట్టిన భైరవదోషం తీరిపోతుంది. నాకు పెళ్ళైపోతుంది బాబాయ్‌గారు.

కోదండం : అంటే తల్లీ... నాకిప్పుడు పెట్టిన ప్లేటూ...

విమల : (ఆనందంగా) ఆ కుక్క తిన్నదే బాబాయ్‌గారూ!

కోదండం : ఆ కుక్క తిన్నదా?

విమల : చూశారా చూశారా ఏదైనా సరే ఇట్టే వాసన పసికట్టేసే మీరు కూడా కనుక్కోలేక పోయారు. అంత శుభ్రంగా నాకేస్తుందండీ మా కుక్క. అచ్చం కడిగినట్టే ఉంటుంది ప్లేటు.

కోదండం : ఆఁ!?

విమల : ఆ.... మొత్తానికి మొదటిరోజు మొదటిపూట మీ దయ వల్ల వ్రతం విజయవంతంగా ముగిసింది. బాబాయ్‌గారూ! ఇలాగే మిగిలిన రోజులు కూడా మీరు నాకు సహకరించారను కోండి, నాకు పెళ్ళయిన తర్వాత పుట్టే పిల్లలందరికీ మీ పేరే పెట్టుకుంటాం. బాబాయ్‌గారూ.

కోదండం : ఆఁ!?

విమల : నాకు తెలుసు బాబాయ్‌గారూ మీరు సత్యసంధులూ, మాట మీద నిలబడే మనిషని!
మీరు మాట ఇచ్చారుగా తప్పకుండా నిలబెట్టుకుంటారు. నాకు భైరవదోషం పోతుంది. అతి త్వరలోనే పెళ్ళయి పోతుంది. అహ నా పెళ్ళంట, ఓహ నా పెళ్ళి అంట అహ నా పెళ్ళంట ఓహ నా పెళ్ళంట.

కోదండం : తల్లీ విమలమ్మ తల్లీ ఒక్కసారి ఇటు చూడమ్మా.

విమల : ఆ ఏంటి బాబాయ్ గారూ.

కోదండం : నాక్కూడా మాట నిలబెట్టుకోవాలని, నీ వివాహ విషయంలో శక్తివంచన లేకుండా సహకరించాలనీ ఉంది. కానీ నేనొచ్చిన పనేదో ఇవాళే అయిపోతుందేమోనని మా లాయర్ అన్నట్టు గుర్తు. అంచేత నేను మా లాయర్ దగ్గరికెళ్ళి సంగతి కనుక్కొని నా పని అయిపోతే అట్నించటే వెళిపోతే మరోలా అనుకోకేం?

విమల : అయ్యో బాబాయ్‌గారూ మీరు వెళిపోతే ఎలాగండీ? మీ మీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాను!! పైగా వ్రతం కూడా మొదలు పెట్టేశాం. మధ్యలో ఆగితే... హమ్మో.... నా పెళ్ళి... నా పెళ్ళి కూడా ఆగిపోతుంది బాబాయ్‌గారూ... అంచేత మీ పని అయిపోయినా సరే ఇంటికి వచ్చెయ్యండి. నెల్లాళ్ళు పోయాక వెళ్దురుగాని.

కోదండం : అది కాదమ్మ.

విమల : పోనీ మీరెక్కడ ఏ బంధువుల ఇంట్లో ఉంటారో చెప్పండి. అక్కడికి రోజూ నేనే కుక్క ప్లేటులో భోజనం, టిఫెను, కాఫీ అన్నీ తీసుకొస్తాను.

కోదండం : అబ్బెబ్బే...లేదమ్మా.... ఇంకే బంధువు ఇంటికి పొరపాటున కూడా వెళ్ళను. సరాసరి నా కొంపకే పోయి మా ఆవిడ వంట ఏ ప్లేటులోనూ కాకుండా అరిటాకులో తింటూ బ్రతుకుతా

విమల : మరి నా వ్రతం... నా భైరవదోషం?

కోదండం : కొన్నాళ్ళు పోయాక బ్రతికి బాగుంటే మళ్ళీ కనిపిస్తానమ్మా - వస్తానమ్మా. ఇప్పటికే కడుపులో శంఖాల మోతలు, కత్తుల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. వస్తానమ్మా.

విమల : సరే బాబాయ్‌గారూ.... మీరు తప్పకుండా రావాలి. మీ కోసం ఎదురు చూస్తూ ఉంటాను. మీరిక్కడికి ఎప్పుడొస్తే అప్పుడే నేనుకూడా మా కుక్కతో వచ్చేసి మొదలు పెడతా వ్రతం. అలాగేనా?

కోదండం : అలాగే తల్లీ అలాగే

(ఆల్మోస్ట్ తప్పించుకుని వెళుతూ బట్టల సంచీని ఒంగుని తీసుకుంటాడు. విమల అతని వీపు వైపు చూసి 'కూ' అని రైలింజన్ సౌండ్ ఇస్తుంది. కోదండం తుళ్ళి పడి ఇటు తిరుగుతాడు. విమల పరుగెడుతూ దగ్గరికి వస్తూ ఉంటుంది.

స్టాప్ బ్లాక్‌లో కోదండం 'అయ్యబాబోయ్' అంటూ అదృశ్యం అయిపోతాడు. (పరుగెత్తు కుంటూ వచ్చిన విమల కోదండం ఉన్న ప్లేస్‌లో ఉన్న ఖాళీని చూసి నడుం మీద చేతులు పెట్టుకుని మాయాబజార్‌లోని మాయా శశిరేఖ పోర్షన్ వేసిన సావిత్రిలా పగలబడి నవ్వు తుండగా.

-- కట్ --

కమల, సుందరం రావటం వాళ్ళకి విమల జరిగింది చెప్పటం, అందరూ ఆనందంగా నవ్వుకుంటూ ఉండడం ఇవన్నీ ఫ్రీజ్ షాట్స్‌లో కనిపిస్తూ ఉండగా సర్వర్ ధైర్యంగా వచ్చి ప్లేట్లు పెడుతూ ఉంటాడు. విమల చెప్పిందంతా విని సుందరం 'యాహూ' అని అరిచాడు. సర్వర్ అదిరిపడి ప్లేటు కిందపడేసి, లేచి, తిట్టుకుంటూ ప్లేట్లని తొక్కేస్తూ, టోపీ తీసి మ్యానేజర్ నెత్తిమీద పెట్టేసి బైటకి వెళ్ళిపోయాడు. కమల, విమల, సుందరం నవ్వుకుంటూ ఉండగా

శుభం



# లలిత సంగీతం

## మే 25 అన్నమయ్య జయంతిని పురస్కరించుకుని...

## ఎక్కడి మానుషజన్మం



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త, లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

ప॥ ఎక్కడి మానుషజన్మంబెత్తిన ఫలమేమున్నది
నిక్కము నిన్నే నమ్మితి నీ చిత్తంబికను ॥ఎక్కడి॥ 1.చ:

1.చ:మరువను ఆహారమ్మును మరువను సంసార సుఖము
మరువను ఇంద్రియ భోగము మాధవ నీ మాయ
మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వరహస్యము
మరచెద గురువును దైవము మాధవ నీ మాయ॥ఎక్కడి॥

2.చ: విడువను పాపము పుణ్యము విడువను నా దుర్గుణములు
విడువను మిక్కిలి ఆశలు విష్ణుడ నీ మాయ
విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును
విడిచెద నాచారంబులు విష్ణుడ నీ మాయ ॥ఎక్కడి॥

3.చ: తగిలెద బహులంపటములు తగిలెద బహుబంధములు
తగలును మోక్షపు మార్గము తలపున ఎంతైన
అగపడి శ్రీ వేంకటేశ్వర అంతర్యామివై
నగి నగి నను నీవేలితె నాకా యీ మాయ ॥ఎక్కడి॥

పద కవితా పితామహుడు అన్నమాచార్యుడు:
నవ విధాలుగా భక్తుల హృదయ క్షేత్రాలను సఫలవంతం
చేసిన భక్తి అనే మహా భావవాహిని పుంజీభూతమై సాకారమై...



## అన్నమాచార్య సంకీర్తన

| | |
|---|---|
| గానం, సంగీతం | : డా॥ మంగళంపల్లి బాలురళీ కృష్ణ. |
| రాగం | : భూపాలం |
| | రాగ్ బిభాస్ (హిందుస్థానీ సంగీతం) |
| తాళం | : చతురస్ర ఏక (త్రిస్ర గతి నడక) |
| | దాద్రా - (హిందుస్థానీ సంగీతం) |
| ఆరోహణ | : స రి గ ప ద స |
| అవరోహణ | : స ద ప గ రి స |

షడ్జము, శుద్ధరిషభం, అంతర గాంధారం, పంచమం, శుద్ధ దైవతం యీ రాగంలోని స్వరాలు.

మహా వాగ్గేయకారుడు, సంకీర్తనాచార్యుడు అయిన తాళ్ళపాక అన్నమాచార్యుడు రచించిన 32 వేల సంకీర్తనలలో సుమారు 13 వేలు మాత్రమే మనకు లభ్యమైనవి. అయితే అన్నమయ్య పాడిన స్వరసహితమైన సంగీత బాణీలు మనకు లభ్యం కాలేదు. అందుకని పలువురు సంగీత విద్వాంసులు ఆ సంకీర్తనలను స్వరపరిచి, బాణీలను కూర్చి మనకు

అందించారు. అందిస్తున్నారు. ఇతివృత్తాలలో ఎంతో వైవిధ్యాన్ని చూపుతూ మనలను పరవశపరిచే భావబలము, భాషతీర్పు, అనుభవాల లోతు అన్నమయ్య పదకవితలలోని అపూర్వమైన విశిష్ఠతలు. శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలుగా ప్రసిద్ధి గాంచిన ఆయన రచనలలో, జానపద శైలిలో మాండలీక శబ్దాల సొబగులతో గుబాళించే కీర్తనలు కూడా ఉన్నాయి. సంగీత పరంగా పరిశీలించినట్లయితే ఆయన కీర్తనలకు కూర్చబడిన బాణీలను - ఫక్తు శాస్త్రీయ పద్ధతిలో రాగాల స్వరూపాలతో అలరారేవిగానూ, లలిత శాస్త్రీయముగానూ, లలిత సంగీత పద్ధతిలో సరళమై, మనోహరమైనవిగాను, జానపద సంగీత చ్ఛాయలతో సుందరమైనవిగాను వర్గీకరించవచ్చును. ఇంతటి వైవిధ్యమైన సంకీర్తనలను వెలయించిన మహనీయుడు అన్నమయ్య.



సంసార సుఖము, ఇంద్రియ భోగము, ఆశా మోహాలు మొదలగు లంపటములన్నీ నీ మాయయే గద మాధవా! నిన్నే నమ్ముకున్న నన్ను నీవే కాపాడుమయ్యా అని అన్నమయ్య తిరుమలేశుని వేడుకునే యీ తత్త్వ సంకీర్తనకు స్వరకర్త బాలమురళి గారు. లలితమైన సరళమైన బాణీని భూపాల రాగంలో కూర్చి మనోహరంగా గానం చేశారు. భూపాల రాగానికి అతి సన్నిహితమైన రాగం బౌళి. భూపాల రాగానికి అవరోహణలో కాకనిషాదం చేరికతో బౌళి రాగం ఉత్పన్నమౌతుంది. లలిత సంగీతంలో చాలా గేయాలకు బౌళి రాగం ఉపయోగించబడింది. హిందుస్థానీ సంగీతంలో భూపాల రాగాన్ని బిభాస్ అని పిలుస్తారు. ఆ సంగీత పద్ధతి ప్రకారం అవరోహణలో స దా అని పాడడానికి జారు గమకం ద్వారా స ని దా అని ధ్వనించేటట్లు పాడడం, పగా అనేటప్పుడు, పమగా అని ప్రతిమధ్యమాన్ని స్పృశిస్తూ గాంధారాన్ని పలకడం, ఉత్తరాది సంగీతంలోని సంప్రదాయం. లలిత సంగీతం వివిధ రకాల సంగీతాలను తనలో చేర్చుకొని తనదైన రూపంతో భాసించడం దాని విశిష్ఠత. కాబట్టి భూపాల రాగంలోని గీతాన్ని పాడడంలో హిందుస్థానీ పద్ధతిలో పాడడం వలన బౌళి రాగంలాగా వినిపిస్తూ ఉంటుంది. ప్రభాత వేళ గానం చేయబడే భూపాల రాగం కర్ణాటక సంగీతంలో చాలా ప్రసిద్ధి చెందిన రాగాలలో ఒకటి.

నవ విధాలుగా భక్తుల హృదయ క్షేత్రాలను సఫలవంతం చేసిన భక్తి అనే మహాభావవాహిని పుంజీభూతమై, సాకారమై ఆంధ్రదేశమున అన్నమయ్యగా అవతరించింది. ఇది ఆంధ్రుల అరుదైన అపూర్వమైన అదృష్టం. శ్రీ వేంకటాచలపతి పై 32 వేల సంకీర్తనలనే కాక ద్విపద రామాయణం, వేంకటాచల మహత్మ్యం మొదలైన అనేకమైన తెలుగు, సంస్కృత గ్రంథాలను మానవమాత్రుడు రచించలేడు. అది అవతార పురుషునకే సాధ్యం. శ్రీ వేంకటాచలపతి హస్తమున గల వాడియైన నందకం దుష్ట శిక్షణలోను, శిష్టరక్షణలోను సమర్ధవంతమైనది. కాగా నందకాంశ సంభూతుడైన అన్నమయ్య తన అపూర్వమైన సంకీర్తనలతో మానవ హృదయ క్షేత్రాలలో భక్తి బీజాలు నాటి ఆనందాలను పండించాడు. అన్నమయ్యకు అరుదైన "వేంకటేశ్వర మంత్రం" లభించింది. ఆ మంత్ర ప్రభావం వలన "పరమ యోగీంద్రులకు భావగోచరమైన సరిలేని పాదాంబుజములు, తిరమైన గిరి చూపు, దివ్య హస్తములతో అలరారే తిరువేంకటా చలాధిపుని" అన్నమయ్య సాక్షాత్కరింపజేసుకున్నాడు. భవ్య భక్తి వైభవాన్ని, దివ్య తత్త్వ వైభవాన్ని అలతి అలతి మాటలతో అవ్యార్యంగా, అలవోకగా కీర్తనలలో వ ు న ˇ ఖ అందించాడు. "ఎంత మాత్రమున, ఎవ్వరు తలచిన అంత మాత్రమే నీవు...నీ వలన కొరత లేదు నీరు కొలది తామరవు" అంటూ పామరునకు సైతం భగవత్తత్వాన్ని వివరించాడు. అన్నమాచార్యుడు అందరివలనే సంగీత సాహిత్యాలను పట్టుబట్టి కూచుని సాధించ లేదు. భగవద్దర్శ నానందంతో మైమరచి అతని అంతరంగం కీర్తనలను ఆలపించింది. అందరికీ "అభయమిచ్చే చేయి"ని, "బ్రహ్మకడిగిన పాదము"ను మైమరచి వర్ణించాడాయన. ఒకపరి పొట్ట మీద పాల చారలతో, కనకపు మువ్వల పాదాలతో పారాడే "చిన్ని శిశువు"గా, ఒకసారి "కోనేటి రాయడు"గా భగవంతుని దర్శించాడు. నవరత్నాలను మరిపించే పదవ రత్నంగా ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డడైన శ్రీ కృష్ణుని "ముద్దుగారే యశోద ముంగిటి ముత్యము వీడు" అని, "పది వేల శేషుల పడగల మయము"గా కలియుగ వైకుంఠమనే "శ్రీ హరి వాసము" అయిన తిరుమల మందిరాన్ని, "అలరులు కురియగ ఆడెనదే" అంటూ "అలకల కులుకుల అలమేలుమంగ" దివ్య నృత్యాన్ని, "బ్రహ్మమొక్కటే, పరబ్రహ్మమొక్కటే" సకల జీవరాశులలో వ్యాపించి ఉన్నదని, దానికి జాతి, కుల, వర్గ వ్యత్యాసం అంటదని పలువిధాలుగా తన్మయత్వంతో గానం చేశాడు. 15 వ శతాబ్దివాడైన ఈ వాగ్గేయకారుని సంకీర్తనలు



ప॥ సా రి గ రి గ గ గ గా గా | గా ప ప ద ప గ ప గ రి రి స |
ఎ క్కు డి మా . ను ష జ న్మం | బె త్తి న ఫ ల మే . ము . న్నది |

సా రి గ గ ప గ ప గ రి రి స | సా రి స స స రి ; ; స ధా ; ; |
ని క్క ము ని . క్కి . న . మ్మని | చి త్తం . బి కే ను . . . . . |

రి గ రి ప గ రి రి స సా ; |
చి . చి . త్తం . బి కే ను . |

1.చ॥ గ గ ప ప గ ప పా పా ద ప | గ గ ప ప గ ప పా ప ద ప ప |
మ రు వ ను ఆ . హా ర మ్ము ను | మ రు వ ను సం . సా ర సు ఖ ము |

గ గ ప ప గ ప ప ప పా ద ప | పా ద ప ప ద ద స ద ప దా ; |
మ రు వ ను ఇం . ద్రి య భో గ ము | మా ధ వ నీ . మా . . . య . |

గ గ ప ద ద స స సా సా రి స | గ గ ప ద ద స స స సా రి స |
మ ర చె ద సు . జ్ఞా నం బు ను | మ ర చె ద త . త్త్వ ర హ స్య ము |

ప ద స ద స స స స స సా రి స | రి గ రి స స రి రి గ గా ; |
మ ర చె ద గు రు వు ను దై వ ము | మా . ధ వ నీ . మా . య . |

; ; ; ; ; ; || ఎక్కుడి మానుష జన్మం॥

మొదటి చరణం వలెనే మిగిలిన చరణాలు పాడుకోవాలి

నిక్షిప్తం చేయబడిన రాగిరేకుల నుండి వెలికి తీయబడి తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే గ్రంథాలలో ముద్రించబడి ఈ మధ్యనే ఎక్కువగా ప్రచారం చేయబడుతున్నవి. ఆ కీర్తనలన్నిటిపైనా రాగం, తాళం వ్రాయబడి ఉంది. అందులో చాలా రాగాలు ఈనాడు ప్రచారంలో లేవు. వాటిని గూర్చి పరిశోధించవలసిన అవసరం ఎంతైనా వుంది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు "అన్నమాచార్య ప్రాజెక్టు"ను నెలకొల్పి అన్నమయ్య కీర్తనలకు సంగీత విద్వాంసులచే స్వర రచన గావించి, వాటిని స్వర సహితంగా (నొటేషన్‌తో) అచ్చు వేయించి పలువురు గాయనీ గాయకులచే పాడించి, క్యాసెట్లుగా రూపొందించి, ప్రాజెక్టులో విద్యార్థులకు ఆ కీర్తనల శిక్షణను అందిస్తూ విస్తృత ప్రచారాన్ని కొనసాగిస్తున్నారు.

## భూపాల రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు.

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. కను మూసినా కనిపించే.. | సంతానం | ఘంటసాల | సుసర్ల దక్షిణామూర్తి |
| 2. తొలి సంజె వేళలో.. | సీతారాములు | బాలు / సుశీల | సత్యం |
| 3. మేలుకో శ్రీరంగా (కొంతభాగం మాత్రం) | విప్రనారాయణ | ఎ.యమ్. రాజా | యస్. రాజేశ్వరరావు |
| 4. పోయిరారా తిరపతి (కొంత మిశ్రమం జరిగింది) | తిరపతి | ఎ.యమ్. రాజా | చక్రవర్తి |
| 5. మేలుకో శ్రీరామా (కొన్ని భాగాలు మాత్రం) | శ్రీరామాంజనేయ యుద్ధం | బాలమురళి, లీల, బృందం | కె.వి. మహదేవన్ |
| 6. హమ్‌కో హోనే లగాహై ప్యార్‌కా (కొంత మిశ్రమం జరిగింది) | దిల్‌నే పుకారా | రఫీ, లత | కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ |

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# క్లాసిక్స్ రీటోల్డ్

# కంఠాభరణం

- పానుగంటి

**జరిగిన కథ**

పరమఛాందసుడైన సోమావధానులనే అతను భార్య, మరదలను వెంట బెట్టుకుని పట్నం వస్తాడు. ఆడవాళ్ళిద్దరూ రాత్రిపూట సర్కసుకి వెళతామంటే ఒప్పుకోడు. అతడు నిద్రపోయాక అక్కాచెల్లెలూ బయటకు జారుకుంటారు. వాళ్ళకి రామశాస్త్రులు అనే పిచ్చివాడు ఎదురు కావడంతో భయపడి పరుగులు పెట్టడంలో అక్కది ఓ దారీ, చెల్లిదీ మరోదారి అవుతుంది. సుబ్బిశెట్టి అనే వ్యాపారి తన షష్టిపూర్తి ఉత్సవాలకు కృష్ణారావు అనే అతను, అతను ఉంచుకున్న సుందరి అనే వేశ్య హాజరవుతారు. సుందరిని చూసి శెట్టి మోజుపడతాడు. మోజుపడి చాటుగా ఇంటికి రమ్మంటాడు. కృష్ణారావుకి పిల్లనిచ్చిన మామ సాయిబు వేషంలో వచ్చి కృష్ణారావుని కొట్టి బలవంతంగా సుందరిని లాక్కుపోతాడు. ఆశ్రయం కోసం వెతుకుతున్న సుబ్బలక్ష్మి ముసుగు కప్పుకుని సుబ్బిశెట్టి ఇల్లు చేరితే ఆమెను సుందరిగా భ్రమపడతాడు శెట్టి. ఇంతలో పిచ్చి రామశాస్త్రులు చొరబడి శెట్టిని కొట్టి బయటకు నెడతాడు. సుందరినెత్తుకుపోయిన సాయిబు సుబ్బిశెట్టి నౌకరు అనే అనుమానంతో కృష్ణారావు "ఆమె ఆచూకీ తేలేవరకు నీ 'కంఠాభరణం' నా దగ్గర హామీగా ఉంచు" అని లాక్కుంటాడు. గదిలో రామశాస్త్రి సుందరి మధ్య కాసేపు 'పిచ్చి' సంభాషణ నడిచాక అతన్ని కొట్టి సాయిబు వేషంలో బయటపడి అనుకోకుండా రుక్మిణి అనే ఓ స్త్రీ ఇంటికి చేరుతుంది. ఈ రుక్మిణి కృష్ణారావు భార్యే.

కంగారుగా వచ్చిన సుబ్బలక్ష్మిని 'ఎవరు నువ్వు?' అని అడుగుతుంది రుక్మిణి.

"నా పేరు సుబ్బలక్ష్మి. కొన్ని కారణాల వల్ల సాయిబు వేషం వేసుకున్నా. ఒకతను నా వెంట పడితే అతన్ని కొట్టి తప్పించుకున్నా. అతను 'ఈ వేపారి కృష్ణారావు పంతుల్నే కొడతావా? నీ పని పడతా!' అని అరుస్తూ నన్ను తరుముకుంటూ వస్తున్నాడు. మీరే రక్షించాలి" అంటుంది సుబ్బలక్ష్మి.

"సరే! నీకేం భయం లేదు. లోపలికెళ్లు" అని అభయమిస్తుంది రుక్మిణి.

కాసేపయ్యాక కృష్ణారావు అక్కడికి వస్తాడు. అతనికి రుక్మిణి తన భార్యేనని తెలీదు. ఎప్పుడో పెళ్లిలో చూడ్డమే! తరవాత ఆమె మొహం కూడా చూసెరగడు. కాని ఆమెకి మాత్రం కృష్ణారావు తన భర్త అని తెలుసు.

కృష్ణా : ఇటు పక్కకి ఒక సాయిబు ఎవరన్నావచ్చాడా?

రుక్మి : సాయిబులు మా యింటికెందుకు వస్తారు? అసలు విషయం ఏవిటి? అతను నీకేమైనా అపకారం చేశాడా?

కృష్ణా : (తనలో) ఒకవేళ ఈమెగూడా వేశ్య అయి వుండొచ్చు. పోయిందేముంది? ఓ రాయి వేసి చూద్దాం (పైకి) అతనా? నా అధీనంలో వున్న సుందరి అనే వేశ్యని బలవంతంగా తీసు కొచ్చాడు. కాని యిప్పుడు చూస్తుంటే అది నాకు అపకారం కాదు ఉపకారమే అయినట్లనిపిస్తోంది. లేకపోతే, నీలాంటి గొప్ప అందగత్తెని కలుసుకోగలిగేవాణ్ణా?




రుక్మి : నీ గంధం బొట్లూ అవీ చూస్తుంటే నువ్వొక వేపారి పంతుల్లా గున్నావ్. నీకిదేం బుద్ధి?

కృష్ణా : దేనికదే! పూజలు పూజలే! వ్యవహారం వ్యవహారమే!

రుక్మి : సరే, ఇప్పుడు నా మీద ఆసక్తి చూపిస్తున్నావ్. నీకో 'సాని' వుండంటున్నావు గదా, మరి ఆమెనేం జేస్తావ్?

కృష్ణా : ఆమెతో యిప్పుడు నాకు ఏ సంబంధమూ లేదు. ఆమెని వదిలేశా.

రుక్మి : ఎప్పుడు?

కృష్ణా : ఓ గంటయింది.

రుక్మి : సరే, మరీ నీ పెళ్లాం మాటేమిటి? మీ యిద్దర్నీ విడదీశానని లోకం నన్ను ఆడిపోసుకోదా?

కృష్ణా : ఎవరు నిన్ననేది? నాలుగో ఏట దానికి తాళి కట్టాను. ఇంత వరకు దాని మొహం చూళ్లేదు.

రుక్మి : సరే, మరి నీ ఆస్తంతా సుందరికిచ్చి, క్షౌరమై వుంటావు గదా, మరి నన్నేం పెట్టి పోషిస్తావ్?

కృష్ణా : నా విద్యతో. ఏదో కొంచెం పిలక జుట్టంత యింకా నాలో మిగిలి వుంది. అది చాలు. నేను కవిత్వం చెబుతాను. పాత సాహిత్యం తిరగరాసి, కొత్తది అనే భ్రమ కల్పించి డబ్బు సంపాదిస్తాను. దానితో నిన్ను పాలరాతి మేడల్లో వుంచుతాను - వచ్చే సంవత్సరాని కల్లా.

రుక్మి : మరి యీ సంవత్సరం గడిచేదెట్లా?

కృష్ణా : నాకు మద్దెల వాయించడం వచ్చు. దానితో నిన్ను సుఖంగా కడప రాయి మిద్దెలో పెట్టి పోషిస్తాను.

రుక్మి : క్షణంలో పాలరాయి మిద్దె కడపరాయి మిద్దె అయిపోయిందే! ఎందుకొచ్చిన కోతలు! కట్టుకున్న దాన్ని తెచ్చుకుని, యింత తిండి పెట్టలేవుగాని, నాకేదో ఒరగబెడతావట!

కృష్ణా : (రోషంతో) భార్యను తెచ్చుకోక పోవడానికి నా కారణాలు నాకున్నాయి.

రుక్మి : ఏం కారణాలు? భార్య అనేది ఒకటి యింట్లో వుంటే ఎన్ని ఆటలైనా ఆడొచ్చు. లేకపోతే నీకు అప్రదిష్ట, నాకు అప్రదిష్ట. వెళ్లి ముందు నీ భార్యని తెచ్చుకో!

కృష్ణా : రెండు సంసారాలు పోషించడం కష్టం.

రుక్మి : అలా అయితే, నన్నే వదులుకో!

కృష్ణా : అమ్మో! నిన్ను వదులుకోడమే! నిన్ను యితరుల చేతుల్లో నేనసలు వూహించుకోగలనా?

రుక్మి : పిచ్చివాడా! నీ పెళ్లాం గూడా ప్రాణం విసిగి, నీలాగే ఎవరినైనా చూసుకుని వుంటే, అప్పుడు ఏం చేస్తావ్?

కృష్ణా : ఆమె అలాంటిది కాదు.

రుక్మి : ఏమో! పరిస్థితులు! ఎవరు చెప్పగలరు?

కృష్ణా : బాబోయ్! నీ మాటలు వింటూంటేనే భయం వేస్తోంది. వెంటనే

వెళ్లి నా భార్యని తెచ్చుకుంటాను. నీవు నా కళ్లు తెరిపించావు. గురుదక్షిణగా యీ కంఠాభరణం తీసుకో! (అని మెళ్లో వెయ్యబోతాడు)

రుక్మి : ఆగాగు! మెళ్లో వెయ్యకు! నీవు నీ భార్యని తెచ్చుకునేవరకు నన్ను ముట్టుకునే వీల్లేదు. ఆ హారం యిలా ఎత్తి చేతిలో పడెయ్.

(కృష్ణారావు హారం ఆమె చేతిలో పడేస్తాడు. ఆమె దాన్ని పెట్టుకుంటుంది)

కృష్ణా : కొంచెం యీ రాత్రికి పడుకోడానికి నీ పంచపాళీ (వరండా)లో చోటిస్తావా?

రుక్మి : అయ్యో! హారం యిచ్చిన వాడికి ఆ మాత్రం చెయ్యనా! వెళ్లి పడుకో!

కృష్ణా : ఇంతకీ నీ పేరేమిటి?

రుక్మి : భారతి

(రుక్మిణి లోపలికి వెళ్తుంది. కృష్ణారావు వెళ్లి పడుకుంటాడు)

రుక్మిణి లోపలికి వచ్చి సుబ్బులక్ష్మిని అడిగి ఆమె కథంతా తెలుసుకుంటుంది. ఇంతలో సాయిబు వేషంలో వున్న రుక్మిణి తండ్రి శ్రీనివాసరావును, సుందరినీ కలిపి కట్టేసి తీసుకెళ్తూ రాజభటులు రోడ్డు మీద వాళ్లల్లో వాళ్లు గట్టిగా మాట్లాడుకుంటుంటారు. ఆ గొడవకి కృష్ణారావు బైటికి వచ్చి, శ్రీనివాసరావునీ సుందరినీ చూసి "వీడే నన్ను కొట్టి పారిపోయిన వాడు. ఇదే నా దగ్గర డబ్బు కాజేసిన వేశ్య" అంటాడు భటుల్తో.

అప్పుడు సుందరి "కృష్ణారావు అనే వాడి కోసం వేరే జట్టు భటులు వెతుకుతూ మనకి కనబడ్డారు గదా, ఆ కృష్ణారావు యితనే" అంటుంది. భటులు కృష్ణారావుని బంధిస్తారు.

"నన్నెందుకు పట్టుకున్నారు?" అని కృష్ణారావు అడిగితే, "సుబ్బిశెట్టి కంఠాభరణం కాజేసినందుకు" అని భటులు చెబుతుండగా, రుక్మిణి బైటకొస్తుంది. ఆమె మెళ్లో కంఠాభరణం వుండడం చూసి, ఆమెనీ బంధించి, కృష్ణారావుకీ ఆమెకీ కలిపి సంకెళ్లు వేస్తారు.

రుక్మిణి సాయిబు వేషంలో వున్న తన తండ్రి శ్రీనివాసరావుని గుర్తుపట్టి అరవబోగా, అతను అరవద్దని సైగ చేస్తాడు.

ఇంతలో సాయిబు వేషంలో వున్న సుబ్బులక్ష్మి బైటికొస్తుంది. "ఇతనే నన్ను రెండోసారి కొట్టిన సాయిబు. ఇతన్ని పట్టుకోండి" అని అరుస్తాడు కృష్ణారావు.

"నేను సాయిబును కాను. ఆడదాన్ని" అని సుబ్బులక్ష్మి తన సాయిబు దుస్తులు విప్పేసి గోవుల పంచెతో నిలబడుతుంది. కాని గడ్డం మాత్రం వూడిరాదు. భటుడు ఆమెతో "భలే వున్నావ్, ముండా సాహెబ్! నువ్వు గడ్డం వూడదియ్యకు. ఆ దుస్తులు గూడా మళ్లీ వేసుకో. మేం ఏ వేషంలో పట్టుకున్న వాళ్లని ఆ వేషంతోనే, అలాగే హాజరు పరచాలి" అంటాడు.

"అయ్యో! ఇంత బతుకుబతికి చివరికి బోడెమ్మ చేతులోనా తన్నులు తిన్నాను!" అని వాపోతాడు కృష్ణారావు.

"అమ్మయ్య! అందరూ దొరికారు. ఇంక పిచ్చివాడు ఒక్కడు మాత్రం దొరకాలి" అని కాస్త వూపిరి పీల్చుకుంటారు భటులు.

పిచ్చి రామశాస్త్రి తప్పించుకుని తిరుగుతూ, "నన్ను ఆ బోడిదే పట్టుకోలేక పోయింది. ఇక ఈ గాడిదలు పట్టుకోగలరా?... కాకరపర్తి స్వాములవారికి గారెలంటే ప్రాణం... శివుడికి ఏనుగు చర్మం, మాకు బోడిది యిచ్చిన యీ గళ్ళదుప్పటీ...." అని తన ధోరణిలో మాట్లాడుకుంటూ వుంటాడు.

ఇంతలో 'శంకర శాస్త్రి' అనే వైద్యుడు అక్కడికి వస్తాడు ఎవరో పిచ్చి పట్టిన పండితుడు వూళ్ళో తిరుగుతున్నాడని విన్న అతను, రామశాస్త్రి మాటలు విని 'బహుశా యితడే అతడేమో' అనుకుంటూ వుంటాడు.

శంక: (రామశాస్త్రితో) నమస్కారం. నేనొక వైద్యుడిని. నాకు 'ఆయుర్వేద భిషక చక్రవర్తి' అనే బిరుదుంది.

రామ: బాగుంది. విధవకి ముసుగెలాంటిదో వైద్యుడికి బిరుదలాంటిది.

శంక: (రామశాస్త్రి నాడి చూసి) నీకు జ్వరం వచ్చినట్లుందే! (అని ఒళ్ళు ముట్టుకుని చూడబోతాడు)

రామ: ఆఁ! ఆఁ! ముట్టుకోకు! ముట్టుకోకు! మా ఆవిడ ముండమోసింది. నేనింకా మైలస్నానం చెయ్యలేదు. నేను పిచ్చాసుపత్రిలో వున్నప్పుడు అక్కడి వైద్యుడు నాకు పాదరసపు గొట్టం (థర్మామీటరు) నోట్లో పెట్టుకోమని యిచ్చాడు. ఓ నిముషం అయ్యాక నా దగ్గర్నుంచి అది వెనక్కి తీసుకుని చూసి, 'పాదరసం ఎక్కలేదు. ఇతన్ని మంచం మీదినించి కిందకి దింపండి' అన్నాడు. అప్పుడు నేను వైద్యుడితో, 'ఒరే గుడ్డి ముండాకొడకా! నేను పాదరసం వున్న వైపు నోట్లో పెట్టుకోలేదు. అందుకే ఎక్కలేదు. మరి యిప్పుడు చెప్పు పిచ్చి నీకా, నాకా!' అని - ఇదిగో యిలాగే - లాగి ఒక్క లెంపకాయయిచ్చాను. (అని శంకరశాస్త్రిని కొడతాడు)

శంక: అబ్బ! ఎంత దెబ్బ కొట్టావ్!

రామ: కుదిరిందా తిక్క? హి... హి... కోటిపల్లి ధ్వజం విరిగింది. ఢుంఠి విఘ్నేశ్వరుడి తొండం వంకర పోయింది. ఆ దెబ్బతో అహోబిలం దాకా భూకంపం... నేనే నరసింహస్వామిని... (అంటూ శంకరశాస్త్రి మీదికి పోబోతాడు)

శంక: ఆగు!

రామ: అయితే నా బోడెమ్మని నాకు చూపించు! ఏం, నాకు మాత్రం పూనకం రాదా? నేను మరిడమ్మని, నా చెల్లెలు, నూకాలమ్మ. మా యిద్దరి మధ్యా కరణం మునసబులు నలిగి చస్తున్నారు.

శంకరశాస్త్రి అతనికి 'విద్యున్నిద్ర (బహుశా హిప్నాటిజమ్ లాంటిది) కల్పించి, తెలివి తప్పించి తనతో తీసుకెళ్తాడు, అతనికి చికిత్స చేసేందుకు

xxx

సీను మారగానే సోమావధాన్లూ, వెంకటశాస్త్రీ మాట్లాడుకుంటూ కనిపిస్తారు.

సోమ: అమ్మయ్య! ఇప్పుడు నాకు తృప్తిగా వుంది. నా భార్య కనబడలేదు గనక ఆమెకి యధావిధిగా ఘటశ్రాద్ధం పెట్టేశాను.

వెంక: ఈ దిక్కుమాలిన శ్రాద్ధాలకే యింత ఆనందపడి పోతున్నారే, ఇంక శుభకార్యాలంటే ఎంత సంతోషిస్తారో!

సోమ: శుభకార్యాలా! ఆ మాట నా చెవిని పడగూడదు. మామిడి తోరణం కట్టిన యింటిలో అడుగుబెట్టను... మా బావమరిది పెళ్ళిలో ఏం చేశాననుకున్నావ్? పక్కనే చిన్నపాక వేసుకుని వండుకుతిన్నాగాని, పందిట్లోకి అడుగుపెట్టలే! చివరికి మా వియ్యంకుడు - ఆయనా దిగ్గంతుడైన పండితుడులే...

వెంక: దిగ్గంతుడు కాదు మహానుభావా దిగ్దంతుడు

సోమ: ఆయనొచ్చి కనీసం ఆశీర్వచనానికైనా రమ్మన్నాడు. 'కుండలో పిడకా నిప్పూ పెట్టుకొని వస్తా... ఇష్టమేనా' అని అడిగా. మొహం యింత జేసుకుని వెళ్ళిపోయాడు. ఈ తర్క వేదాంతాలన్నీ కర్మశాస్త్రం ముందర బలాదూరే!

వెంక: అయ్యా! మీ తప్పులు దిద్దలేక ఛస్తున్నా - తర్క వేదాంతాలు కాదు, తర్క వేదాంతాలు. అప్పుడప్పుడు మీకు మతి చలించిందేమోనని నాకనుమానం వస్తూంటుంది.

సోమ: అంటే నాకు 'ఉత్పాతం' అంటావా?

వెంక: ఖర్మ! ఉత్పాతం కాదు స్వామి, ఉన్మాదం.





ఇంతలో రాజభటులు వచ్చి సోమావధానిని పిచ్చి వాడనుకుని పట్టుకుంటారు.

సోమా: ఇది అన్యాయం! నేను పిచ్చివాడినా? పిచ్చి వాణ్ణయితే యింత పద్ధతిగా క్రతువులు చెయ్యగలనా? మీరు నన్నుగురించి ఏఁవనుకుంటున్నారో! మీ నవాబుగారి చేతిలో అధికారం వుంటే నా చేతిలో అగ్నికార్యం వుంది. ఆయన యింట్లో మహాలక్ష్మి వుంటే మా యింట్లో సుబ్బలక్ష్మి వుంది.

వెంక: (భటులతో) అయ్యా! ఇతనో అమాయకుడు, ఛాందసుడు. పిచ్చివాడుకాడు. ఇతన్ని వదిలిపెట్టండి.

భటులు: అమ్మో! వదిలిపెడితే మా పీక లెగిరి పోతయ్. నడవండి.

సోమా: (వెంకటశాస్త్రితో) వీళ్ళు నన్ను జైల్లో పెడతారేమో, ఈ పూట అగ్నికార్యం ఎలాగయ్యా?

వెంక: అయ్యా! మీకిప్పుడు భార్య లేదు. భార్యలేనివాడు అగ్నిహోత్రానికి అనర్హుడు.

సోమా: ఇలాంటి చిక్కొస్తుందనే- నారద మహర్షి తన భార్య పోయాక బంగారు ద్రౌపదిని భార్యగా పెట్టుకుని రాజసూయం చేశాడు. అలాగే నేనూ పేడతో మా బంగారమ్మని తయారు చేసుకున్నా.

వెంక: రామ! రామ! ఏమి ఛండాలపు లంకెలు స్వామీ!

భటులు సోమావధానిని తీసుకెళ్ళి జైలులో పెడతారు. అతనక్కడ దిగులుగా కూచుని వుంటాడు. ఇంతలో జైల్లో వున్న సుబ్బలక్ష్మి సోమావధాన్లని గుర్తించి, 'అయ్యో! బావ! మరి అక్క ఏమయిందో?' అనుకుని, పైకి 'బావా!' అని పిలుస్తుంది.

సోమావధాని ఆమెని సాయిబు అనుకుని 'ఇదంతా నన్ను పిచ్చివాడుగా నిరూపించడానికి జరుగుతున్న కుట్ర' అనుకుంటాడు. వెంకటశాస్త్రి భటులతో 'బాబూ! ఈయన అందరి ఎదురుగా భోజనం చెయ్యడు' అని నచ్చచెప్పి, పచ్చళ్ళూ డబ్బులూ యిస్తానని ఆశపెట్టి, భోజనానికని చాటుకి తీసికెళ్తాడు. అక్కడ సోమావధానికి వితంతువు వేషం వేసి పారిపొమ్మని పంపిస్తాడు. జైలులో కంబళిచుట్టమీద దుప్పటి కప్పి అక్కడ మనిషి వున్నట్లుగా భ్రమకల్పిస్తాడు.

పారిపోతున్న సోమావధానుల్ని దారిలో ఒక భటుడు పట్టుకుని, 'నీ పేరేఁవిటి?' అని అడుగుతాడు. అతను గబుక్కున నోటికి వచ్చిన వితంతువు పేరు, 'సుబ్బలక్ష్మి' అని చెబుతాడు. అంతకు ముందే వెంకటశాస్త్రి - బంగారమ్మ, సుబ్బలక్ష్మి కనబడ్డం లేదని - ఫిర్యాదు యిచ్చి వుంటాడు. అంచేత 'సుబ్బలక్ష్మి' అన్నపేరు వినగానే భటుడు సోమావధాన్లని బంధిస్తాడు.

తరువాత ఘట్టం నవాబుగారి కచేరి. కంఠమాల కేసు విచారణ. అక్కడ నవాబు గారి గుమాస్తా 'రంగాచారి' అందర్నీ హాజరు పరుస్తుంటాడు.

'యాభై రూపాయలు లంచం యిస్తే నీ కంఠమాల నీకిప్పిస్తా'నంటాడు రంగాచారి సుబ్బిశెట్టితో. సుబ్బిశెట్టి అయిదు రూపాయలిస్తాడు. ఈలోగా నవాబు ప్రవేశిస్తాడు.

రంగా: (నవాబుతో): సలాం సర్కార్! ఈ శెట్టి తన కంఠాభరణం ఒక వేపారి పంతులు దొంగిలించాడని ఫిర్యాదు చేశాడు. అదే యీ రోజు ముకద్దమా (కేసు).

సుబ్బి: అంతేగాదు! నన్ను చచ్చేట్టు కొట్టాడు నవాబ్‌గారూ!

రంగా: (ఎవరికీ వినబడకుండా సుబ్బిశెట్టితో) ఎక్కడ కొట్టాడో చూపించు-శెట్టీ!

సుబ్బి: ఇక్కడ కొట్టాడయ్యా! (అని వెనకభాగాన్ని చూపిస్తాడు)

నవా: అరే, మాకీ చూపిస్తావ్, మారో యిస్కో (భటులు సుబ్బిశెట్టిని కొడతారు)

సుబ్బి: (రంగాచారితో, ఎవరికీ వినబడకుండా) నువ్వే చూపించమంటివి గదయ్యా!

రంగా: (రహస్యంగా) మరి యాభై అడిగితే అయిదిస్తావా?

సుబ్బి: కావలిస్తే యింకో పావలా తీసుకోరాదూ? నన్ను కొడితే నీకేమొస్తుంది?

నవా: ఇంకా ఎవరున్నార్? అందర్నీ తీస్కారండి.

(భటులు శ్రీనివాసరావునీ, సుందర్నీ కలిపి కట్టేసి, అలాగే కృష్ణారావునీ, రుక్మిణినీ, సుబ్బలక్ష్మినీ కలిపి కట్టేసి తెచ్చి హాజరు పరుస్తారు).

నవా: అరే, రంగాచారీ! ఎద్దులజోడీలా వుందీ రే! (సుందరికేసి ఓరగంట చూస్తూ) ముందర ఆమెనీ విచార్ణా చెయ్యి.

రంగా: సుందరీ! నీకు తెలిసిందంతా చెప్పు.

సుందరి జరిగిందంతా చెబుతుంది.

నవా: రంగాచారీ! సుందర్నీ విడిపించి మా దగ్గర్కి పంపించు. ఆఁ! ఇప్డు నువ్వూ విచారణా చేస్కో! సుందరీ! ఏక్ గానా గావ్!

సుంద: నాకు హిందుస్తానీ పాటలు రావు. పైగా పక్కవాద్యాలు గూడా లేవు.

నవా: అరే! అవ్వీ ఎందుక్కా! అల్లా యిచ్చిన గల్లా వుండాలె. ఒక్కో సానికీ తేనెపట్టూ లెక్కా వుంటది. ఒక్కోదాన్కి తెలకపిండి లెక్కా వుంటది.

నీ గల్లా బాగా వుంది. గావో!

సుందరి పాడుతుంది. తరువాత శ్రీనివాసరావుని విచారణ చేస్తారు.

- కృష్ణారావు తన అల్లుడినీ, భార్యని వదిలి సుందరి వెంటబడి ఆమెకి ఆస్తి రాసిచ్చాడనీ, తను సుందర్ని బలవంతంగా ఎత్తుకెళ్ళి ఆమెతో ఆస్తి తిరగరాయించుకున్నాననీ, తన తప్పుంటే శిక్షించమనీ చెబుతాడు శ్రీనివాసరావు.

నవా: మంచీ పనీ చేసినావ్! నీవు రాయించుకున్నా దస్తావేజ్ మేం ఖాయం చేసినాం. కృష్ణారావ్! సిగ్గ్గులేదూ! వందామందీ సానుల్నీ ఉంచుకో! కానీ పెళ్ళాన్నీ ఛోడ్‌నా నామర్దా!

కృష్ణా: సర్కార్, నాకు బుద్ధి వచ్చింది. నా భార్యని నేను తెచ్చుకుంటాను.

సుంద: సర్కార్, ఈయన మాటలు నమ్మకండి! భార్యని తెచ్చుకుంటానని అంటున్నాడు గాని అప్పుడే 'భారతి' అనే ఇంకో వేశ్యకి దగ్గరై ఆమెకి యీ కంఠమాల గూడా యిచ్చేశాడు, చూడండి!

నవా: కృష్ణారావ్! ఇదీ నిజమేనా!-

కృష్ణా: నిజమే సర్కార్! కానీ, నేను నా భార్యని తెచ్చుకుంటే ఆమెకేమీ అభ్యంతరం లేదు. పైగా నన్ను వెళ్ళి భార్యని తెచ్చుకోమని ఆమే ప్రోత్సహించింది, హుజూర్!

నవా: బస్! అట్లా అయ్‌తే నువ్వా యిప్పుడే వెళ్ళి నీ భార్యని తీస్కునిరా!

శ్రీని: సర్కార్! ఒక్క మనవి! భార్యని తెచ్చుకోడానికి కృష్ణారావు ఎక్కడికీ పోనక్కరలేదు. ఆమె యిక్కడే వుంది. మీరంతా భారతి అనీ, వేశ్య అనీ అనుకునే ఆమే నా కూతురూ, యితని భార్య ఐన రుక్మిణి. వీళ్ళని కలపాలనే నా ప్రయత్నమంతా. భగవంతుడు నా పని సులభం చేశాడు.

నవా: (కృష్ణారావుతో) గుడ్డీ ముండా కొడ్కా! మన్కూహా(వివాహిత స్త్రీ)కీ, రంకు ముండాకీ ఫరక్ తెలీదు. (భటులతో) యిస్కో ఖూబ్ మారో! (అప్పుడే సుబ్బలక్ష్మి వైపు చూసి) ఇదీ ఎవరు? ఆడా? మగా? పైనా దాడీ, కిందా గోవుల్ పంచా!

రంగా: (సుబ్బలక్ష్మితో) అమ్మా! నీకు తెలిసిన సంగతులన్నీ చెప్పు.

సుబ్బ: నా పేరు సుబ్బలక్ష్మి.

నవా: క్యా,క్యా, సుబాల్ కిమీ! థూ థూ! క్యా నామ్ రే! ఈమెని యిక్కడికి ఎంద్కూ తెచ్చినార్?

రక్షకభటాధికారి: చిన్న రక్షకభటాలయం వాళ్ళు ఈమెని పట్టుకుని యిక్కడికి పంపారు సర్కార్!

నవా: అయితే ఉస్కో బులావ్! ఇప్డూ మొకద్దమా ఖడాయించింది. సుందరీ! ఫిర్ గానా బజావ్!

సుంద: హంగుదారుడు, శృతి వేసేవాడూ ఉండాలి సర్కార్!

నవా: రంగారావ్! నువ్వా హంగు చెయ్యి.

రంగా: సుబ్బిశెట్టి శృతి వేస్తాడు సర్కార్.

సుబ్బి: (రహస్యంగా) నా కొంప ముంచకు రంగాచారీ!

రంగా: (రహస్యంగా) మరి యాభై అడిగితే ఐదే యిస్తావా?

నవా: అరే శెట్టీ, ఊం..బజా!

సుబ్బిశెట్టి శృతి వేస్తాడు. శృతి బండగా ఉందని నవాబు అతన్ని కొట్టమంటాడు.

రంగాచారి అతన్ని కొడుతూ, రహస్యంగా 'యాభై ఇస్తావా? యింకా కొట్టమంటావా?' అంటాడు.

సుబ్బిశెట్టి రంగాచారితో "ఇదిగో, గట్టిగా కొట్టకు! పదహారు రూపాయలకు ఫైనల్! ఇహ మాట్లాడకు" అంటాడు.

ఇంతలో బంగారమ్మని వెంటబెట్టుకుని 'వాతాపిశాస్త్రి' అనే అతను వస్తాడు. బంగారమ్మా, అతనూ, అక్కచెల్లెండ్ల పిల్లలు. వాళ్ళతో వెంకటశాస్త్రి గూడా వస్తాడు.

వాతాపిశాస్త్రి జరిగిన విషయం చెబుతాడు... బంగారమ్మ ఎక్కిన బండివాడికి చెపుడు. సరిగ్గా వినబడక, బండిని వాతాపిశాస్త్రి వుండే వూరికి తీసికెళ్తాడు. అక్కడ వాతాపిశాస్త్రి ఆమెని గుర్తుపట్టి తీసుకొస్తూ, మధ్యలో జరిగిన గొడవ తెలుసుకుని, కచేరీకి వస్తాడు...

అయినా, సోమావధానులు ఆమెతో మాట్లాడడు. 'ఘటశ్రాద్ధం' పెట్టేశా. ఇక చచ్చినవాళ్ళతో సమానం' అంటూ... నవాబు తన్నబోతే, 'మీరు చెప్పారని ఒప్పుకుంటున్నా, కాని నా శాస్త్రం మాత్రం తిరుగులేనిది' అంటూ బంగారమ్మని స్వీకరిస్తాడు.

ఆ సమయంలో శంకరశాస్త్రి, రామశాస్త్రి పిచ్చికుదిర్చి తీసుకొచ్చి, నవాబుతో, "ఇతనే మీరు వెదికే పిచ్చివాడు. ఇంక సోమావధానుల్ని వదిలెయ్యండి" అంటాడు.

అప్పుడు వాతాపిశాస్త్రి రామశాస్త్రిని సుబ్బలక్ష్మి భర్తగా గుర్తిస్తాడు.

"మరి మొగుడూ బత్కీ వుంటే సుబాల్‌కిమీకి గుండూ ఎందుకు చేసినార్?" అని అడుగుతాడు నవాబు.

"గుండు నేనే చేయించాను. అది శాస్త్ర నిర్ణయం" అంటాడు సోమావధాని.

నవాబు కోపంతో, "అరే, బత్కీ వున్న దాన్కీ తద్దినాల్ పెడతావ్? మొగుడూ వున్న దాన్కీ గుండు చేయిస్తావ్? థూ..." అని సోమావధానిని తిట్టి కొట్టిస్తాడు.

అంతా అయ్యాక, "దీనికంతా అసలు కారణమేఁవిటి?" అని అడుగుతాడు నవాబు. అంతా తలా ఒక మాట చెబుతారు. "ఇవేమీ కాదు. అసలు కారణం సర్కసు. ఆ సర్కసు వాణ్ణి ఖైదులో వెయ్యండి" అంటాడు నవాబు. "వాడెప్పుడో ఊరొదిలి వెళ్ళిపోయాడు" అని చెబుతాడు రంగాచారి.

"మనం అందరం సుబ్బిశెట్టికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నేను అతని కంఠాభరణం తీసుకోకుండా ఊరికే కొట్టి వూరుకుంటే అతను ఫిర్యాదు చేసేవాడు కాదు. మనం యిలా కలుసుకునే వాళ్ళం కాదు" అంటాడు కృష్ణారావు.

"అంతా బాగానే ఉన్నారు. కృష్ణారావుని అతని పెళ్ళానికి అప్పజెప్పారు. మరి నా గతి ఏమిటి?" అంటుంది సుందరి. నిన్ను నేను మా జనానాలో చేర్చుకుంటాను, మూడొందల పదమూడోదానిగా" అంటాడు నవాబు.

రామశాస్త్రికీ, సుబ్బలక్ష్మికీ శోభనం ఏర్పాటు చేస్తారు. "నాకు సిగ్గు బాబూ! అయినా గుండుతో శోభనం ఏవిఁటి?" అంటుంది సుబ్బలక్ష్మి. "నా దగ్గర విగ్గులున్నాయి. ఓ పాతిక తీసుకోండి" అంటాడు సుబ్బిశెట్టి. "పాతికెందుకు?" అంటే "ఏమో! ఈ సోమావధాన్లని నమ్మలేం! ఎప్పుడు ఎవరికి గుండు చేయిస్తాడో?" అంటాడు శెట్టి.

అందరూ కలవడంతో కథ సుఖాంతమై, నాటకం స్వస్తి వాక్యంతో ముగుస్తుంది.

**చిక్కని ప్రణాళిక, చక్కని ఉపదేశం, చక్కెర వంటి హాస్యం వున్న యీ నాటకం నిజంగా 'సాహితీ సరస్వతీ కంఠాభరణం' అంటే అతిశయోక్తి కాదు.**

(అయిపోయింది)

**-నిశాపతి**









విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ.40/-

తెలుగు సినీ గీతాలలో పుట్టినరోజుకు సంబంధించిన ఓ పదమూడు పాటలను తీసుకుని-లియోన్‌డిస్సౌజా స్వరపరచగా మాయు, బృందం పాడిన 'హ్యాపీ బర్త్‌డే టూ యూ' అనే ఆంగ్ల సంప్రదాయగీతాన్ని జతచేసి 'సినీ పుట్టినరోజు పాటలు' పేర ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు విడుదల చేశారు.

పుట్టినరోజు జేజేలు చిట్టిపాపాయి (బంగారు కలలు), బృందావనమొక ఆలయము(భలే కృష్ణుడు), నీ పుట్టినరోజు నీ నోములు పండిన రోజు(కంచుకోట), చిట్టీ పొట్టీ చిన్నారి పుట్టినరోజు (వెలుగునీడలు), మళ్ళీ మళ్ళీ పాడాలి ఈ పాట(మట్టిలో మాణిక్యం), ప్రతి పాప పుట్టేది (ఉపాయంలో అపాయం), హ్యాపీ బర్త్‌డే టూ యూ(మహమ్మద్‌బిన్ తుగ్లక్), పుట్టినరోజు పండగే అందరికీ(జీవనతరంగాలు), ఈనాడే బాబూ నీ పుట్టినరోజు (తాతా-మనవడు), కన్నతల్లి దీవెన(అమెరికా అబ్బాయి), ఈనాడు అమ్మాయి పుట్టినరోజు(తల్లిదండ్రులు), అన్నయ్య పుట్టినరోజు(మొనగాడు), ఒక నెలవంక (కోతల రాయుడు)పాటలున్నాయి ఈ క్యాసెట్‌లో.

క్వాలిటీ, కాన్సెప్ట్, ఇన్‌లేకవర్‌డిజైన్ అన్నీ ప్రశంసించదగ్గ స్థాయిలో ఉన్నాయి. 'అన్నయ్య పుట్టినరోజు' అనే పాటకి ఇన్‌లేకవర్‌పై ఇచ్చిన సమాచారం మాత్రం బాధపడేవిధంగా ఉంది. ఆ పాటకు సంగీత దర్శకుడు మహదేవన్ అయితే చక్రవర్తి అని ముద్రించారు. రచన ఆత్రేయ అని అన్నారు. కానీ ఆత్రేయ సాహిత్యంలో ఆ పాట ఎంత వెతికినా కనిపించదు. ఇదిలా ఉండగా ఓ చరణంలో శోకరసాన్ని నింపుకున్న 'ఈనాడు అమ్మాయి పుట్టినరోజు' పాటని క్యాసెట్‌లో పొందుపరచకుండా ఉండాల్సింది అని అనిపిస్తుంది. క్యాసెట్‌కి టైటిల్ 'పుట్టినరోజు పాటలు-సినీగీతాలు' అని ఉంటే బావుండుననిపిస్తుంది.






# రాంపండూ - రెసిడెన్షియల్ స్కూలూ



"ఒరేయ్, అనంతూ, ఇందాకా కాఫీకి వెళ్ళినప్పుడు అక్కడ సుమన, అదే సుమనోహరి కనబడిందిరా" అంటూ అరిచేడు రాంపండు గదిలోకి వస్తూ. అతడి ఉత్సాహం పట్టరాకుండా ఉంది.

భోజనానంతరం కునుకు తీస్తున్న అనంత్ విసుక్కున్నాడు. "ఒరేయ్, నీ పగటి కలలు ఆపు. సుమనోహరి ఈ ఊరెందుకు వస్తుందిరా?" అని.

"అదే నేనూ అనుకున్నాను. తనకి రాయవరంలో పనేముంటుందా అని. కానీ ముమ్మూర్తులా తనలాగే ఉంది. నేను డైనింగ్‌హాల్లోకి వెళుతుంటే తను వేరే గుమ్మంలోంచి వెళ్ళిపోతోంది."

"నాయనా రాంపండూ, పేకాటలో డబ్బు పోయి, పోయి నీ మతి పోయింది. తనకి ఇంత చిన్న ఊళ్ళో పనేముంటుందిరా? నీకూ, నాకూ అయితే పేకాట యాగం ఉందిగానీ..." అని నచ్చజెప్పబోయాడు అనంత్.

అనంత్ (అచలపతితో సహా), రాంపండు ఆ ఊరికి వచ్చింది పేకాట సప్తాహంలో పాల్గొనడానికే. అఖండ నామస్మరణ అంటూ రోజులపాటు కొందరు భజనలు చేస్తుండగా లేనిది ఓ వారం పాటు నిర్విరామంగా పేకాట ఎందుకు ఆడకూడదు? అన్న ఐడియా వచ్చింది వాళ్ళ మిత్రబృందంలో ఒకడికి. అందుకే పదిమంది ఫ్రెండ్స్‌ని పిలిచి రాయవరంలో వాళ్ళ ఔట్‌హౌస్‌లోనే బస ఏర్పాటు చేసి పేకాట క్రతువుని నిర్వహిస్తున్నాడు. ఆరోజే ఆఖరి రోజు. యజ్ఞఫలంలో అనంత్‌కి, రాంపండుకి పెద్దగా వాటాలు దక్కలేదు. ఇద్దరూ మధ్యాహ్నానికే డ్రాప్ అవుట్ అయిపోయారు. అనంత్ రూముకొచ్చి పడుకుంటే రాంపండు ఊళ్ళో తిరగబోయాడు.

మిగతా విషయాల్లో ఎలా ఉన్నా ప్రేమ విషయాల్లో మాత్రం రాంపండు పట్టువదలని విక్రమార్కుడు. సుమనోహరితో అతని స్నేహం బలపడి ఆమెను సుమన అని పిలిచేదాకా వచ్చింది. పేకాటయాగం గురించి చెప్తే ఆమె ఏమైనా అనుకుంటుందేమోనని చెప్పకుండా వచ్చేశాడు. తీరా చూస్తే ఇక్కడా ఆమె కనబడింది. ప్రియురాలిని వెంటేసుకుని పైరుల మధ్య, కాలువగట్లమీద తిరగడంలో మజాయే వేరు. ఆ అదృష్టం పోగొట్టుకోదలుచుకోలేదు రాంపండు. అందుకే ఆ హోటల్ దారి పట్టాడు.

ఆ హోటల్‌లో లాడ్జింగ్ సౌకర్యం కూడా ఉంది. వాకబు చేస్తే సుమనోహరి పేర రూమ్ బుక్ అయి ఉంది. వెళ్ళి తలుపు తడితే సాక్షాత్తూ సుమనోహరే తలుపు తీసింది. ఇద్దరూ కాసేపు ఆశ్చర్యాంబుధిలో ఈతలు కొట్టాక సుమనోహరి ఎనౌన్స్ చేసింది-

"మనం ఇవాళ మేట్నీ సినిమా చూడబోతున్నాం. ఆ తర్వాత ఇక్కణ్ణించి దగ్గర్లో ఉన్న టౌనుకెళ్ళి మంచి హోటల్లో డిన్నర్ చేద్దాం".

రాంపండు ఈసారి ఆనందాంబుధిలో తలమునకలైపోయాడు. "ఓ దేవతా! నాతో షికార్లు కొట్టడానికేనా ఇక్కడ ప్రత్యక్షమయ్యేవ్" అని అనేశాడు.

సుమనోహరి మనోహరంగా నవ్వింది. "అదేంకాదులే. మా కజిన్ రుక్మిణి ఇక్కడ రెసిడెన్షియల్ స్కూల్లో టెన్త్‌క్లాస్ చదువుతోంది. వాళ్ళ అమ్మా, నాన్న ఢిల్లీలో ఉన్నారు. ఇవాళ దాని పుట్టినరోజు. ఒంటరితనం ఫీలవుతుందని పలకరించడానికి వచ్చా. ఆ స్కూల్లో చాలా స్ట్రిక్టు. హాస్టల్లో బంధువులను ఉండనివ్వరు. అందుకే ఇక్కడ రూము తీసుకున్నా".

"ఇక్కడ రూము తీసుకోబట్టే నా కంటబడ్డావ్. నన్ను కరుణించావ్".

"అంత వద్దులే. నేను రాత్రికి ఊరికి తిరిగి వెళ్ళిపోవాలి".

"పోన్లే. అయితే ఏ సినిమాకెళ్దాం? 'పగలాడి వలలు' ఆడుతోంది ఊళ్ళో".

"ఛా,ఛా, చిన్న పిల్లలకు అలాటి సినిమాలు చూపిస్తే బావుండదు".

"చిన్నపిల్లలెవరు?" రాంపండు అయోమయంగా అడిగాడు.

"ఇంకెవరు? రుక్మిణి! పుట్టినరోజు పూట దాన్ని ఉసూరుమనిపించకూడదనే కదా ఇంత దూరం వచ్చింది".

రుక్మిణి మాట ఎలా ఉన్నా రాంపండు

ఉసూరుమన్నాడు. బలవంతపు నవ్వొకటి ముఖాన పులుముకుని "ష్యూర్,ష్యూర్" అన్నాడు."పోనీ 'సాయి మహిమలు' కే వెళదాంలే, టిక్కెట్లు తీసుకుని హాలు దగ్గర వెయిట్ చెయ్యనా?"

"బొత్తిగా 'సాయి మహిమలు' కాదుగానీ మరో సినిమా చూద్దాం. ఆ తర్వాత డిన్నర్‌కి వస్తుంది."

"డిన్నర్‌కి కూడానా?" రాంపండు దిగాలు పడ్డాడు. "బాగా చీకటి పడిపోతుంది. టౌను నుంచి తిరిగిరావడం లేటయిపోదూ? అంత చీకట్లో చిన్నపిల్ల...''రాంపండు నచ్చజెప్పబోయాడు.

"అందుకే డిన్నర్ తర్వాత రుక్మిణిని స్కూల్‌కి తీసుకెళ్ళి దింపే భారం నీకు అప్పగిస్తున్నాను. ఏంలేదు, వెంటబెట్టుకెళ్ళి ఫ్రంట్‌డోర్ బెల్లు కొట్టడం, రుక్మిణిని వార్డన్‌కి అప్పజెప్పడం - అంతే!"

రాంపండు బెదిరాడు కానీ రుక్మిణిని చూసాక ఫర్వాలేదనిపించింది. ఆ పిల్ల బుద్ధిమంతురాల్లాగానే అనిపించింది. సినిమాల్లో బుద్ధిగా ఓ చివర్లో కూచుంది. డిన్నర్ తీసుకుంటూ అవి కావాలి, ఇవి కావాలి అని డిమాండ్ చేయలేదు.

అంతా కలిసి రాయవరం వచ్చేసరికి రాత్రి తొమ్మిదిన్నర దాటింది. లాడ్జ్ దగ్గర పడుతూంటే సుమనోహరి గొంతు సవరించుకుంది-

"మైడియర్ రాంపండూ! నేను సామాను సర్దుకుని బస్సెక్కేస్తాను, నువ్వు రుక్మిణిని హాస్టల్లో దింపే విషయం జాగ్రత్తగా హేండిల్ చేసేయ్. ఐ నో, నువ్వు చాకచక్యంగా చేయగలుగుతావ్..."

అప్పటిదాకా ఆకాశవీధిలో విహరిస్తున్న రాంపండు ఒక్కసారి గతుకుల్లో పడ్డాడు. 'ఇందులో హేండిల్ చేయడానికేముంది?"

సుమనోహరి మొహం కాస్త అదోలా పెట్టింది. "ఇందాకా హడావుడిలో చెప్పడం మర్చిపోయాను. రుక్మిణి వాళ్ళ స్కూల్లో చెప్పి రాలేదు.."

''చెప్పి రాకపోవడమా? అసలే ఈ రెసిడెన్షియల్ స్కూళ్ళు మహా స్ట్రిక్ట్ కదా! జైళ్ళే నయం అనిపిస్తాయి. ముఖ్యంగా రుక్మిణి చదువుతున్న 'చండికా విద్యాలయం' మరీనూ. మన అనంత్ వాళ్ళ అత్తయ్య లేదూ, - మాంకాళి అత్తయ్య... ఆవిడ ఫ్రెండే ఈ స్కూల్ నడిపే చండికమ్మగారు. రాయవరం వచ్చినప్పుడల్లా ఆవిణ్ణి కలవాలని మాంకాళి అత్తయ్య ఆర్డరు. కలవాలంటే మనవాడికి అడల్. అందుకే ఊరికి వచ్చినా బయట తిరగటం లేదు".

"ఇప్పుడీ అనంత్ గొడవెందుకు?" విసుగ్గా అడిగింది సుమనోహరి.

"అబ్బే, అనంత్ గురించి కాదు చండికా విద్యాలయం సంగతి చెప్తున్నా. వాళ్ళు పిల్లల్ని బయటకు వదలరు అని చెప్తున్నా" రాంపండు గుటకలు మింగాడు.

''ఇప్పుడు మాత్రం రుక్మిణిని వదిలారనుకుంటున్నావా? చెప్పకుండా చెక్కుకొచ్చేసింది. తన రూమ్‌లోంచి బయటకు కదలకూడదని ఆర్డరేసింది వాళ్ళ మేడమ్"

"అదేమిటి పుట్టిన రోజుపూట కూడా అంత స్ట్రిక్టా?"

"పనిష్మెంటులే, పాపం రుక్మిణి ఓ చిన్న




ప్రయోగం చేసింది. వాళ్ళ టీచరు ఇంకుపెన్నులో కాస్త కోక్ కలిపి చూసిందట. పెన్ను కదిపినప్పుడు ఇంకు బుసబుసా పైకి వస్తుందా రాదా అని చూద్దామని. ఆ మాత్రానికే పనిష్మెంటు. పుట్టినరోజు అనైనా చూడటం లేదు. ఏం టీచర్లో, ఏమో" నిట్టూర్చింది సుమనోహరి.

రాంపండు రుక్మిణికేసి తేరిపార చూశాడు. రుక్మిణి అని పేరు పెట్టుకుని, ఇంత అమాయకంగా కనిపించే పిల్ల బ్రెయిన్‌లో ఇంత జిజ్ఞాస దాగి ఉందా అని. చెప్పా పెట్టకుండా హాస్టలు కిటికీలోంచి కొట్టుకొచ్చేసిన ఈ పిల్లను మళ్ళీ వాళ్ళకు అప్పచెప్పడం ఎలా? అదే అడిగాడు సుమనోహరిని.

"దానికి అయిడియా వుంది నాదగ్గర. నిజానికి నేనూ ఈ స్కూల్లోనే చదివాను. అప్పుడూ ఇలాటి సందర్భాలు ఎదురయినప్పుడు మేమో ట్రిక్ వేసేవాళ్ళం. ఇప్పుడు నువ్వూ అదే చెయ్" అంది చులాగ్గా.

దాని ప్రకారం రాంపండు రుక్మిణిని హాస్టలు మెయిన్‌గేటు దగ్గర నిలబెట్టి బెల్లు కొట్టే ముందు చేయవలసిన పని ఒకటి ఉంది. బిల్డింగ్ వెనకాల ఉన్న తోటలోకి దొంగతనంగా దూరి పూలకుండీ ఒకటి పట్టుకుని చెట్టు ఎక్కాలి. ఆ చెట్టు కొమ్మల్లో ఓ కొమ్మ మొక్కలు పెట్టే అద్దాల షెడ్ మీదకు వంగి వుంది. ఓ తాడు పెట్టి పూలకుండీని కొమ్మకు కట్టివేసి కిందకు దిగాలి. ఫ్రంట్ డోర్ బెల్లు కొట్టగానే ఎవరో ఆయా వచ్చి తలుపుతీస్తారు. సరిగ్గా అదే టైముకి తోటలోకి దూరి ఆ తాడు లాగాలి. దెబ్బకి పూలకుండీ అద్దాల కప్పుమీద పడి భళ్ళుమని శబ్దం వస్తుంది. ఫ్రంట్ డోర్ తీసిన ఆయా గబగబా తోటలోకి పరిగెత్తుకు వస్తుంది. చీకట్లో నక్కిన రుక్మిణి, చటుక్కున హాస్టల్లోకి చల్లగా దూరుతుంది.

ఈ పథకం వినగానే రాంపండుకి బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది. అది రెండు భాగాలు. మొదటిది తను, సుమనోహరితో కలిసి ఊరెళ్ళిపోవడం, రెండు ఈ రుక్మిణిని హాస్టల్లోకి తోసేపని అనంత్‌కి అప్పజెప్పడం.

మామూలు పరిస్థితుల్లో అనంత్ ఈ ఉపకారం చేయడానికి ఒప్పుకునేవాడుకాదు. ఈ సుమనోహరి ఏదో ఒక రూపంగా తనకు తలకాయ నొప్పి తెచ్చిపెడుతోందని అతనెప్పుడో గ్రహించాడు. పైగా ఆ స్కూలు మరోటీ, మఠోటీ కాదు సాక్షాత్తూ తన మేనత్త ఫ్రెండుది. ఏదైనా అడ్డం తిరిగితే విషయం బయటకు పొక్కుతుంది. ఊళ్ళోకి వెళ్ళినా తన ఫ్రెండుని పలకరించనందుకు అత్తయ్య క్లాసు తీసుకుంటుంది. అసలు ఊరెళ్ళడానికి కారణం పేకాటయాగం అని తెలిస్తే ఎక్స్‌ట్రా క్లాసు



తీసుకుంటుంది.

కానీ అనంత్ పై అన్నాడు. దానికో కారణం ఉంది. అంతకు అరగంట క్రితమే అనంత్ కొత్తగా కొన్న నైట్ డ్రస్సు మీద అచలపతి తన అభిప్రాయాన్ని ఘాటుగా చెప్పి వున్నాడు. అడ్డమైన దానికే తను అచలపతి సలహాపై ఆధారపడడం వల్లనే అతనికింత తెగింపు వస్తోందనుకున్నాడు అనంత్. స్వతంత్రంగా ఏదో ఒకటి చేసి చూపి అచలపతి అహాన్ని అణచాలని కంకణం కట్టుకున్న కాస్సేపటికే రాంపండు ఆఫర్ వచ్చింది.

"సరేరా, ఈ రుక్మిణి విషయం నా క్వొదిలేయ్. నువ్వు హాయిగా రైలెక్కేయ్" అని రాంపండుని పంపేసి అచలపతికేసి తిరిగి ఓ చిరునవ్వు నవ్వాడు.

"విన్నావుగా అచలపతీ, ప్లానంతా వింటే నీకు గందరగోళంగా అనిపించవచ్చు కానీ నాలాటి వాడు ఎడం చేత్తో చేసేస్తాడు..."

"సర్, నా దగ్గర ఇంతకంటె సులభమయిన ప్లాన్ వుంది". అన్నాడు అచలపతి హుందాగా తలవంచి.

"నీ ప్లాను నీ దగ్గరే అట్టిపెట్టుకో. నాకక్కరలేదు. నాకు కావలసినదల్లా ఓ పేద్దతాడు. ఐదు నిమిషాల్లో అది తీసుకుని నాతో రా. చండికా స్కూలు ఫ్రంట్‌డోర్ దగ్గరకు రుక్మిణని తీసుకుని వెళ్ళు. నేను వెనకనుంచి తోటలోకి వెళ్ళి పూలకుండీ కట్టేసాక వచ్చి నీకు సిగ్నల్ ఇస్తాను. అప్పుడు డోర్‌బెల్ మోగిద్దువుగాని" అంటూ సేనాధిపతిలా ఆదేశాలు గుప్పించాడు అనంత్.

"మీరు చెప్పినట్లే చేస్తాను సర్" అన్నదొక్కటే ఆచలపతి పెదాలనుంచి వచ్చింది.

అచలపతి మీద కోపం కొద్దీ రాంపండు ప్లాను సరేననేశానని అనుకుంటూనే అనంత్ గోడదూకి తోటలోకి దూరాడు. తనను తాను తిట్టుకుంటూనే పూలకుండీ వెతికాడు. జన్మలో సుమనోహరి అయిడియాలు వినకూడదని ఒట్టు వేసుకుంటూనే చెట్టెక్కాడు, కొమ్మల మీదనుంచి పాకాడు. అద్దాల కప్పుమీదకు వాలిన కొమ్మ మీదకు వచ్చి పూలకుండీని తాడుపెట్టి బాలన్స్ చేస్తూ కట్టాడు. తాడు కొనను కిందకు వదిలిపెడుతూండగానే కేక వినబడింది.

"హేయ్"



కిందచూస్తే పోలీసు కానిస్టేబుల్. బాటరీలైట్‌తో సహా.

"హేయ్ కిందకు దిగరా నా కొడకా"

పోలీసు వాళ్ళతో అనంత్‌కు కొన్ని పాత అనుభవాలున్నాయి కానీ ఇది బొత్తిగా హద్దులు మీరేట్టు ఉందనిపించింది. తనెంత పెద్దమనిషో తెలిసాక పోలీసు నాలిక కరుచుకోక తప్పదు కదాని జాలివేసింది.

"ఏయ్, వినబడలేదేమిట్రా?"

అరువులకు చండికాదేవిగారు లేస్తుందేమోనన్న బెంగవేసింది అనంత్‌కి.

"ష్, ఏం ఫరవాలేదు లేవయ్యా బాబూ" అన్నాడు కిందకు చూస్తూ. "ఫరవాలేదా? ఎవరికి? నువ్వక్కడ ఏం చేస్తున్నావో చెబితే ఫరవా ఉందో లేదో నేను చెబుతా" అన్నాడు పోలీసు కటువుగా.

"ఎవరు? నేనా?"

"అవును. నువ్వే".

"ఏం చేయటం లేదే!"

"తాడిచెట్టు ఎందుకెక్కావురా అంటే కనీసం దూడగడ్డి కోసమనైనా చెప్పాలి. ఏమీ లేదంటే ఎలా?"

"లేదు కాబట్టి లేదంటున్నాను" అనంత్ మొండికేశాడు. తలెత్తి సంభాషించడం పోలీసుకి దుర్భరంగా తోచినట్టుంది.

"నువ్వనలు కిందకు దిగిరా" అని ఆర్డరేశాడు. సాధ్యమైనంత నెమ్మదిగా చెట్టుదిగుతూ అనంత్ అనేక రకాలుగా ఆలోచించాడు కానీ సరైన సమాధానం ఏం చెప్పాలో తెలియలేదు. కానీ పోలీసు అతని కష్టాన్ని గుర్తించినట్టున్నాడు. చెట్టు దిగిన అనంత్

భుజాన చేయివేసి "స్టేషన్‌కి వద ఏం చెప్పుకుంటావో అక్కడే చెప్పుకుందువుగాని" అన్నాడు.

సుమనోహరి మాట విన్నందుకు ఒసారి, అచలపతి మాట విననందుకు ఒకసారి తననుతాను తిట్టుకుంటూండగా అచలపతి కంఠం వినబడింది:

"హమ్మయ్య, దొరికారన్నమాట! అరే అనంత్ గారు!"

ఈసారి పోలీసువాడి బాటరీ లైటు అచలపతి మొఖం మీద పడింది.

"నువ్వెవడివి?"

"నేను. అనంత్ గారి అసిస్టెంటుని"

"అనంత్ ఎవరు?"

"ఆయనే"

"ఈయన పేరు అనంత్. నువ్వాయన అసిస్టెంటువి. అంటే తోడుదొంగవా? ఈ వేళప్పుడు ఇక్కడేం చేస్తున్నావ్?"

"చండికమ్మగారు పంపితే వచ్చాను. తోటలో దూరిన దొంగల్ని అనంత్‌గారు పట్టుకున్నారో లేదో చూడమన్నారావిడ".

"దొంగలేమిటి?"

"అనంత్‌గారూ, నేనూ, చండికా మేడమ్‌ను పలకరిద్దామని వస్తుంటే తోటలో కనపడ్డవారు".

"సరిగ్గా చెప్పి చావు", పోలీసు విసుక్కున్నాడు.

"చండికా మేడమ్ మా అనంత్ గారి ఫ్యామిలీ ఫ్రెండ్. ఆవిణ్ణి పలకరిద్దామని ఆయన, ఆయన వెనుక నేనూ వస్తూ ఉంటే తోటలో ఎవరో మనుష్యుల అలికిడి వినబడింది. "వాళ్ళ సంగతి నేను చూస్తాను. నువ్వెళ్ళి ఆవిడకీ విషయం చెప్పు" అని మా అనంత్‌గారు నన్ను ఆవిడ దగ్గరకి పంపి ఆయన స్వయంగా తోటలోకి ప్రవేశించి..."

"...నేను చూసేటప్పటికి ఆయన చెట్టుమీదున్నాడు"

"దొంగలెక్కడున్నారో కనిపెట్టాలంటే చెట్టెక్కి చూడకపోతే ఎలా?" అడిగాడు అచలపతి.

పోలీసు కానిస్టేబుల్ తల విదిలించాడు. "ఈ కట్టుకథలో ఒక్క అక్షరం కూడా నేను నమ్మటం లేదు. ఇక్కడెవరో మసలుతున్నారని ఆ ఎదురింటాయన స్టేషన్‌కి ఫోన్ చేశాడు. వచ్చిచూస్తే చెట్టుమీద వీడున్నాడు. నువ్వొచ్చి ఏవేవో కథలు చెప్తున్నావు. అసలు మీ ఇద్దరూ తోడుదొంగలని నా అనుమానం".

"పోనీ మీరు చండికా మేడమ్ దగ్గరకి వచ్చి అడిగితే?" అచలపతి మాట విని అనంత్ ఉలిక్కిపడ్డాడు. తనమీద కసి తీర్చుకోడానికి ఇంతకంటె మంచి స్కీము దొరకలేదాని అడుగుదామనుకున్నాడు విడిగా దొరికితే.

కానీ అలా చూస్తుండగానే అందరూ కలిసి చండికగారి దగ్గరికి చేరడం జరిగింది. ఆవిడ అనంత్‌ను చూసి "దొంగలు దొరకలేదా అనంత్?" అని పలకరించింది. ఆ ప్రశ్నకు అనంత్ కంటె పోలీసు ఎక్కువ ఆశ్చర్యపడ్డాడు.

"అంటే - అంటే...మీరతన్ని గుర్తు పడతారా మేడమ్?"

చండికమ్మగారు మండిపడింది. "అసలు నువ్వెందుకు వచ్చావ్?"

అచలపతి టూకీగా చెప్పాడు. "ఈ పోలీసాయన అనంత్‌గార్ని చూసి దొంగనుకుంటున్నాడు మేడమ్".

"ఏడిసినట్టుంది. దొంగతనం చేయడానికి అతనికేం ఖర్మ? బోల్డంత డబ్బుంటేనూ! నాకు హెల్ప్ చేయబోతూంటే పాపం..."

"ఆ ముక్కే నేను చెప్పబోతే వినిపించుకోలేదు మేడమ్..."అచలపతి కాస్త ఎగదోసాడు.

"వీడో చవట. చిన్నప్పట్నించీ అంతే! మా స్కూల్లోనేగా చదివాడు. నాకు బాగా తెలుసు వీడి సంగతి" అంది చండిక ఘాటుగా. పోలీసువాడి మొహం మాడిపోయింది. "బావుంది మేడమ్, అర్థరాత్రి పూట చెట్టెక్కిన పెద్దమనిషిని దొంగనుకోక..."

ఇంతలోనే గాలికి కాబోలు కొమ్మమీద పెట్టిన పూలకుండీ అద్దాలకప్పుమీద పడి భళ్ళున శబ్దమయింది. అందరూ ఉలిక్కిపడ్డారు. ముందుగా తేరుకున్నది చండికమ్మే.

"ఆ దొంగల్లో ఓ వెధవ జారిపడ్డాడులావుంది. వాణ్ని వదిలేసి మా అనంత్‌ను పట్టుకున్నాడు వీడు. వీడిలాటి వాళ్ళ జీతాల కోసం మన దగ్గర పన్నులు వసూలు చేస్తోంది ప్రభుత్వం! ఏం చేస్తాం!" అంటూ విరుచుకుపడింది చండికమ్మ.

ఈ తిట్లు వినలేక, దొంగాణ్ని పట్టుకుందామనుకుని పోలీసు పారిపోయాడు. చండికమ్మ పొగడ్తలు విని, విని నెమరేసుకుంటూ ఇంటికి నడిచివచ్చేయడంలో అనంత్‌కు వళ్ళు తెలియలేదు. వచ్చాక అప్పుడు సడన్‌గా గుర్తొచ్చింది. "అవును అచలపతీ, మన కథానాయిక రుక్మిణి ఏమయినట్టు?" అన్నాడు ఉలిక్కిపడుతూ.

అచలపతి మెల్లగా, మెత్తగా దగ్గాడు. "సర్, మీరు వద్దంటున్నా నేను అనుకున్న సులభమైన ప్లాను అమలులో పెట్టాను సర్".

"అదేమిటి?"

"ఏమీ లేదు. నేను హాస్టలు తలుపు కొట్టి అనంత్ గారి దగ్గర పని చేస్తున్నానని, చండిక గారికీ కబురు చెప్పాలని వచ్చాననీ చెప్పాను. ఆవిడ్ని పిలవడానికి ఆయా అలా వెళ్ళగానే రుక్మిణి ఇలా లోపలికి దూరిపోయింది".

"ఇంత సులభమైన ప్లానా? మరి సుమనోహరి అంత కష్టమైన ప్లాను చెప్పిందేం? నాకుగానీ, రాంపండుకి గానీ ఇదెందుకు తట్టలేదు?"

అచలపతి కొనసాగించాడు. "రుక్మిణిని లోపలకు పంపించేస్తూండగానే ఓ పోలీసు తోటవైపు వెళ్ళడం కనబడింది. అక్కడ ఏం జరుగుతుందో ఊహించి, నేను చొరవతీసుకుని చండికగారి దగ్గరకెళ్ళి మీరు దొంగల్ని పట్టుకోవడానికి వెళ్ళారని చెప్పాను. ఆ తర్వాత కథ మీకు తెలిసిందే".

"తెలిసింది. తెలిసింది... ఇంకెప్పుడూ సుమనోహరితో జోక్యం పెట్టుకోకూడదని తెలిసివచ్చింది. తెలియనిదల్లా ఒకటే! నీకిన్ని తెలివితేటలు ఎక్కణ్ణించి వస్తాయని!" అన్నాడు అనంత్!

అచలపతి తలపంకించి ఊరుకున్నాడు.

**-ఎమ్బీయస్ ప్రసాద్.**

**(-పి.జి. ఉడ్‌హవుస్ రాసిన 'జీవ్స్ అండ్ ది కిడ్ క్లెమెంటినా' కథ ఆధారంగా)**



# ఇష్టపది

మార్కెట్లో విరివిగా అమ్ముడుపోతున్న ఆడియోలపై అభిప్రాయాల వేదిక

## సంతోషం



సంగీత దర్శకుడు ఆర్పీ పట్నాయక్, రచయిత కులశేఖర్‌లది సూపర్ హిట్ కాంబినేషన్. 'సంతోషం' కోసం కులశేఖర్ నాలుగు పాటలు రాసారు. ఈ నాలుగింటిలో 'దేవుడే దిగివచ్చినా' పాట తనను అమితంగా ఆకట్టుకుందని కులశేఖర్ అంటున్నారు. ఆ కారణాలను వివరిస్తూ - "భావ వ్యక్తీకరణ బాగా కుదిరింది. తొలిప్రేమ గురించిఇప్పటివరకూ చాలా మంది రచయితలు చాలా రకాలుగా రాసారు. నేను కొత్త స్టయిల్‌లో రాసానని అనుకుంటున్నాను. పదాల కాయినింగ్, శ్లేష బాగా కుదిరింది. 'కోయిలా నేర్చుకోయిలా', 'వెన్నెలా చూడు నన్నిలా', ఇలా పాట మొత్తం భలే గమ్మత్తుగా సాగుతుంది. అలాగే టైటిల్ సాంగ్ కూడా బాగా వచ్చింది. సినిమా బేసిక్ థీమ్‌ని రెండు లైన్లలో చెప్పడం జరిగింది". అని చెప్పారు.

## హోయ్.....



ఈ సినిమాలో 'హోయ్‌రే హోయ్... హోయ్‌రే...' అనే పాటని ఆర్పీ పట్నాయక్ పాడేడు. కోటి సంగీత దర్శకత్వంలో ఆర్పీ పాడడం అన్నది ప్రస్తుతం టాక్ ఆఫ్ ది (మ్యూజిక్) ఇండస్ట్రీ అన్నమాట.... ఆ పాట పాడడం ఎలా జరిగింది అని పట్నాయక్‌ని అడిగింది 'హాసం'. "కోటిగార్ని కలవాలను కోవటం, కుదరకపోవటం చాలా కాలం నుంచి జరుగుతూ వచ్చింది. ఆ మధ్య సడెన్‌గా కలవటం జరిగింది. అప్పుడు టైమ్ సరిగ్గా సాయంత్రం ఐదు గంటలు. మరో నలభై ఐదు నిముషాల్లో అంటే 5:45 కి నేను ఎయిర్‌పోర్ట్‌లో ఉండాలి. 'ఓ మంచి పాట ఉంది పాడతావా' అని అడిగారు కోటి. కాదనడానికి మనసొప్పుకోవడం లేదు, ఔననడానికి టైమ్ సరిపోతుందా అనే ఫీలింగ్. 'ఏం ఫర్వాలేదు. నువ్వు పాడగలవు' అన్నారు కోటి. కరెక్ట్‌గా పదిహేనంటే పదిహేను నిముషాల్లో నేను ఆ పాటను పాడేసి ఎయిర్‌పోర్ట్‌కి పరుగెత్తాను. ఆ పాటను విన్నవాళ్ళంతా బావుందని నాకు ఫోన్లు చేస్తూ ఉంటే ఆ రోజు సంఘటనలన్నీ కళ్ళలో మెదుల్తున్నాయి" అన్నారు ఆర్పీ పట్నాయక్ ఆనందంగా.

## అల్లరి



పాటల పిక్చరైజేషన్‌లోనూ, టోటల్ సినిమా టేకింగ్‌లోనూ డిఫరెంట్‌గా ఉందని విడుదలకు ముందునుంచే ఇండస్ట్రీలో పేరు తెచ్చుకుంది 'అల్లరి'!. 'ఈ సినిమాలో మీకు నచ్చిన పాటేది...ఎందుకు?' అని అల్లరి సినిమా దర్శకుడైన రవిబాబు తండ్రి - నటుడు చలపతిరావును అడిగితే-"అత్తయ్యో, మామయ్యో" పాట నాకు బాగా నచ్చింది. ఇవాళ ఫ్లాట్స్‌లో బ్రతుకుతున్న వాళ్ళకష్టాలకు ఓదార్పుగా, ఎంతో హుషారుగా ఉంటుందీ పాట. రవిబాబు కూడా ఎంతో బాగా తీసాడు. మావాడిలో ఇంత విద్య ఉందని ఇన్నాళ్ళూ నేననుకోలేదు. ఇ.వి.వి.లాంటి దర్శకుడు కూడా 'నేను జెలస్ ఫీలవు తున్నానయ్యా' అని అన్నారంటే....ఊహించుకోండి మావాడెంత బాగా తీసి ఉంటాడో" అంటూ తెగ పొంగిపోతూ - 'పుత్రోత్సాహం తండ్రికి' అనే పద్యాన్ని నిజం చేస్తూ చెప్పారు చలపతిరావు.

## లాహిరి లాహిరి లాహిరిలో



దశాబ్దన్నర కాలంగా గుంటూరు జిల్లాలో వంపిణీ దారుడుగా వ్యవహరించిన కామినేని వెంకటేశ్వరరావు 'లాహిరి లాహిరి లాహిరిలో' చిత్రానికి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. తనకు నచ్చిన పాట గురించి చెప్పమని 'హాసం' అడిగితే - "ఒక్కో పాట ఒక్కో స్టైల్లో ఉంటుంది. అన్నీ నచ్చినవే, మెచ్చినవే. వీటిల్లో ఏది బెస్ట్ అని చెప్పడం కష్టం. మీరడుగుతున్నారు కాబట్టి ఒక సాంగ్ గురించి చెబుతాను. టైటిల్ సాంగ్ 'అఆఇఈ'కి నేను ప్రథమ తాంబూలం ఇస్తాను. ఆ పాటను మోహన రాగంలో చేసారు. ఆ రాగంలో ఒక మత్తు, స్వీట్‌నెస్ ఉంటుంది. నేను మొదట్నుంచీ కూడా ఆ రాగంలో ఉన్న పాటల మీద మక్కువ కనబరుస్తాను. ఆ పాటకి ఆర్కెస్ట్రయిజేషన్ కూడా బాగా కుదిరింది. సీతారామశాస్త్రిగారు కలం ఝళిపించారు. ప్రేమ, ఆప్యాయత, అనుబంధం ఇవన్నీ మిక్స్ అయ్యాయీ పాటలో" అని తెలిపారు వెంకటేశ్వరరావు.

## కనులు మూసినా నీవాయే



తొలి తెలుగు డైలీ సీరియల్ 'ఋతురాగాలు' సృష్టికర్త శ్రీమతి మంజులానాయుడు తన భర్త సుధాకర్ పల్లమాల ప్రోత్సాహంతో వెండితెరపైకి అడుగుపెట్టారు. అంకితభావంతో విభిన్న ప్రేమకథా చిత్రంగా దీపక్, అర్చనలతో 'కనులు మూసినా నీవాయే' చిత్రాన్ని రూపొందించారు. ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి మంజులానాయుడు ఇలా మనసు ఆవిష్కరించారు. "సీతారామశాస్త్రిగారు రాసిన 'ఆపాలన్నా ఆగేనా' పాట వెరీ గుడ్ సాంగ్. ఎమోషనల్‌గా, ఫిజికల్‌గా ఓ అమ్మాయి ఓ అబ్బాయి గురించి స్పందించడాన్ని శాస్త్రిగారు బాగా వివరించారు. నేను దృశ్యపరంగా ఏం చెప్పాలనుకున్నానో, శాస్త్రిగారు భావరూపంలో పాటలో చెప్పారు. ఈ పాటలో మరో గొప్ప విశేషమేమిటంటే పల్లవి రిపీట్ అయినాగానీ ఆ పదాలు మాత్రం రిపీట్ కావు. మొత్తంగా మంచి సంగీతానికి మంచి సాహిత్యం జత కుదిరింది"

## ఆడుతూ పాడుతూ



ఈ చిత్రంలో ధర్మవరపు సుబ్రహ్మణ్యం పోషించిన వెరైటీ ఇన్‌స్పెక్టర్ పాత్ర బాగా నవ్వులు కురిపిస్తోంది. వీరప్పన్ స్టయిల్‌లో పొడుగాటి బొద్దు మీసాలతో చాలా గమ్మత్తుగా కనిపించారిందులో.

"ఈ చిత్రం పాటల్లో మిమ్మల్ని బాగా ఆకట్టుకున్నదేది?" అనడిగితే ధర్మవరపు సుబ్రహ్మణ్యం ఇలా జవాబిచ్చారు. "సెకండాఫ్‌లో వచ్చే స్లో సాంగ్ 'నీలి నీలి ముత్యమల్లె కనిపిస్తున్నావు, నింగిలోని జాబిలల్లె మురిపిస్తున్నావు' నాకు బాగా నచ్చింది. హరిహరన్, కావ్య ఆ పాటను చక్కగా ఆలపించారు. వాయిద్యాల కన్నా వాయిస్ బాగా వినిపిస్తుంది. లిరిక్ స్పష్టంగా అర్థమవుతుంది. నాకు మొదట్నించీ కూడా మెలొడీ అంటే ఇష్టం. మెలొడీ పాటలే ఎక్కువ సార్లు వింటుంటాను. ఫాస్ట్ సాంగ్స్ అందంగా ఉన్నా కానీ, మెలొడీ సాంగ్స్ ఇంకా అందంగా ఉంటాయి. అందుకే అందమైన ఈ మెలొడీ సాంగ్ నాకు బాగా నచ్చింది".

## మనసుతో



'ఆనందం' సినిమాతో తెలుగులో మంచి క్రేజ్‌ని సంపాదించుకున్న యువ కథానాయకుడు ఆకాష్ 'మనసుతో' చిత్రం మీద మంచి కాన్ఫిడెన్స్‌తో ఉన్నారు. ఈ చిత్రం డెఫినెట్‌గా మ్యూజికల్ హిట్ అవుతుందంటున్నా రాయన.

"'ఆనందం' సినిమాలో ఆల్ సాంగ్స్ హిట్. ఇందులో కూడా ఆల్ సాంగ్స్ డెఫినెట్‌గా హిట్ అవుతాయి. ముఖ్యంగా 'గోదారిలాగా' పాట అయితే మాత్రం ఎక్సెలెంట్. స్మూత్‌గా వుంది పాట. చిత్రీకరణ కూడా బావుంది. ఓ డిఫరెంట్ ఫీల్ ఈ పాటలో అగుపిస్తుంది. అలాగే 'ప్రేమిస్తే ఒకటే వనజ' 'మనసుతో సికాకులం పిల్ల' పాటలు కూడా బాగున్నాయి. దేనికదే పోటాపోటీగా ఉన్నాయి. షూటింగ్‌కి వెళ్ళేముందు, వచ్చేముందు కారులో ఈ పాటలే వింటున్నాను", అని ఆడియో గురించి వివరించారు ఆకాష్.

## అందం



నూతన తారాగణంతో శ్రీనివాసరెడ్డి దర్శకత్వంలో శబ్దాలయా థియేటర్స్ బేనర్‌పై ఎమ్మెస్ రెడ్డి 'అందం' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. చిత్ర దర్శకుడిని 'అందం' లో మీ మనసు దోచుకున్న పాట ఏదని అడిగితే ఆయన ఇలా వివరించారు.

"'నింగికి రంగుల హరివిల్లందం' పాటలో మంచి సాహిత్య విలువలున్నాయి. పల్లవిలో వచ్చే కంపేరిజన్స్ బాగున్నాయి. 'నేలకు తొలకరి చిరుజల్లందం', 'నీరెండకు నిగనిగలద్దే నీ అందం' అనడం బాగుంది. ఇక చరణాల్లోకి వెళ్తే - పేమాభిమానాలకు నోచుకోని ఓ కుర్రాడి జీవితంలోకి ఓ అమ్మాయి ప్రవేశించి జీవిత మాధుర్యాన్ని చూపిస్తుంది. ఆ కృతజ్ఞతా భావాన్ని ప్రతి అక్షరంలోనూ కనబరుస్తూ పాట పాడతాడు. సాధారణంగా ప్రేమ పాటల్లో ఇక్కడ ముట్టుకున్నాం, అక్కడ గంతులేసాం, అని చెప్పుకుంటుంటారు. అదంతా కథకు దూరంగా వుంటుంది. ఇందులో మాత్రం కరెక్టు వే లో ఎమ్మెస్ రెడ్డి గారు, అద్భుతంగా రాశారు. ఆయన చేత నాలుగు వెర్షన్లు రాయించుకున్నాను. చాలా ఓపిగ్గా రాసారాయన. ఈ పాట సక్సెస్ క్రెడిట్ ఆయనదే. మ్యూజిక్ పరంగా, లిరిక్ పరంగా, విజువల్‌గా, ఎక్సెలెంట్ సాంగ్ ఇది. శంకర్ మహదేవన్‌తో రెండు సార్లు పాడించి డబుల్ ట్రాక్ చేయించాం. దాని వల్ల మ్యూజిక్‌లో డెప్త్ పెరుగుతుంది".

## ప్రేమంటే...



'6టీన్స్, ఇదే నా మొదటి ప్రేమలేఖ' చిత్రాల నిర్మాత జక్కుల శ్రీనివాస్‌రెడ్డి నిర్మించిన 'ప్రేమంటే' చిత్రం ద్వారా మరోసారి మ్యూజిక్ సెన్సేషన్ సృష్టించబోతున్నారు శశిప్రీతమ్. ఈ చిత్రం ఆడియో గురించి శశిప్రీతమ్ చెబుతూ - "ఇప్పుడొచ్చే ఆడియోల్లో అన్నీ ముంబై సింగర్ల గొంతులే వినిపిస్తున్నాయి. అందుకే 'ప్రేమంటే' ఆడియోని కొత్తగా చేయాలనిపించింది. తెలుగులో ప్రస్తుతం మంచి స్వింగ్‌లో వున్న ఆరుగురు మ్యూజిక్ డైరెక్టర్లతో ఆరు పాటలు పాడిస్తే వెరైటీగా నే కాకుండా, ఎక్స్‌పెరిమెంటల్‌గా వుంటుందనుకున్నాను. ఆర్పీ పట్నాయక్, చక్రి, ఘంటాడి కృష్ణ, లతో పాటు నేను కూడా పాట పాడాను.

గతంలో ఎవ్వరూ ఇలా అందరు సంగీత దర్శకులతో పాటలు పాడించలేదు" అని అన్నారు.

ఇందులో మీకు నచ్చిన పాట ఏదని అడిగితే - "నేను ఉష పాడిన 'ప్రియా నీకోసం' పాటను కొత్త తరహాలో చేయడం జరిగింది. బేసికల్‌గా ఇటీవలి పాటల్లో కీ బోర్డ్ ప్లేయర్స్‌ని ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. అలా ఎలక్ట్రానిక్ వాయిద్యాలు కాకుండా ఒరిజినల్ ఇన్‌స్ట్రుమెంట్స్ అయిన తబలా, వయొలిన్‌లను ఉపయోగించి ఈ పాట చేయడం జరిగింది. ఇది మంచి మెలొడీ సాంగ్ కూడానూ" అని తెలిపారు శశిప్రీతమ్.

## నిన్నే చేరుకుంటా



శ్రీ ఇందిరా క్రియేషన్స్ బేనర్‌పై మౌర్య దర్శకత్వంలో టి.వి.వి.యస్.యన్. వర్మతో కలిసి 'నిన్నే చేరుకుంటా' చిత్రాన్ని నిర్మిస్తున్నారు బీగాల సుబ్బా రాయుడు. ఇ.వి.వి. 'చెవిలో పువ్వు' మొదలు కుని ఇప్పటి వరకూ పదిహేను సినిమాల్లో అభిరుచితో నటించిన ఈ ఆక్వా బిజినెస్‌మేన్ మౌర్యతో పరిచయంతో ఈ ప్రాజెక్ట్ చేస్తున్నారు. "మా ప్రాజెక్టు మీద మాకు మంచి కాన్ఫిడెన్స్ ఉంది. ఆడియో రిలీజయ్యాక బైటివాళ్ళకి కూడా మా ప్రాజెక్ట్ మీద ఎక్స్‌పెక్టేషన్స్ పెరిగాయి" అని చెప్పారు సుబ్బారాయుడు.

ఈ ఆడియోలో మీకు నచ్చిన పాట ఏదని ప్రశ్నిస్తే - 'ఎల్లిపోకే ఎల్లిపోకే' పాట నాకు బాగా నచ్చింది. ఇప్పుడు ఇలాంటి ఫోక్ సాంగ్స్‌కి డిమాండ్, క్రేజ్ బాగుంది. నేటివిటీ టచ్‌తో మళ్ళీ మళ్ళీ వినబుద్ధేస్తుంది. 'నీ ప్రేమకై' సాంగ్ కూడా అద్భుతంగా ఉంది. ఆర్పీ పట్నాయక్ గారు నాలుగు పాటలు పాడటంతో మా ఆడియోకి మంచి క్రేజ్ వచ్చింది" అని చెప్పారు సుబ్బారాయుడు.

మే 17 శాంతకుమారి పుట్టిన రోజు సందర్భంగా...

# మృదు మధుర గళం మరుపురాని నట వైదుష్యం
# వెరసి పి.శాంతకుమారి



తెరమీదనే కాకుండా నిజజీవితంలో కూడా శాంతరసాన్ని ఆవిష్కరిస్తూ, అంతకంటే మధురమైన తన గాత్రంతో ప్రేక్షకులను ఆనంద డోలికల్లో తేలియాడించిన అలనాటి అపురూప నటగాయని పి.శాంతకుమారి.

పువ్వు పుట్టగానే.....

17-05-1920న కడప జిల్లా ప్రొద్దుటూరులో జన్మించిన శాంతకుమారి అసలు పేరు వెల్లాల సుబ్బమ్మ. ఈమె పినతండ్రికి సంతానం లేని కారణంగా ఈమె బాల్యమంతా కడపలో అతని వద్దే గడిచింది. ఈమె తల్లి పెద్ద నరసమ్మ సంగీత విద్వాంసురాలు కావడంతో సహజంగానే శాంత కుమారికి ఆ సంగీత వాసన అబ్బింది. తల్లి పాడుతుంటే విని తనూ అలాగే పాడడం గమనించిన అమ్మమ్మ ఈమెకు మంచి గురువును పెట్టి సంగీతాన్ని నేర్పించాలనుకుంది.

"నాకు బాల్యంలో సంగీతం పట్ల ఎంతగా అభిమానం ఉండేదంటే, మామూలు చదువు మీద దృష్టి నిలిచేది కాదు... సంగీతం ముందు ఆ చదువులు విసుగ్గా అనిపించేవి. కానీ సంగీతంలో పై స్థాయికి వెళ్ళాలంటే కనీసం థర్డ్ ఫారమ్ (8వ తరగతి) చదివి వుండాలి కాబట్టి చదువుపట్ల ఆసక్తిలేక పోయినా చదవక తప్పింది కాదు" అని శాంతకుమారి చెప్పారు. రోజురోజుకూ కుమార్తెలో పెరుగుతున్న సంగీతాభిలాషను కాదనలేక ఆమె తల్లిదండ్రులు ఆమెను తీసుకువచ్చి మద్రాసులో కాపురం పెట్టారు.

ఆ రోజుల్లో మద్రాసు నగరంలో ప్రొఫెసర్ పి.సాంబమూర్తిగారు పేరు మోసిన సంగీత విద్వాంసులు. ఆయన మద్రాసులో సమ్మర్ స్కూలు నడిపేవారు. అతని శిష్యురాలిగా శాంత కుమారిని చేర్పించారు ఆమె తల్లిదండ్రులు. సాంబమూర్తి వద్ద శాంతకుమారి చేరేటప్పటికి ప్రఖ్యాత సంగీత విద్వాంసురాలు డి.కె.పట్టమ్మాళ్ అక్కడ నాలుగేళ్ళ సీనియర్. శాంతకుమారి సాంబమూర్తిగారి శిక్షణలో గాత్రంలోనే కాక ఫిడేల్ వాయించడంలో కూడా ప్రావీణ్యురాలైంది.

## విద్యార్థినిగా మరిచిపోలేని సంఘటన

సాంబమూర్తిగారు కచేరీలకు శిష్యురాళ్ళను సైతం వెంటబెట్టుకొని వెళ్ళేవారు. కచేరీలో సాధారణంగా డి.కె.పట్టమ్మాళ్ పాడేది. శాంతకుమారికి అప్పుడప్పుడు పాడే అవకాశం వచ్చేది. ఆ విధంగా తిరుచ్చి, తంజావూరు, మధురై ప్రాంతాల్లో చాలా కచేరీలు చేసింది శాంతకుమారి. అలా గురువుతో కలిసి కచేరీలు చేసే రోజుల్లో జరిగిన ఓ సంఘటన తనకు మిగిలిన జ్ఞాపకాల్లో మధురమైందని ఈనాటికీ చెప్పుకుంటుంది శాంతమ్మ. ఆ జ్ఞాపకం ఆమె మాటల్లోనే తెలుసుకుందాం. "అప్పట్లో ప్రతి సంవత్సరం చిదంబరంలో మ్యూజిక్ స్కూళ్ళకు పోటీలు జరిగేవి. ఆ పోటీలకని మేమంతా రైలులో చిదంబరంకు బయలు దేరాం. అప్పుడు సాంబమూర్తి గారు 'ఖరహరప్రియ' రాగంలో కీర్తనలేమైనా చెప్పారా? అనడిగారు నన్ను. చెప్పలేదన్నాను. అందులో పాడితే బాగుంటుందే అన్నారాయన. ఒకసారి పాడి వినిపించమన్నాను. ఆయన పాడుతుంటే మా స్నేహితురాలు శ్యామల స్వరాలు, సాహిత్యం రాసేస్తోంది. అలా ఆ పాటను ఆయనచేత మూడు సార్లు పాడించుకున్నాను. ఎలాగైనా ఈ రాగంలోనే పాడి బహుమతి కొట్టేయాలనే పట్టుదల పెరిగింది. చిదంబరంలో దిగగానే, మా విడిదికి వెళ్ళి, గట్టిగా ఆ పాటనే సాధన చేశాను. స్వరంతోబాటు బాగా వచ్చేసింది. మరుసటి రోజు స్టేజీ ఎక్కి "పక్కల నిలాబడి కొలిచే" అనే త్యాగరాజ కృతిని అందుకున్నాను. మాష్టారు నివ్వెర పోయారు. నాకాయన మొహంలో కంగారు స్పష్టంగా కనిపిస్తోంది. ఆయన నేర్పించని పాట పాడి, నేను స్కూలుకు చెడ్డపేరు తెస్తానేమోనని ఆయన భయం. నేను మాత్రం స్వరాలల్లి, అల్లికలు తీసి, సంగతులు వేసుకొని పాడుతుంటే నాకు అద్భుతంగా తోచిందొక్క సారిగా! పాటంతా అయ్యాక మా గురువుగారు ఇంత బాగా ఎలా పాడగలిగావని నన్ను మెచ్చుకున్నారు. గురువుగారి భార్య 'మాకు పిల్లల్లేరు. నువ్వే మా బిడ్డవని ఆనందంగా అక్కున చేర్చుకున్నారు. అప్పట్నుంచే సాంబమూర్తిగారు మరింత శ్రద్ధ తీసుకొని సంగీతాన్ని నేర్పించారు. ఆ విధంగా మూడేళ్ళు ఆయన వద్ద సంగీతం అభ్యసిస్తూ హయ్యర్ గ్రేడ్ పరీక్షలు పాసయ్యాను" అని చెప్పారు శాంతకుమారి.

## స్కూలు టీచరుగా

అప్పట్లో మదరాసులోని నుంగంబాకంలో విద్యోదయా స్కూలు అని వుండేది. ఆ స్కూల్లో సంగీతం టీచరుగా సాంబమూర్తిగారి రెకమెండేషన్‌తో చేరింది శాంతకుమారి. అయితే ఆ స్కూలు టీచరు ఉద్యోగం తనకు ఇష్టముండేది కాదు. ఆ స్కూల్లో పిల్లలంతా తమిళం మాట్లాడతారు. ఈమెకేమో తమిళం, ఇంగ్లీషు రెండు భాషలు రావాయె. చివరకు తండ్రి బలవంతంతో శాంతకుమారి స్కూలు టీచరుగా నెలకు 75 రూపాయల

జీతానికి చేరింది. మొదట్లో కొంత బెరుగ్గా అనిపించినా, పిల్లలంతా 'సుబ్బమ్మ టీచర్' అంటూ ప్రేమ చూపించడంతో టీచర్‌గా వాళ్ళతో కలిసి పోయింది.స్కూలు పిల్లలకు గాత్ర సంగీతంతో పాటు ఫిడేలు వాయించడం కూడా నేర్పేది. ఆ స్కూల్లో పనిచేసే రోజుల్లోనే తానే కచేరీలు చేయడం కూడా ప్రారంభించింది. అంతేకాదు డి.కె.పట్టమ్మాళ్, వసంతకోకిలం, విశ్వేశ్వరమ్మల పాట కచేరీలకు పక్క వాయిద్యంగా ఈమె ఫిడేలు వాయించేది.

## సినీ రంగ ప్రవేశం

ఈమె సినీ రంగ ప్రవేశం కాకతాళీయంగా నాటకీయ ఫక్కీలో జరిగిందని చెప్పుకోవచ్చు. 'అదృష్టం చెప్పిరాదు' అనే నానుడికి ఈమె జీవితమే దృష్టాంతం.

మద్రాసులోని ఒకరింట్లో పందిట్లో సంగీత కచేరీ చేస్తున్న సుబ్బమ్మ గాత్ర కౌశలాన్ని, రూప లావణ్యాన్నీ, ఆ కచేరీకి వచ్చిన వేల్సు పిక్చర్స్ అధినేత కీ.శే. పి.వి.దాసు గమనించి, తాను తీయబోతున్న శశిరేఖా పరిణయం (మాయాబజార్)లో శశిరేఖ పాత్రకు ఆమె సరిగ్గా సరిపోతుందని అనుకున్నారు. అతికష్టం మీద ఈమె కుటుంబ సభ్యులను ఒప్పించి దాసు, సుబ్బమ్మను హీరోయిన్‌గా చేశారు. సుబ్బమ్మ పేరును పి.వి.దాసే శాంతకుమారిగా మార్చారు. ఆ రోజుల్లో ఏడాదికి రెండు లేక మూడు సినిమాలు రిలీజయ్యే కారణం వల్ల ప్రేక్షకులు విరగబడి చూశారీ చిత్రాన్ని! ఈ సినిమాకు శాంతకుమారి తీసుకున్న పారితోషికం వెయ్యిన్నూట పదహార్లు.

## పి.పుల్లయ్యతో ప్రేమ వివాహం

శశిరేఖా పరిణయం చిత్రం నిర్మాణ దశలో వుండగానే స్టార్ కంబైన్స్ వారు తీస్తున్న 'సారంగధర' చిత్రంలో చిత్రాంగి వేషానికి ఈమెను ఎన్నుకున్నారు. సారంగధర చిత్రంలో శాంత కుమారి చిత్రాంగి కాగా, బందా కనక లింగేశ్వరరావు సారంగధరుడిగా నటించారు. ఈ చిత్రం ఆమె నట జీవితాన్నే గాక, వ్యక్తిగత జీవితాన్ని కూడా ఒక మలుపు తిప్పింది. ఆ చిత్రదర్శకులైన పోలదాసు పుల్లయ్యగారితో ప్రేమలో పడింది శాంతకుమారి. ఆ రోజుల్లో ప్రేమ వివాహాలకు పెద్దలు యిష్టపడే వారు కాదు. దీనివల్ల వారి ప్రేమకు అనేక విఘాతాలు ఎదురయ్యాయి. కానీ సాంప్రదాయం, ప్రేమ



ఘర్షణలో శాంతకుమారే నెగ్గింది. ప్రేమ చిగురించిన ఏడాదికే శాంతకుమారి, పుల్లయ్య తన స్వగ్రామమైన వెల్లాలలో దంపతులయ్యారు. పెద్దల అంగీకారం పొందిన ప్రేమ వివాహంగా వీరి వివాహాన్ని అభివర్ణించవచ్చు. "దర్శకుడు నటీమణిని వివాహం చేసుకోవడంలో పెద్ద విశేషమేమీ లేదు గానీ ఎటొచ్చీ ఇలాంటి వివాహాలు చివరి దాకా కొనసాగవని హాలీవుడ్ నుంచి ఆంధ్రా వరకు అంటారు. కానీ ఇందుకు భిన్నంగా శాంతకుమారి పుల్లయ్యల దాంపత్యం పది కాలాల పాటు వర్ధిల్లి, వారు మాకు ఆదర్శ దంపతులయ్యార'ని ప్రఖ్యాత నటి అంజలీదేవి వ్యాఖ్యానించారు. అదేవిధంగా "మీ జీవితంలో మరచిపోలేని సంఘటన ఏమిటని అడిగితే" - "మా వారిని పెళ్ళి చేసుకోవడమే" అని నిండుగా నవ్వేస్తుంది శాంతకుమారి.

## చిత్రజైత్రయాత్ర

సారంగధరలో చిత్రాంగి పాత్రతో నటిగా శాంతకుమారి 'స్టార్‌డమ్' నందుకుంది. ఆ తర్వాత వచ్చిన కృష్ణప్రేమ, రుక్మిణీ కళ్యాణం, ధర్మపత్ని మొదలైన చిత్రాలు ఆమె స్థాయిని మరింత పెంచాయి.

గ్లామర్‌కే అత్యంత ప్రాధ్యాతనిచ్చే మన చిత్ర పరిశ్రమలో అమ్మ పాత్ర వెయ్యాలంటే హీరోయిన్‌గా రాణిస్తున్న ఏ నటి సాధారణంగా ముందుకు రాదు. అలాంటి సమయంలో హీరోయిన్‌గా అగ్రశ్రేణిలో వున్న శాంతకుమారి తన ఇరవై ఏడవ ఏట 'అమ్మ' (తమిళం 1947) చిత్రంలో అమ్మ పాత్ర పోషించి మరింత ఇమేజ్‌ని తన స్వంతం చేసుకున్నారు. ప్రముఖ నటి జి.వరలక్ష్మి, తన భర్త కె.ఎస్.ప్రకాశరావు నిర్మించిన "కన్నతల్లి" చిత్రంలో తల్లి వేషం వేయడానికి శాంతకుమారి 'అమ్మ' పాత్ర ప్రభావమే కారణమని ఇప్పటికీ చెప్పుకుంటుంటారు.

'అమ్మ' చిత్రం తర్వాత శాంతకుమారి ధరించిన పాత్రలన్నీ ఇంచుమించు అలాంటివే. ఆమె పేరు తలచుకుంటే ఎన్నో పాత్రలు మనల్ని ఆత్మీయంగా పలకరిస్తాయి. 'రేచుక్క' (1954), జయభేరి (1959), భక్తజయదేవ (1961), మనసేమందిరం (1966), తల్లాపెళ్లామా (1970), ప్రేమనగర్ (1971). శాంత కరుణ సాత్విక అభినయాల ఆవిష్కరణలో తనకు తానే సాటిగా అలలారిన ఈమె తన మనస్తత్వానికి భిన్నంగా మూర్తి విరుపుల సవతి తల్లిగా 'అర్ధాంగి' (1955)లోను, గయ్యాళి అత్తగా 'సంక్రాంతి' (1953) 'బొమ్మల పెళ్ళి' (1957) చిత్రాల్లోను రాచరికపు అహంకారాన్ని ప్రదర్శించే నిర్లక్ష్యపు తల్లిగా 'ప్రేమనగర్' (1971)లోను 'అన్‌సింపతెటిక్' వేషాలు ధరించి తన నటనా సామర్ధ్యాన్ని నిరూపించుకున్నారు. ఇదే విషయాన్ని ఆమె వద్ద ప్రస్తావిస్తే "నేను ధరించిన ప్రతి పాత్ర నాకు గొప్ప అనుభవాన్ని నేర్పాయి" అంటారు. ఆ వెంటనే



అన్నిరకాల పాత్రలనూ నేను ధరించినా, కొన్ని మాత్రం భరించాను'' అన్నారు. 1937లో వచ్చిన 'సారంగధర'లో చిత్రాంగిగా వ్యాంప్ వేషాన్ని అతి సమర్థవంతంగా పోషించిన శాంత కుమారే, 1957లో జూపిటర్ వారు నిర్మించిన 'సారంగధర'లో చిత్రాంగి వేషం పి.భానుమతి వేయగా, తాను రత్నాంగిగా నటించి కరుణ రసాన్ని పండించింది. అదే విధంగా శ్రీ వెంకటేశ్వర మహత్యం' మొదట తీస్తే అందులో పద్మావతీదేవిగా నటించిన శాంతకుమారి 1960లో ఇదే చిత్రం తిరిగి నిర్మిస్తే అందులో వకుళాదేవిగా నటించి, నటిగా తన వైవిధ్యాన్ని ప్రదర్శించారు.

## గాయనిగా

దాదాపు టాకీ సినిమా పుట్టిన తొలినాళ్లలో చిత్రసీమలో అడుగుపెట్టిన శాంతకుమారి ప్లేబాక్ లేని రోజులు కావడం వల్ల స్వతహాగా విద్వాంసురాలు కావడం వల్ల, తన పాటలు తానే పాడుకునే వారు. తీగసాగే స్వరమాధుర్యం ఆవిడకు సరస్వతీ దేవి ప్రసాదం. భావగాంభీర్యం, తంబూరాని కూడా



శృతి చేయడానికి ఉపయోగపడే స్వరశుద్ధమైన గాత్రం, కడిగిన ముత్యాల్లా అక్షరాలను ఉచ్ఛరించే తీరు ఆమెకు జన్మతః లభించిన వరాలు.

“ధర్మపత్ని”లో “సతియే సతియా', “పార్వతీ కళ్యాణం”లో “స్వామి నను కరుణించెన్”, “కృష్ణప్రేమ”లో ‘ఇదే ఆనందమూ” వంటి పాటలన్నీ ఆనాడు ఆమెకొక ప్రత్యేక పేరును సాధించి పెట్టినవే.

“మాయాలోకం” (1945) లో 'మోహనాంగ రారా” పాడుతూ వుంటే తల్లీకొడుకుల్లా తెరపై కనబడుతున్నా కూడా శాంతకుమారి, అక్కినేని నాగేశ్వరరావులను ప్రేయసీ, ప్రియులుగానే భావించగలిగారు ఆనాటి ప్రేక్షకులు. అంతటి 'వినుకట్టు' ఆమె గాత్రానికుంది.

“గుణసుందరికథ” (1949)లో శాంతకుమూరి, మాలతి పాడిన రెండు ప్రేమగీతాలు ‘కలకల ఆ కోకిలేమో', ‘చల్లని దొరవేలే చందమామా...” ఈ పాటలు వింటున్న కొద్దీ మైకం ఎక్కువయ్యేదే గానీ తగ్గేది కాదు. గుణసుందరి తర్వాత మళ్లీ ఆమె పాటలకు ప్రజాదరణ లభించింది. “శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం” (1960)లోనే ఆ తర్వాత “సిరిసంపదలు” (1962)



**'భక్తజనా' (1947) షూటింగ్ జరుగుతుండగా భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందన్న వార్త తెలిసింది. వెంటనే సెట్స్‌పైనే మన జాతీయ పతాకాన్ని ఆవిష్కరించే ఏర్పాట్లు చేశారు. ఆనాడు కీ॥శే॥ నాగయ్య పతాకావిష్కరణ చేసిన దృశ్యమే యిది.**

“తల్లాపెళ్లామా”, “ప్రాణమిత్రులు” మొదలైన చిత్రాల్లో పాటలు పాడి ఆ చిత్రాలకే ఘనత నాపాదించిన దృశ్యాలలో వాత్సల్యరసం మూర్తీభవించడమే గాక కథనూ, పాత్రనూ అనుసరించి దానికి విషాదం, రక్తీ, విరక్తీ, నిర్వేదం తోడై అటువంటి నటనకది పరాకాష్ఠ అని ఋజువు చేశాయి.

ఆమె నటిగా స్థిరపడినా, సంగీతం పట్ల ఆమెకు గల అభిరుచి తగ్గలేదు. ఆమె రాసి స్వరపరచిన భక్తిగీతాలను మంగళంపల్లి బాలమురళీకృష్ణ పాడగా, రామరసం పేరిట సంగీత క్యాసెట్ కంపెనీ వారు విడుదల చేశారు. అలాగే ఆమె పాడిన ఆండాళ్ పాటలు (SEDE 3963) కొలంబియా వారు విడుదల చేశారు. ఆమెకు గల సంగీత పరిజ్ఞానాన్ని చిత్ర పరిశ్రమ సరిగ్గా వినియోగించుకోలేక పోయినా కూడా ఆమెకు సంగీతం పట్ల గల ఆసక్తి ఎక్కువయిందే గానీ తగ్గలేదు. సంవత్సరం క్రితం వరకూ తన ఇంటి దగ్గరే ఉన్న ఓ జమిందారి కుటుంబానికి చెందిన తన చిరకాలపు అభిమాని లీల బి.డి. ప్రియకు పాటలు, అభినయం రెండూ నేర్పేవారు. “సంగీతం నా శారీరక రుగ్మతలని దూరం చేసి మానసిక స్థితిని మెరుగు పరుస్తోంది. కాబట్టి సంగీతంలో శిక్షణ (సలహాలు) ఇస్తుంటాను. ఇతరుల గురించి వృధాగా మాట్లాడుకొని టైమ్ వేస్ట్ చేసుకోక ఇలా సంగీతం గురించి, పాటల గురించి మాట్లాడుతూ, కన్నాంబ, సూర్యకుమారి లాంటి ఆనాటి వారిని తలచుకుంటూ, తక్కిన సమయమంతా భగవంతుని ధ్యానంలో గడుపుతున్నాను” అని చెప్పారు శాంతకుమారి.

శాంతకుమారి పుట్టిన దినం మే 17న ఇద్దరు అభిమానులు వారింట్లో నృత్యాల రూపంతో ప్రతి సంవత్సరం అలరించడం రివాజు. సంగీతాభిమానులకు యిప్పటికీ ఆమె మీద అభిమానం అంతటిది.

## నిర్మాతగా

1947లో శాంతకుమారి దంపతులు, ఇతర భాగస్వాములతో కలిసి 'రాగిణీ సంస్థ'ను స్థాపించారు. వీరు మొదటి సారిగా 'భక్తజన' నిర్మించారు. ఇందులో పాండురంగడి పాత్రలో హోనప్ప భాగవతార్ అనే సంగీత విద్వాంసుడు నటించాడు. అయితే ఈ చిత్రం ఆర్థికంగా అపజయాన్ని చవి చూసినా సంగీతం అమృతప్రాయంగా వుండి ప్రేక్షకుల్ని అలరించింది. ఆ తర్వాత ధర్మదేవత, తిరుగుబాటు, వీటుక్కారి, అర్థాంగి మొదలైన చిత్రాలు నిర్మించి మంచి పేరు తెచ్చుకున్నారు.

ఆ తర్వాత తన భర్త పి.పుల్లయ్యతో కలిసి 'పద్మశ్రీ' సంస్థ స్థాపించి ఎన్నోమంచి కుటుంబ కథా చిత్రాలు నిర్మించారు. ఈ చిత్రాలకంతా శాంతకుమారి తమ్ముడు శ్రీ వేంకటేశ్వర్లు (అబ్బి) నిర్మాణ వ్యవహర్తగా వ్యవహరించారు. వీరు నిర్మించిన 'శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం' కనక రాశులను కురిపించింది. సంవత్సరానికి పైగా ప్రతి థియేటర్‌లోనూ ఆడి రికార్డులను బద్దలు కొట్టింది. ఆ తర్వాత 'కొడుకు - కోడలు', 'అల్లుడు - మేనల్లుడు' 'అందరూ బాగుండాలి' వంటి చిత్రాలు నిర్మించి మంచి నిర్మాతగా కూడా పేరు తెచ్చుకుంది శాంతకుమారి.

## గృహిణిగా

శాంతకుమారి సినిమా తారగా ఎంత బిజీగా వున్నా, గృహిణిగా తన బాధ్యతలు ఎన్నడూ విస్మరించలేదు. తనకు గల కుటుంబ సంప్రదాయాలు, విలువలను అత్యంత శ్రద్ధగా కాపాడుకునేవారు. పుల్లయ్య, శాంతకుమారి గార్ల అన్యోన్య దాంపత్యానికి చిహ్నంగా పద్మ, రాధ అని ఇద్దరు ఆడపిల్లలు కలిగారు. వీరిలో రెండో అమ్మాయి రాధకు సాహిత్యంలో కూడా ప్రవేశముంది. తమ సొంత సినిమా 'మురళీకృష్ణ'కు కథ సమకూర్చింది రాధే. “మీకు మగ పిల్లలు లేనందుకు బాధపడ్డారా?” అని శాంతకుమారిని అడిగితే ఆవిడ “నాకు మగపిల్లలు లేకేమండీ, ఎన్.టి.ఆర్.. ఎ.ఎన్.ఆర్., జగ్గయ్య వీళ్లందరూ నా బిడ్డలే. మావారు కూడా ఎల్లప్పుడు ఇదేమాట అనేవారు. వాళ్లు కూడా మమ్మల్ని మమ్మీ, డాడీ అని పిలిచేవారు. నా కూతుర్లిద్దరినీ వాళ్ళు భుజాల మీదకెత్తుకుని ఆడించే వారు. ఇప్పటికీ అక్కినేని నాగేశ్వరరావు ఎప్పుడైనా మద్రాసువస్తే, మా ఇంటికి భోజనానికి వస్తారు వీలులేకపోతే అడిగి మరీ తానున్న చోటుకు





కారియర్ తెప్పించుకుంటారు" అన్నారు.

## అవార్డులు ... గౌరవ పురస్కారాలు

సుమారు 70 ఏళ్ళ తన సుదీర్ఘ చలన చిత్ర జీవితంలో శాంతకుమారి పొందిన సన్మానాలకు, పురస్కారాలకు కొదువ లేదు. కళా సరస్వతి, గానకోకిల, గాన సరస్వతి, సంగీత సరస్వతి... యిలా ఎన్నో బిరుదులిచ్చి సాంస్కృతిక సంస్థలు శాంతకుమారిని సత్కరించాయి. 1995లో తెలుగుజాతి ఆత్మగౌరవ పురస్కారం డా॥ ఎన్.టి.రామారావు చేతుల మీదుగా అందుకున్నారు. 1981లో రఘుపతి వెంకయ్య అవార్డు పుల్లయ్యగారు పొందితే, 1999 సం॥లో అదే రఘుపతి వెంకయ్య అవార్డును శాంతకుమారి పొందారు. ఈ అవార్డును తీసుకున్న తొలి దంపతులు కూడా వీరే కావడం ఓ విశేషం.

**- కంపల్లె రవిచంద్రన్**




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. విధాత (సిరివెన్నెల...విధాత తలపున)
ఎ) భర్త బి) సృష్టికర్త
సి)ఇచ్చువాడు డి) శంకరుడు

2. విరించి (సిరివెన్నెల...విధాత తలపున)
ఎ) పువ్వు బి) బ్రహ్మ
సి) కవి డి)గాయకుడు

3. విపంచి (సిరివెన్నెల...విధాత తలపున)
ఎ) వస్త్రము బి) వీణ
సి) కంఠము డి)పతాకము

4. మయూఖము (సిరివెన్నెల... విధాతతలపున)
ఎ) నెమలి బి) వీణ
సి) కిరణము డి) రథము

5. తెలిమంచు (స్వాతికిరణం...తెలిమంచు కురిసింది)
ఎ) మొదటిసారి పడిన మంచు
బి) ఉదయపు మంచు
సి) శీతాకాలపు మంచు
డి) తెల్లని మంచు

6. పల్లవించు (స్వాతికిరణం...తెలిమంచు కురిసింది)
ఎ) చిగురించు బి) పాడు
సి) రుచిమార్చు డి) పులకరించు

7. ఆద (మంచిమనసులు...ఎంత టక్కరివాడు)
ఎ) మనస్సు బి) శరీరము
సి) జ్ఞాపకము డి) చోటు

8. పట్టి (గిల్లికజ్జాలు)
ఎ) పట్టుదల బి)పంతము
సి)బిడ్డ డి) గారాభము

9. పసరు (స్వాతికిరణం...తెలిమంచు కురిసింది)
ఎ) ఎదుగు బి) ఎగురు
సి)చంచలమగు డి) లేత

10. ప్రణతులు (స్వాతికిరణం...తెలిమంచు కురిసింది)
ఎ)పాటలు బి)నమస్కారములు
సి)వేణువులు డి)ఓంకారములు

### జవాబులు

1) b) 2) b 3) b
4) c 5) d 6) a
7) a 8) c 9) c
10) b

మే 30 ఎల్.బి. శ్రీరామ్ పుట్టినరోజు సందర్భంగా...

# 'ఎల్లెల్లవయ్యా ఎల్లుబి సీరాముూ' అన్నాడీరప్పన్

నా పుట్టిన్రోజు గురించిప్పటిదాకా ఎవర్తోను సెప్పలేదు. ఇద్దిదిగిదిగో...ఈ 'హాసం' వాళ్ళొచ్చి 'మే 30 మీ పుట్టిన్రోజు కదా... నాలుగు ముక్కలెప్పండీ' అన్నారు. అద్గో... అలా దొర్కి పోయానన్నమాట... మరింకెందుకు ఆలీస్సెం... తొర్తొరగా చద్వేసి నవ్వీవించెయ్యండ్మరి...



★ గోదావరి జిల్లా యాసలో చితక్కొట్టేస్తున్నారు. మన్దేవూరేంటి?

ముక్కామల వక్కన నేదునూరండి. ముక్కామలేవెూ వక్కలంక వక్కనండి. ఈ కన్‌ఫ్యూజనెందుగ్గానీ సింపుల్‌గా చెప్తాను రాసుకొండి. ముక్కామల అటు పక్కన అమలాపురం అండి. అక్కడ కేస్నేని ట్రావెల్స్ ఏసీ కోచ్ బస్సెక్కేత్తే హైద్రాబాడ్ వచ్చేత్తారు. ఇమానం ఓటట్టుకుని వెజాగెళ్ళిపోండి. గోదారెక్కి బెజవాడలో దిగిపొండి. గౌతమీ ఉంటుంది. అదెక్కేసి కాకినాడొచ్చెయండి. ఓ రిచ్చా అట్టుకుని వయా దాక్షారం కోటివల్లొచ్చేయండి. అక్కడ లాంచీ ఎక్కి ఆలమూరులో దిగిపోయి వక్కనే నూత్తే రావులపాలెం. అక్కడ కుంటెంకడి గుర్రబ్బండి ఉంటది. అదెక్కకండి. ఆడికీ మనకీ పడదు. ఎక్స్‌పార్టీ. అంచేత హాయిగా ఎర్ర బస్సెక్కండి. సీటు దొరికే లోపల ముక్కామలొచ్చేత్తది. అక్కణ్ణించి అటోలో వెళితే మూడు కిలోమీటర్లకు అరకిలోమీటరు తక్కువండి. నడిసెళ్తే రెండు కిలో మీటర్లకి అర కిలోమీటర్ ఎక్కువండి. అదే మా నేదునూరు స్పెసాల్టీ.

★ రోజూ పేపర్ చూస్తారా?

పెతీరోజూ సూణ్ణండి! పెతీవారం సూత్తాను! ఆదివారం సూత్తే మళ్ళీ సోంవారందాకా సూణ్ను! ఆ తర్వాత మళ్ళీ మంగళవారమే!

★ ఐశ్వర్యారాయ్ మిమ్మల్నే పెళ్ళాడతానని వెంటపడితే?

పడితే అంటారేంటీ -పడింది!" పీకల్దాకా లవ్‌లో పడిపోయేను, కాదంటే పురుగుల మందు మింగేత్తాను" అంది! "నువ్వు పురుగుల మందు మింగు, పెసరపుణుకులు మింగు, నాకు అనవసరం! నీలాంటోళ్ళందరికీ శాన్సులు ఇత్తా కూకుంటే నాకెరీరు సంగతేంటీ" అని తెగేసి సెప్పేను! సాలాఫీలైపోయింది! కన్నీళ్ళెట్టుకెళ్ళిపోయింది! ఏంటో! పిచ్చిపిల్ల... పిచ్చికల...!

★ అన్నట్లు మీ పెళ్ళికి నారా చంద్రబాబు గార్నీ, వాజ్‌పాయ్ గార్నీ పిలిచారా ?

పిలాపోతే అయన్నీ మనసులో ఎట్టుకుంటారని...పిల్సేను ! "నా పెళ్ళికి పెళ్ళికూతుర్లేదు, నీ పెళ్ళి కొచ్చి కిళ్ళీతినాలా" అన్నాడు వాజ్‌పేయి !

"ఒచ్చేసేవాణ్ణే. కానీ మరి నా పెళ్ళి కూడా ఇయ్యాళే" అన్నాడు సెంద్రబాబు!

**★ ఏంటీ...సినిమా ఇండస్ట్రీని దున్నేస్తున్నారంట?**

దున్నేద్దామనే పెద్ద పుడింగిలాగా నాగలి బుజాన్నేసుకుని బైల్దేరేను! తీరా సూత్తే ఎడ్లు లేవు! ఇంకేం ఒత్తాయ్ వొడ్లు!

**★ అయినా మీ టైమ్ బావున్నట్టుంది?**

ఎందుకు బావుండదండి. పదేలెట్టికొన్నా...

**★ పదివేలా...ఏ వాచీ అది...ఎక్కడకొన్నారు?**

స్విస్సువాచీ అండి...స్విజ్జర్లాండ్‌లో కొన్నా...నేనెప్పుడూ అంతేనండి. మైసూర్‌పాక్ తినాలంటే మైసూరెళ్ళే తింటాను.

**★ మైసూర్ అంటే గుర్తొచ్చింది... వీరప్పన్ రాజ్‌కుమార్‌ని కిడ్నాప్ చేసినట్టే మిమ్మల్ని కూడా కిడ్నాప్ చేసివుంటే?**

సేత్తే...! పడితే..! అయితే..!గియితే..! అంటూ ఏంటి ఈ క్వెశ్చెన్లు? మీరు ఊహించే ముచ్చట్లు అన్నీ మన లైఫ్‌లో జరిగేసినయే! ఆ మద్దిన నన్ను కిడ్నాప్ సేసేడు ఈరప్పన్!

కుసలక్వెశ్చెన్లు అయ్యాక -అండర్‌గ్రౌండ్‌లో ఓ అండర్‌స్టేడింగ్‌కొచ్చి గోపాలుడు -భూపాలుడులో ఎన్టీవోడిలాగా ఇద్దరం గెటప్పులు మార్చుకుని ప్లేసులుమారేం! వారం తిరక్కుండానే మీసాలు ఏలాడేసుకుని,ఫారెస్ట్‌కి రిటర్న్ టిక్కట్టు అయిపోయేడు !

"యాఁ అప్పుడే ఒచ్చేసీవ్" అన్నాను ! "యాఁ అంటావేంటీ ? ఆ ఏక్టింగులూ, టచప్‌లూ, ఆటోగ్రాఫ్‌లూ అయన్నీ సూపర్‌గానే ఉన్నాయి, కానీ డబ్బింగ్‌లు సెప్పమన్నారు అక్కడొచ్చింది సిక్కు! నీలాగా డైలాగులు ఎంత నొక్కినొక్కి సెప్పినా - ఇంకా నొక్కు ఇంకా నొక్కు అని తెగ నొక్కేసేరు! రేపు నొక్కుతాలే, స్టోను బాగాలేదు అని ఒచ్చేసేను! నీ సూటింగ్‌లు కంటే అడవుల్లో నా తుపాకి సూటింగ్‌లే బెటరు! ఎలా నొక్కుతున్నావయ్యా బాబూ, ఎల్లెల్లవయ్యా ఎల్లుబీసీరామూ" అని నన్ను హైద్రాబాద్ తోలీసేడు.





**★ దేవుడు దిగి వచ్చి ఒకే ఒక్క వరం కోరుకోమంటే?**

నేను ఎప్పుడు ఏం కోరుకున్నా తీరిపోయే ఒకే ఒక్కవరం ఇమ్మని కోరుకుంటా !

అవును మరి! ఎప్పుడు ఏ అవసరం పడుద్దో తెలిస్సావదు కదా!

**★ మీలోని రచయితను ఎక్కడ దాచారో చెబుతారా....ఆ చోటులో బిన్ లాడెన్ కొస్త తల దాచుకుంటాడు.**

నాలోని రచయిత నాగుండెల్లోనే ఉన్నాడు ! ఆ గుండెని అర్ధం చేసుకుని తట్టేవాడున్నప్పుడు తను తప్పకుండా బయటికొస్తాడు!

అది సరే...లాడెన్ తలదాసుకుంటాడు అన్నారు...మరి మొండెం ఎక్కడ దాసుకుంటాడంటా!?

**★**
**మీకు బాగా
ఇష్టమైన మనుషులు
మీకు ఇష్టంలేని
చోటుకి తీసుకెళ్ళి
మీకు ఇష్టం లేనివన్నీ
మీ ముందు పెట్టి
తీసుకోక తప్పదని
ఒత్తిడితెస్తే ఏం
తీసుకుంటారు?**

సెలవు
తీసుకుంటాను!

★ ★ ★



# నథింగ్ స్పెషల్...జస్ట్ జోక్స్ & కార్టూన్స్...దట్సాల్ !!



“నేరం బుజువైపోయినా ఆ దొంగలకి శిక్ష వెయ్యడానికి ఎందుకన్ని సంవత్సరాలు సాగదీశారు?”

“వాళ్ళు చేసిన దొంగతనం రబ్బరు ఫ్యాక్టరీలో కదా, అందుకని అయి ఉంటుంది”.



“ఎక్కువ చదువుకున్నా మనుకో... ఎక్కువ తెలుసుకోవచ్చు... ఎక్కువ తెలుసుకున్నా మనుకో...ఎక్కువ మర్చిపోతూ ఉంటాం...ఎక్కువ మర్చిపోవటం వల్ల...తక్కువ తెలుసుకున్నట్లే అవుతుంది...మరి అలాంటప్పుడు చదివి ఏం లాభం?”



“మమ్మీ!... మేం జూ లో ఏనుగుల్లా ఆడు కుంటున్నాం... మాకు నువ్వు సహాయం చేయగలవా?” అడిగారు పిల్లలు.

“అలాగే....ఇంతకూ నేనేం చేయాలి?” అడిగింది తల్లి.

“నువ్వు ‘జూ’ చూడటానికి వచ్చావన్నమాట... మేం తినేవన్నీ నువ్వు పెడతావన్నమాట... సరేనా?” ముక్త కంఠంతో అన్నారు పిల్లలంతా.



“వర్షం ఎందుకు కురుస్తుంది నాన్నా?”.

“గడ్డి పెరగడానికి...పూవులు పూయటానికి...”

“బాగానే ఉంది...మరైతే మనం నడిచే దారిలో ఎందుకు కురుస్తుంది?”



ఓ వారం రోజులు వాళ్ళింట్లో గడిపి తిరిగి ఊరికి ప్రయాణమవుతూ మేనల్లుడికి ఏభై రూపాయలు ఇచ్చాడు మేనమామ.

“చూడు సంతోష్... ఈ డబ్బుని చాలా జాగ్రత్తగా దాచుకో...ఒక మూర్ఖుడు తన దగ్గర ఉన్న డబ్బుని అతి త్వరగా వదులుకుంటాడనే సామెతని మర్చిపోకు'' అన్నాడు మేనమామ.

“మరేం ఫర్లేదు మావయ్యా! నిన్ను తల్చుకుంటే చాలు నాకు ఆ సామెత చటుక్కున గుర్తొచ్చేస్తుంది” అన్నాడు మేనల్లుడు.



ఆరేళ్ళ మేనకోడల్ని ‘జూ’ కి తీసుకెళ్ళింది వాళ్ళత్త. బోనులో ఉన్న చిరుత పులుల్ని చూసి “అరె... ఆ పులుల మీదున్న మచ్చలు నిజమే నవనుకున్నానే!'' అందా అమ్మాయి

“అదేంటి అలా అంటున్నావ్?'' అంటూ అడిగింది అత్త.

ఆ పాప పక్కనున్న బోర్డ్ చూపించింది. ఆ బోర్డు మీద “పెయింట్ ఇంకా ఆరలేదు...” అని ఉంది.



“మా చిన్న తమ్ముడు రోడ్డు మీద మ్యాన్ హోల్లో పడి పోయాడురా... ఇప్పుడు నేనేం చేయాలో తోచటం లేదు...”చెప్పాడు చిన్మయ్.

“ఇంకా చూస్తావేంటిరా...'తొందరగా లైబ్రరీకి వెళ్ళి ‘పిల్లల్ని పైకి తీసుకురావటమెలా?’ అనే పుస్తకం ఉంది...చూడు...” సలహా ఇచ్చాడు తన్మయ్.



“అన్నం తినగానే ఈత కొట్టడానికి వెళ్ళొద్దు... కడుపు నిండి ఉన్నప్పుడు ఈత కొట్టడం ప్రమాదం...” చెప్పాడు తండ్రి.

“నేను వీపుతో ఈత కొడతా నాన్నా... నాకేం ఫర్లేదు” అంటూ వెళ్ళిపోయాడు పుత్రరత్నం.

# నథింగ్ స్పెషల్...జస్ట్ జోక్స్ & కార్టూన్స్...దట్సాల్!!



"ఏంటి... అరటి పండుని తొక్క ఒలుచు కోకుండా ఉన్న పళంగా తినేస్తున్నావ్?"

"లోపల ఏముంటుందో నాకు తెలియకపోతే కదా?"



బస్‌లో సిగరెట్ కాల్చినందుకు ఓ వ్యక్తిని అరెస్టు చేశారు.

"పొగత్రాగరాదు.. అని బస్‌లో రానుంది కదా...అయినా నీకు తెలియలేదా?" గదమాయించాడు పోలీసు ఇన్‌స్పెక్టర్.

"నాకు చదవడం రాదండీ..." చెప్పాడు ఆ వ్యక్తి.

"నీ పేరేంటి?"

"ఏదీ రాసి చూపించవయ్యా" అంటూ సడన్‌గా అన్నాడు ఇన్‌స్పెక్టర్ తెలివిగా పట్టుకుందామని.

ఎవరికీ అర్థంకాని రాతలో వ్రాసి చూపించాడు ఆ వ్యక్తి.

"ఏంటది?" అడిగేడు ఇన్‌స్పెక్టర్

"ఏమో..తెలీదు...అయినా నేను ముందే చెప్పాను కదండీ...నాకు చదవడం రాదని...." చెప్పాడు ఆ వ్యక్తి.



" ఆ రెండు చెంచాలు జేబులో వేసుకుంటున్నారేంటి సార్..." అర్థంకాక అడిగేడు సర్వర్.

"భోజనం చేసాక అలా చెయ్యమని రాసుందయ్యా" అన్నాడు కస్టమర్

"ఎవరు సార్ రాసింది... చూపించండి..." అని అన్ని గోడలూ చూసుకుంటూ మరీ అడిగేడు సర్వర్.

"ఇదిగో...నీ కంటితో నువ్వే చూడు. భోజనం తర్వాత రెండు చెంచాలు తీసుకోమని రాశాడా? లేదా?" అన్నాడు కస్టమర్ జేబులో ఉన్న మందు సీసా చూపిస్తూ



"మా ముత్తాత నెపోలియన్‌తో పోరాడితే మా తాత ఏకంగా రష్యా వాళ్ళతో పోరాడేడురా.ఇహ పోతే మా నాన్న ఏకంగా అమెరికా వాళ్ళతోనే పెట్టుకున్నాడు..."

"మీ వంశం మొత్తం అంతా గొడవలు పెట్టుకునే వాళ్ళే వున్నారన్న మాట. మీ వాళ్ళకి ఎవరితోనూ సరిపడదా..ఏంటి? "



ఒక విదేశీయుడు మన దేశంలో ఉన్న ఒక పెద్ద నగరాన్ని సందర్శించటానికి వచ్చాడు. ఒక కారుని అద్దెకు తీసుకుని అందులో ప్రయాణం చేస్తూ నగరంలోని అన్ని ప్రదేశాలూ చూస్తున్నాడు. మధ్యలో కారు డ్రైవర్‌తో పిచ్చాపాటీ మాట్లాడుతూ... "ఏంటయ్యా..మీ దేశంలో కార్లు ఇంత నెమ్మదిగా నడుస్తాయి...అదే మా దేశంలో అయితేనా ఎంత వేగంగా పోతాయో..." అన్నాడు కాస్సేపాగి. "అదిగో మీ బస్సుల్ని చూడు...ఎంత నిదానంగా వెళ్తున్నాయో...అదే మా దేశంలో అయితే విపరీతమైన వేగంతో నడుస్తాయి" అన్నాడు. ప్రయాణం ముగిశాక మీటరు ప్రకారం డబ్బులు ఇస్తూ..."బాబూ, మీ దేశంలో కార్లు నెమ్మదిగానే వెళ్తున్నా...అదిగో మీటరు చూడు. అది మాత్రం ఎంత వేగంగా తిరిగి పోతుందో..." అన్నాడు, వెటకారంగా. అంతవరకు ఓపిగ్గా భరించిన డ్రైవరు ఇంక లాభం లేదనుకున్నాడు.

"అవునండయ్యా...మీరు చెప్పిన మాట అక్షరాల నిజమే...మాదేశంలో మీటర్లు వేగంగా తిరుగుతాయి...ఎందుకంటే ఆ మీటర్లు తయారయ్యేది మాత్రం తమరి దేశంలోనే..." అన్నాడు.




విడుదల : ఆదిత్య
వెల : రూ.40/-

నటుడు చలపతిరావుగారబ్బాయి రవిబాబు నిర్మాతగా, దర్శకుడిగా ఫ్లయింగ్ ఫ్రాగ్స్ పతాకం పై నిర్మించిన 'అల్లరి' సినిమా ఆడియో విడుదలైంది. ఈ చిత్రంలోని పాటలన్నిటినీ సిరివెన్నెల సీతారామశాస్త్రి రాసారు. ఎన్నో యాడ్‌ఫిల్మ్‌లకి, జింగిల్స్‌కి సంగీతాన్ని సమకూర్చిన పాల్.జె. ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సురేష్‌పీటర్, చిన్మయి, అపర్ణ కలిసి పాడిన 'చిలిపి చిలక వలకి పడిందోయ్' టోటల్‌గా క్యాచీగావున్న ఎంటర్‌టైన్ హిట్ సాంగ్. ఆ దృష్టితో చూసుకుంటూపోతే సంగీతం, సాహిత్యం ఒకదానితో ఒకటి చక్కగా జతకట్టాయి. ముఖ్యంగా ట్యూన్‌పరంగా పాల్.జె. ఇచ్చిన కట్స్‌కి తగ్గట్టు సిరివెన్నెల పొదిగిన పదాలు-పెదాలపై సునాయాసంగా నర్తిస్తాయి. నలభైఏళ్ళ క్రితం విదేశీ సంగీతంలో 'చిప్‌మంక్స్' అనే ప్రక్రియతో రికార్డులు వచ్చేవి. వాటిని గుర్తుకుతెచ్చేట్టుగా ఈ చిలిపి చిలక వలకి పడిందిరోయ్ పాటలో 'కింగిని మింగిని' అంటూ ప్రాసెస్‌లో మార్చి వినిపించేసారు. దీనికి సంబంధించిన వాయిస్ అపర్ణది అని రవిబాబు తెలియజేసారు.

అపర్ణ, దేవన్ పాడిన 'రా...పోదాం షికారుకి...చాలందాం ఇంకా ఇవాళకి' పాటలో ట్యూన్‌పరంగాను, మెలోడీ పరంగాను, రిథమ్స్ పరంగాను బాలీవుడ్ టచ్ ఎక్కువగా ఉన్నట్టనిపిస్తుంది. హాయిగా ఆలపించుకోదగ్గ హుషారుగీతమిది. ప్రేమికుల ప్రోగ్రామ్స్‌కి సంబంధించిన రకరకాల ప్లాన్లు వాటి పర్మిటేషన్లు, కాంబినేషన్లతో-'ఓ ప్రేమకథ' సినిమాలో 'సండే మండే వదిలెయ్' పాట తర్వాత సీతారామశాస్త్రి చేసిన 'ప్రయోగాసనాలను' ఈ పాటలో హాయిగా చూడొచ్చు.

మనో, గ్రేస్ పాడిన 'అత్తయ్యో, మావయ్యో అంతా రారండయ్యో' పాట పూర్తిగా సన్నివేశప్రాధాన్యతతో, ఫాస్ట్ కట్స్ ఉన్న టేకింగ్‌కి కావలసిన పద్ధతిలో రూపొందించబడిన పాట. శ్రీకాకుళం, విశాఖపట్నం, ఒరిస్సా ప్రాంతాలలో కొన్నితరాలుగా వాడుకలో ఉన్న 'మనం మనం బరంపురం' అనే ఛలోక్తిని అతి చమత్కారంగా ఈ పాటలో సీతారామశాస్త్రి ఉపయోగించుకున్నారు.

శ్రీనివాస్, అపర్ణ పాడిన 'నరనరం ఉలిక్కిపడేట్టు అలా నవ్వకే అందమా' పాట చక్కటి మెలొడీతో ఉన్న యూత్‌సాంగ్. ఈ పాటలో సీతారామశాస్త్రి శృంగారానికిచ్చిన ఎక్స్‌ప్రెషన్లు నిజంగా మేలిమి బంగారంలా ఉన్నాయి. ఒకరకమైన ఆర్తి, దానిని 'అతి'గా చూపించకూడదన్న సంస్కారం, వీటిని అతిక్రమించని తెలివితేటలు-ఇవన్నీ కలిసికట్టుగా అతికినట్టుండే భావనాబలం-వాటికి తగ్గ పదజాలం-ఈ పాటను ఓ నాలుగైదుసార్లు విని-నేనైతే ఈ సన్నివేశానికి ఎలా రాస్తాను-అని అనుకోగలిచిన వాళ్ళకి అర్థమవుతాయి.

రవివర్మ, లావణ్య పాడిన 'రా...కిస్సిస్తావా ఏమైనా' పాటలో హడావిడి ఎక్కువ. బహుశా ఇందులో కూడా టేకింగ్‌కి సంబంధించిన ప్రాధాన్యత ఎక్కువగా ఉండి ఉంటుంది. అయితే వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించదీ పాట.

---




విడుదల : మయూరి
వెల : రూ.35/-

ప్రభుదేవా సోదరత్రయంతో జ్యోతిక కాంబినేషన్‌గా మూడు భాషలలో శ్రీ.కె.సుభాష్ నిర్మించిన '123' సినిమా ఆడియో విడుదలయింది. దేవా ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

అనురాధా శ్రీరామ్, శంకర్ మహదేవన్ పాడిన 'అరెరె నడక చూడు మదినే కొరికె గురూ' పాట వినడానికి హుషారుగా, క్యాచీగా ఉంది. అనురాధా శ్రీరామ్ వాయిస్ చాలా ఆకర్షణీయంగా ఉందీ పాటలో. ముకేష్ పాడిన ప్రసిద్ధ హిందీ గీతం 'డమ్ డమ్ డిగా డిగా' పాట నడక ఈ 'అరెరె నడక చూడు' పల్లవిలో కనిపిస్తూ ఉంటుంది. అలాగే ఇంటర్‌లూడ్‌లలో 'ఏక్ మై ఔర్ ఏక్ తు' అనే హిందీ పాట పల్లవిని 'మంచి మనసులు' సినిమాలోని 'మావా మావా మావా' పాటలోని ఇంటర్‌లూడ్ యొక్క నడకని గమనించవచ్చు. పాట మధ్యలో 'హైలెసా' అని అంటే 'పదనిసా'అంటూ కౌంటర్‌గా వెయ్యటంలో రచయిత థాంసన్ చేసిన కాయినింగ్ బావుంది.

ఉన్నిమీనన్, కార్తీక్, సురేష్‌లతో కేడి పాడిన - 'నీ కనులే వేవేలా సూర్యులాయె' అనే లైన్‌లే పల్లవిగా - నీ స్మైల్ ఫేసు చూస్తే ఆ స్వర్గమైన నెక్స్టే లాంటి లైన్‌లు చరణాలుగా సాగిన పాట మ్యూజికల్‌గాను, లిరికల్‌గాను ఓ తమాషా పాట. చరణాల ట్యూన్ రిపీటెడ్‌గా హాంటింగ్‌గా ఉంది. ఇంటర్లూడ్‌లలో ఉపయోగించిన ట్రంపెట్ పాటను పదే పదే వినేట్టు చేస్తుంది. ఇక రచయితగా పొందూరి చాలా మంచి లేటెస్ట్ ట్రెండ్... ఉదాహరణలతో పాటను భలేగా పరుగెత్తించాడు. 'నువు కవితలల్లుతుంటె ఆత్రేయ పుట్టినట్టే' అనే వాక్యం వినగానే తెలుగు వారందరి మనసులకి పట్టుకుంటుంది.

(తరువాయి 36 పేజీలో...)

మధుర గాయకుడు ఏ.ఎమ్.రాజాగారి గురించి పి.బి.శ్రీనివాస్ గారు, ఏచూరి (సినీ జర్నలిస్ట్) గారు రాసిన సంగతులు తెలుసుకున్నాను. పరవశించి పోయాను. నాకు తెలిసిన కొన్ని సంగతులు తెలుపుతున్నా. చిత్తూరు జిల్లా తమిళనాడు బోర్డరులో బొమ్మసముద్రం సమీప గ్రామం మరకాల కుప్పంలో జన్మించిన ఏ.ఎమ్.రాజా ఎనిమిదవ తరగతి వరకు బొమ్మనముద్రంలో (ఇ.యన్.ఎల్.సి) చదివి, వేలూరు (అదే రాయవేలూరు!) వూరిన్ కాలేజీలో ఇంటర్మీడియట్ చదివి, చెన్నై వెళ్లి డిగ్రీ అక్కడ చదువుతూ ఇంటర్ కళాశాలల సంగీతం పోటీల్లో పాల్గొన్నారు. బహుమతులు పొందారు. గ్రామఫోను రికార్డు (హిజ్ మాస్టర్స్ వాయిస్) లిచ్చారు. పి.బి.శ్రీనివాస్‌గారు చెప్పినట్టు "సంసారం" తమిళ చిత్రంలో ప్రథమంగా 'సంసారం సంసారం ప్రేమ సుధా సారం (ఘంటసాల గారు తెలుగులో పాడితే) తమిళంలో పాడి సుమధుర, మంజుల గానాన్ని ఆలాపించారు. రాజామునసామి అతని పూర్తి నామధేయం!! మునసామిని ఎమ్‌గా రాజాని వెనగ్గా మార్చుకుని ఏ.ఎమ్.రాజాగా ప్లేబ్యాక్ సింగర్‌గా ప్రత్యేక ముద్రతో రసాలూరు రాజేశ్వరరావుగారి ఆశీర్వాద బలంతో "మిస్సమ్మ"లో స్థిరపడ్డారు. మా ప్రాంతం వాడు (మాదీ బొమ్మ సముద్రం కాబట్టి) కనుకనే ఇంత విశదంగా రాస్తున్నా. మేం బొమ్మసముద్రం హైస్కూలుల్లో (1950-1954) చదువుతుంటే స్వగ్రామానికి కారులో అతని సతీమణి జిక్కితోబాటు వస్తే మేము సంభాషించే వాళ్లం. మా కోసం ఆయన "విప్రనారాయణ" పాటలు పాడినట్టు గుర్తు. అవి తీయని తీపిగురుతులు. పాకాల - కాట్పాడి రైలు (మీటరుగేజ్)లో ప్రయాణిస్తే బొమ్మసముద్రం - రామాపురం రైల్వేస్టేషన్ల మధ్య ఆయన, ప్రత్యేకంగా కట్టించుకున్న బంగళా (ఆహ్లాద వాతావరణం కోసం) కొండల మధ్య, మామిడి, కొబ్బరి తోటల మధ్య, ఇప్పటికీ అందంగా కన్పిస్తుంది. మేం వెళ్లి చూసి, ఆ దంపతులతో గడిపిన రోజులు జ్ఞప్తికొస్తున్నది. మా ప్రాంతం వాడు కాబట్టి ఆ మధుర గాయకుని గురించి రాశాను. కాస్త లావుగా, నల్లగా, ఆజానుబాహువు. సరస సంభాషణతో మేము 'పాడురాజా!' అని అడగటంలోనే జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అని ఆత్మీయంగా విసుగుత్రోసి రాజాని - ఆడు వారి మాటలకు, నీవుండే దాకొండపై, తేన్‌వుణ్నవండు, మాసిల్లావున్మై కాదలే, వాడుకమరచెదవేళా, ఆడేపాడే పసివాడ - ఇత్యాది పాటలు పాడే వారు! తెలుగులో




ఘంటసాల, తమిళంలో టి.ఎమ్.సౌందరరాజన్ ద్వంద్వంగా రాజ్యమేలుతున్న సమయంలో ధ్రువతారగా సినీ సంగీత గగన పథంలో దూసుకొచ్చిన మధుర మంజులంగా మోహన సుతారంగా తన గళంలో మనల్ని ఆనందింప చేసిన ఆయనతో మా సంభాషణలు మరచిపోలేని సంఘటనలు.

**-కాశీనాథ విశ్వం**
**కె.ఎన్.కాలనీ,చిత్తూరు**

"హాసం" పత్రిక చాలా చక్కగా సక్రమంగా తెస్తున్నారు. చాలా సంతోషం. తొలి పేజీ నుండి తుది పేజీ వరకూ చదవాలనిపిస్తోంది. కాని - అప్పుడప్పుడు కొన్ని పొరపాట్లు దొర్లుతున్నాయి. అలా జరక్కుండా కొంచెం శ్రద్ధ వహించండి. ఉదాహరణకు - ఆ మధ్య ఓ సంచికలో కె.రాఘవేంద్రరావు (దర్శకేంద్రుడు) శ్రీ పి.పుల్లయ్య గారి 'అర్ధాంగి' చిత్రానికి పనిచేశారని రాశారు. ఆయన అప్పటికి పరిశ్రకు రాలేదు. ఆయన పనిచేసినది 'పాండవ వనవాసం'(1964) అనుకుంటాను. శ్రీ పుల్లయ్య గారి వద్ద కె. రాఘవేంద్రరావు అనే ఆయన పని చేశారు. ఆయన వెంకటేశ్వర మహత్మ్యం వరకూ పనిచేసి, చిత్ర పరిశ్రను వదిలిపెట్టి హైద్రాబాద్ వెళ్ళిపోయారు. ఆ రోజుల్లో ఆయనతో పాటు శ్రీ బోయిన సుబ్బారావు, వి.రామచంద్రరావు గార్లతో పాటు నేను కూడా - శ్రీ ఆత్రేయ గారి వద్ద డైలాగుల కోసం రాత్రుళ్ళు జాగారణ చేశాను.

'అనార్కలి' చిత్రంలో - ఫోటో - శ్రీ వేదాంతం రాఘవయ్య గారు వున్నారన్నారు. అది రాఘవయ్య గారు కాదు - ఆ చిత్రానికి అసోసియేట్‌గా పనిచేసిన కే.శే.గాదిరాజు కేశవరావు గారు.

మీకిలాంటి సమాచారం అందించిన వారిని కాస్త శ్రద్ధ వహించమనండి. ఇలా రాసినందుకు మన్నించండి.

**కె.వి.రావు,**
**రంగరాజపురం, చెన్నై-24.**

ఎడిటర్ సర్, 1-15 మే సంచికలో భద్రాచలం నుంచి సత్యనారాయణగారు వ్రాసిన ఉత్తరంలో ''మెరిసే మేఘమాలికా!...ఉరుములు చాలు చాలిక'' అనే పాటను పాడింది ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారు నా దగ్గరున్న కాసెట్‌లో ఉంది. ఘంటసాల కాదు. మీరు కూడా ఈ వివరణ ఇవ్వలేదు. ఈ విషయం గమనించగలరు.

**భమిడిపాటి గౌరీశంకర్,**
**పసారు వీధి, నరసన్నపేట.**

''అల్‌బేలా'' సినిమా గురించి - సి.రామచంద్ర కొన్ని భగవాన్ సినిమాలకు సంగీతం సమకూర్చినా, అవి చిన్న బడ్జెట్ చిత్రాలు కావడం వల్ల తన మార్కెట్‌కు భంగం కలగకుండా అన్నా సాహెబ్ అనే పేరును ఉపయోగించారట. ఈ సినిమాకు మాత్రం తన పేరుతోనే చేశాడు. ఆ సినిమాకు గ్లామర్‌ను సమకూర్చినది గీతాబాలి అని చెప్పాలి. ఆమెకు అప్పట్లో ఉన్న మార్కెట్ రేట్‌లో సగం మాత్రమే భగవాన్ ఆఫర్ చేశాడు. పైగా హీరో ఏ మాత్రం ఆకర్షణీయమైన వాడు కాడు. గీతాబాలి తల్లి ఆ పాత్ర ఒప్పుకోవద్దని సలహా ఇచ్చింది. కానీ భగవాన్ మంచితనాన్ని మన్నించి, ముఖ్యంగా ఆ పాత్ర బాగా నచ్చి గీతాబాలి సమ్మతించింది.

**-ఎమ్.సమీర్‌కుమార్,**
**గదగ్ (కర్నాటక)**





# రాజా ఆడియో రివ్యూ

విడుదల :సుప్రీమ్
వెల :రూ.35/-

ఋతురాగాలు, కస్తూరి టీవీ సీరియల్స్ తీసిన మంజులానాయుడు దర్శకత్వంలో ఆమె భర్త సుధాకర్ వల్లమాల నిర్మించిన 'కనులు మూసినా నీవాయె' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. చక్రి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

కందికొండ రాయగా, హరిహరన్ పాడిన 'చిన్న నవ్వు చల్లి పోవే ప్రియతమా' పాట రచయితకి, సంగీతదర్శకుడికి, గాయకుడికి మంచిపేరు తెచ్చిపెట్టే పాట. మధ్యమావతిరాగంలోని స్వరాలను అక్కడక్కడ స్పృశిస్తూ సాగిన ఈ పాట నిర్మాత దర్శకుల అభిరుచిని తెలియజేస్తుంది. సినిమా ఫీల్డులో జానపదగీతాలకు ఈ తరం గాయకుడిగా పేరుపడ్డ రవివర్మ పాడిన 'సుబ్బులచ్చిమి సుబ్బులచ్చిమి ఇటురావే ఎంకట సుబ్బులచ్చిమి' పాట టోటల్ మాస్ ఓరియంటెడ్ హిట్‌సాంగ్. ఈ పాటకి హిట్ సెంటిమెంట్లు కొన్ని ఉన్నాయి. 'లచ్చిమి-టచ్‌మి' అనే కాయినింగ్ చక్రికి 'బాచి' సినిమా మిగిల్చిన సెంటిమెంట్. 'గాజువాక పిల్లా' పాట తర్వాత విశాఖపట్నంలోని ప్రాంతాలపేర్లతో పాట చేయడం పరిశ్రమపరంగా వచ్చిన సెంటిమెంట్. ఈ పాటలోని మద్దిలపాలెం, జగదాంబసెంటర్ ఆ కోవలోకి చెందినవే. ఇక చక్రి, రచయిత భాస్కరభట్ల రవికుమార్ కాంబినేషన్‌లో ఓ మాస్‌సాంగ్ హిట్ అవడం 'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం'లోని 'రామసక్కని బంగారు బొమ్మ' పాట ద్వారా వచ్చిన మరో సెంటిమెంట్. ఇదీ టోటల్‌గా ఈ 'సుబ్బులచ్చిమి' బ్యాగ్రౌండ్...!గ్రౌండు గట్టిగా ఉంటే ఇక తిరుగేముంది...!? బలభద్రపాత్రుని మధు రాసిన 'అల్లరి చినుకా తెమ్మెర మొలకా' పాట చక్రిని, గాయని కౌసల్యని కొత్తకోణంలో ఆవిష్కరించిన పాట. చాలా చోట్ల ఇళయరాజా స్టాండర్డ్స్ కనబడతాయీపాటలో. 'మస్తీ' అనే ఆల్బంను తీసు కొచ్చిన గాయకుడు విశ్వ రచయితగా రాసిన 'ఎందుకో...ఎందుకో...' అనే పాటను సంగీత దర్శకుడు చక్రి గాయకుడిగా పాడాడు. రిథమ్స్‌ని పూర్తిగా మినహాయించేసిన ఈ పాటలో- మణిరత్నం సినిమాకి రెహమాన్ మ్యూజిక్ ఇచ్చిన లెవెల్స్ అక్కడక్కడ కనిపిస్తాయి. ఓ రకంగా ఇవన్నీ చక్రికి కాంప్లిమెంట్లే!

కందికొండ రాయగా చక్రి, కౌసల్య పాడిన 'తొలకరివా చిరుసడివా గుండెలో అలజడివా' పాట పూర్తిగా చక్రి స్టయిల్ లో ఒదిగిపోయిన ట్యూన్.



'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం'లోని 'ఏమో ఏమానో ఎవరికి తెలుసంట' పాటకి ఈ పాట చెల్లెల్లాంటిది. ఈ పాటని యమలబ్బుగా పాడిన చక్రి పూర్తి కాంట్రాస్ట్‌తో పాడిన శోకగీతం-'నీలికళ్ళ నిండా నిన్నే నింపుకున్నానే జాబిలమ్మా!' పాట. శ్రీనివాస్, సునీత పాడిన 'ఆపాలన్నా ఆగేనా' పాట సంగీత దర్శకుడిగా చక్రి తనలోని టాలెంట్ ఎంతటిదో మెలొడీ పరంగా చూపించిన పాట. ఉదిత్‌నారాయణ్, కౌసల్య పాడిన 'లవ్‌దోమ కుట్టినాదె ముంబై పోరీ' పాట యూత్‌ని టార్గెట్‌గా చూసుకున్న మాస్‌సాంగ్. 'తడపవే పిల్లో' అనే మాట ఉదిత్‌నారాయణ్ నోట వినగానే - 'ఎంత తడప్‌కే తడప్‌కే ఈ మాట ఆయన గొంతులోంచి బైటపడింది!?' అని అనిపిస్తుంది. తడప్‌కే అంటే గిలగిల కొట్టుకోవటం అని అర్థంట.

(123 ఆడియో రివ్యూ 34వ పేజీ నుండి)

మనో, వైశాలి పాడిన 'కాంచీపురం పోదాం కామాక్షమ్మను చూదాం' పాట సరదాగా సాగిపోయే హుషారైన గీతం. ఎ.ఆర్.రెహానా పాడిన '123 థీమ్ మ్యూజిక్' చాలా బావుంది. రాబోయే రోజుల్లో ప్రతి సినిమాకి ఓ థీమ్ మ్యూజిక్ వచ్చినా ఆశ్చర్యపడనవసరం లేదు. అంత ట్రెండ్ సెట్టింగ్ లెవెల్లో ఉంది ఈ థీమ్ మ్యూజిక్. దీన్ని శ్రీకాంత్‌దేవా కంపోజ్ చేశారు.

సురేష్‌పీటర్, అనురాధా శ్రీరామ్ పాడిన 'చక్కనైన చిన్నది చిక్కెనమ్మ' వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించని పాట. అనురాధా శ్రీరామ్ వోకల్ పెర్‌ఫార్మెన్స్ ఈ పాటలో చెప్పుకోదగ్గది.

రోహిణి కృష్ణ రాయగా అనురాధా శ్రీరామ్ పాడిన 'సాగే ఓ మేఘమా కాస్సేపు ఆగుమా నను వీడిపోకుమా' పాటలోని కోరస్ బిట్స్ వింటుంటే దాసరి అరుణ్‌కుమార్ హీరోగా నటించిన తొలి చిత్రం 'గ్రీకువీరుడు' లో 'న్యూ జనరేషన్ కి హీరో నువ్వేనా' పాటలోని 'వెల్‌కమ్ వెల్‌కమ్' అనే లైన్లయొక్క ట్యూన్ గుర్తొస్తుంది. దీనిక్కూడా దేవాయే మ్యూజిక్.

## రచన: సిరివెన్నెల — 1 — గానం: రాజేష్, ఉష

అ: నువ్వంటే నాకిష్టమని అన్నది నా ప్రతి శ్వాస
ఆ: నువ్వేలే నా లోకమని అన్నది నా ప్రతి ఆశ
అ: నీ నవ్వులో శృతి కలిపి పాడగా
ఆ: నీ నీడలో అణువణువు ఆడగా
ఇ: అనురాగం పలికింది సంతోషం స్వరాలుగా  అ: ॥నువ్వంటే॥
అ:చ: నువ్వు నా వెంట ఉంటే అడుగడుగునా నడుపుతుంటే
ఎదురయే నా ప్రతికలా నిజమల్లే.. కనిపించదా
ఆ: నిన్నలా చూస్తూఉంటే మైమరపు నన్నల్లుతుంటే
కనపడే నిజమే ఇలా కలలాగ అన్పించదా
అ: వరాలన్ని సూటిగా యిలా నన్ను చేరగా
ఆ: సుదూరాల తారక... సమీపాన వాలగా
అ: లేనేలేదు..యింకే కోరిక..  ఆ:॥నువ్వంటే॥
ఆ:చ: ఆగిపోవాలి కాలం, మన సొంతమై ఎల్లకాలం
నిన్నగా సనసన్నగా చేజారి పోనీయకా
అ: చూడు నా యింద్రజాలం వెనుతిరిగి వస్తుంది కాలం
రేపుగా మనపాపగా పుడుతుంది సరికొత్తగా
ఆ: నువ్వు నాకు తోడుగా నేను నీకు నీడగా
అ: ప్రతీ రేయి తీయగా పిలుస్తోంది హాయిగా
ఆ: ఇలా ఉండిపోతే చాలుగా....  అ:॥నువ్వంటే॥

## రచన: కులశేఖర్ — 2 — గానం: శంకర్ మహదేవన్

ప: ధీంధినక్ తరి నత్తిక్‌త్తోం ధీంధిక్ తరినత్తిక్‌త్తోం
ధీంధినక్ తరినత్తిక్ నత్తిక్‌త్తోం
గుప్పెడంత గుండెల్లో చెప్పలేని ఆనందం ఈ క్షణాలే ఎంతో సంతోషం
జీవితం చిరునవ్వుతో గడిపేయడమే కద ఆనందం
అందరం మనమందరం కలిసుంటేనే కద సంతోషం  ॥ధింధినక్॥
చ: అమ్మాయిల చేతలకీ కుర్రాళ్ల కూతలకీ హద్దంటూ లేదయ్యో ఈ దినం
సందట్లో సందయ్యో పెళ్లవనీ జంటలకీ ఆనందం అందించే ఈ క్షణం
పేకాట రాయుళ్ల చేజోరు చూడాలి ఈ పెళ్లి లోగిళ్లలో
మందేసి చిందేసి అల్లర్లు చేసేను కుర్రాళ్ళు విడిదింటిలో
కన్నెపిల్లలకు బ్రహ్మచారులకు కొంటెసైగలే ఇష్టమంట  ॥ధింధినక్॥
చ: ఈ పెళ్లిపందిరిలో సరదాల సందడిలో ఈ నేలకొచ్చిందయ్యో అంబరం
ఈ ఊరు వాడంతా పొంగిపోయేలాగా ఈ ఇంట జరగాలయ్యో సంబరం
వేవేల జన్మాల పుణ్యాల ఫలితాలు చేరేది ఈ వేళలో
అక్షింతలే నేడు లక్షింతలయ్యాయి ఈ వేదమంత్రాలలో
కన్యాదాతకి అప్పగింతలూ కంటితుడుపులూ తప్పవంట  ॥ధింధినక్॥



అ: ఐయామ్ గొనా మేక్ మై డ్రీమ్స్ కమ్ ట్రూ
ట్రస్ట్ మి బేబి ఐ విల్ మేకిట్ త్రూ
ఆ: ఐ డోన్ట్ కేర్ జస్ట్ హు యు ఆర్
డోన్ట్ యు డేర్ ట్రై నా దట ఫర్  ॥మెహబూబా॥
లవ్ డబ్ లవ్ డబ్ లవ్ డబ్.....
... జస్ట్... బ్రేక్... ఇట్
ఫూజ: ఈస్ట్, వెస్ట్, ఐయామ్ ద బెస్ట్
చెక్ ఇట్ ఔట్ నా ఇఫ్ యు డోన్ట్ ట్రస్ట్
డు ఆర్ డై ఈజ్ ఆన్ మైలిస్ట్
టేక్ మి ఆన్ ఫస్ట్ అండ్ ఫోర్‌మోస్ట్
ఆ: ఐ కెన్ మేక్ యు డాన్స్ టు మై ట్యూన్స్
కేస్ ద వరల్డ్ గ్రేటెస్ట్ ఫోర్ట్యూన్స్
అ: ఇఫ్ యు థింక్ యు ఆర్ స్పెషల్ అండ్ స్మార్ట్
లుక్ ఆన్, యు కెన్ టచ్ మై హార్ట్.  ॥మెహబూబా॥

## రచన: కులశేఖర్ — 8 — గానం: కె.కె, ఉష

అ: భాయియోఁ అవుర్ బహినోఁ సత్‌శ్రీ అకాల్
కో: సత్ శ్రీ ఆకాల్
అ: కమ్ అండ్ జాయిన్ అస్, ఆజ్ కీ షామ్ ఆప్ కే నామ్
ప:అ: డిరిడిరిడిరిడీ వారెవ్వ (3)
యిప్పుడిప్పుడిప్పడే వారెవ్వ
ఇచ్చిపుచ్చుకుంటే వారెవ్వ
అరె ఇద్దరొకటయెరో వారెవ్వ  ॥డిరిడిరిడిరిడీ॥
చ:అ: అదిరి పడకురో దిగులు పడకురో
కడలి అడుగులో మగువ మనసులో ఏమిటుందో చెప్పలేవురో
ఆ: అమ్మమ్మ అంతనిందలొద్దులే
అంతంత పెద్దమాటలొద్దులే
మనసు తెరతీసి ఉందిలే
నన్నుచూడమందిలే
అరె ముచ్చటింక ముందరుందిలే  అ:॥డిరిడిరిడిరిడీ॥
చ: అ కనులు కలపరో..మనసు తెలపరో
మొదటి పిలుపుతో వరస కలపరో
పెళ్లిడోలు మోగుతుందిరో
ఆ: వలపు వల జారుకుందిలే..
దుడుకు వయసాగనందిలే
మనసుజత కోరుకుందిలే..అది చెప్పలేదులే
ఈ సందడంత అందగాడిదే  అ:॥డిరిడిరిడిరిడీ॥



## రచన: సీతారామశాస్త్రి — 1 — గానం: సందీప్, సుజాత

అ: నిను చూసిన ఆ తొలి నిముషానా నా మనసుకి తెలుసా ఏమైనా  ॥నిను॥
ఆ: తనలోన ప్రేమ పుడుతుందో తను ప్రేమలోన పడుతుందో
అ: అనుకోని కలవరమైన అది ఎంత బాగుందో
ఆ: మృదువైన భావనలోన మది ఎంత మురిసిందో  అ: ॥నిను॥
చ/ఆ: చూపులతో చెప్పుకునే భాషే ఇది ఊపిరితో అల్లుకునే బంధం ఇది
అ: ఇద్దరికే సొంతమయే లోకం ఇది ముద్దులతో ఏకమయే మైకం ఇది
ఆ: ఏ జాతి అని ఏ దేశమని ఏ జంటని అడగని కౌగిలిలో
అ: సరిహద్దులని చలిపొద్దులని కరిగించని వెచ్చని కోరికలో
ఆ: ఎంత మధురమో ప్రేమ అన్నది  అ:॥అనుకోని॥
చ/అ: ఎన్నటికీ తీరననే దాహం ఇది చెరిసగమూ పంచుకునే ప్రాయం ఇది
ఆ: ఏ రుణమో తీర్చుకునే స్నేహం ఇది ఇష్టపడి పెంచుకునే భారం ఇది
అ: ఈ చెలిమి నిజం ఈ క్షణము నిజం అణువణువున మీటిన హాయి నిజం
ఆ: ఈ వలపు నిజం మైమరపు నిజం ఎడబాటుకి అందని మనం నిజం
అ: కోటి కలలతో కొత్త జీవితం  ఆ:॥అనుకోని॥

## రచన:సురేంద్ర కృష్ణ — 2 — గానం: శ్రీరాంప్రభు,టిప్పు,కోటి,మురళి,కణ్ణన్,సరోజ

ప/అ: ప్రేమలో పడ్డాడురోయ్... వీడిలో, ప్రేమ పుట్టిందంటరోయ్...
అ: హాయి అంటాడేందిరోయ్... చూడురా, లవ్వులో హాయేందిరోయ్...
కో: ఇష్క్ ఇష్క్., లవ్ లవ్., ప్రేమ ప్రేమ., కాదల్ కాదల్....
అ: మొదటి చూపుకు కుదురు కరువు
కుదురు కరువై గుబులు పెరుగు
గుబులు పెరిగి ప్రేమ మొదలు
మనసు మొత్తం హాయి మెదులు
కో: అబ్బాయి తీరే మారగా అమ్మాయి వల్లే కొత్తగా
అ: ఎంచక్కా ఉండే వాడురా డల్లయిపోయాడేమిరా
అ: బంగారంలాంటి వాడికి బజ్జున్నా నిదురలేక
అ: చుట్టూ మేమున్నాగాని లేనట్టే ఉంటున్నాడు
కో: ప్రేమింత పని చేస్తుందా... మా వాణ్ణి మాక్కాకుండా చేస్తుందా....
ఆ: చెయ్ చెయ్ చెయ్యరా లవ్వు
నువ్వు చెయ్యరా లవ్వు
లోకమంతా లవ్వు (2)  ॥చెయ్॥
చ/అ: ఆకలే అసలు దరికి రాలేదు వివరమే తెలుపరా
ఆ: చెలియ తలపుల్తో మనసు నిండాక ఆకలింకేలరా
గతములోన మరినాక్కూడా అనుభవం నాయనా
అ: నీకోసం నేనున్నానంటూ నీ కడదాకా వచ్చేదే ప్రేమ...



చూస్తూనే నా మనసు చేయిజారి... ఎటు పోయిందో ఏమో మరి...
చేసావు నువ్వే చోరీ... కాదంటే పెడతా ఎంక్వైరీ... (2)
ఆ: ఎక్స్‌క్యూజ్‌మి...  అ: ఎస్ డార్లింగ్...
ఆ: మతి చెడిపోయిన బ్రహ్మచారి... శృతి మించిపోకు మితిమీరి.. (2)
మాటు వేసి, జీటు కాసి, సందు చూసి, సైగ చేసి అడ్డురాకు నాకు ప్రతిసారీ...
అ: ఎక్స్‌క్యూజ్‌మి...  ఆ: ఏం టే...
అ: నువ్వంటే నాకు పిచ్చి..లవ్వాడుతాను వచ్చి.. ఒకే ఒక్క ఛాన్సిచ్చి..ఓ.కే. అను ప్రేమించి...
ఆ: ఎక్స్‌క్యూజ్‌మి...  అ: ఏం బేబి...?
ఆ: ఛీ ఛీ పోరా పక్షి..కుంగ్‌ఫూ తో ఒక్కటిచ్చి..తీరుస్తా 'లా' పిచ్చి..యా..హూ...
అ: ఆ..ఊ..అమ్మో..అయ్యో..
చ/ఆ: ఎక్స్‌క్యూజ్‌మి...  ఆ: క్యారే...
అ: కళ్లజోడు తీసి చూడు కన్యాకుమారి..కనబడుతుంది ప్రేమకుదారి...
ప్రేమించి చూడు నన్ను ఒక్కసారి..ప్రేమించి చూడు నన్ను ఒక్కసారి...
ఆ: ఎక్స్‌క్యూజ్‌మి...  అ: ఎస్ స్వీట్‌హార్ట్...
ఆ: కాలిజోడు తీస్తే ఓ పోకిరి..కైపు తగ్గిపోదా తిక్క తీరి...
మార్చుకోకపోతే నీ దారి..మార్చురీకి పోతావ్ సరాసరి...
కో: హోయారే హోయారే హోయారే...
అ: ఎక్స్‌క్యూజ్‌మి...  ఆ: ఏంటి గురూ...?
అ: అహో, బ్యూటిపుల్ పాపా... రా... లక్లీగా లవ్వాడుకుందాం...రా...
ఆ: ఎక్స్‌క్యూజ్‌మి...  అ: ఐ యామ్ రెడీ...
ఆ: దయచేసి జీపులోకి ఎక్కుతారా... లాకప్పులో 'లా' చూపుతా రా...

## రచన: చంద్రబోస్ — 6 — గానం : రాజేష్, సుజాత

అ: తంతే పడిపోయా పూబంతి ఒడిలోనే
ఎంతో చెడిపోయా ఈ కాంత జతలోనే (2)
ఆ: పమిటను పట్టే - చెమటలు పుట్టే పని ముందున్నదిలే
తలదిండు నింక నువ్వు హత్తుకునే ఆ అవసరముండదులే  ॥తంతే॥
చ:అ: తణుకుకి అరకుకి నడుమ బహుదూరం
తనువుకి తనువుకి నడుమ చిరుదూరం
ఆ: బస్సెక్కావంటే తగ్గేనంట దూరం చంకెక్కావంటే శృంగారం
అ: ఫ్లైటెక్కావంటే మారేనంట దేశం పరుపెక్కావంటే సంతోషం
ఆ: పొగరెక్కి నువ్వూ నేనూ పూర్తిగా మత్తెక్కి చిత్తయిపోవాలోయ్  ॥తంతే॥
చ/అ: నలుగురూ చేరితే జరుగు పేకాట
ఆ: ఇరువురూ కూడితే పెరుగు సోకాట
అ: ఛెస్సాట ఆడే మూడే నేడే లేదోయ్ కిస్సాట నీతో ఆడేస్తా
ఆ: కోలాటమాడే కాలం కానే కాదోయ్ కులుకాట నీకే చూపిస్తా
అ: కొసరాట ఆడింటింక చాలులే కొత్తాట ఆడాలమ్మాయో....  ॥తంతే॥

రచన: సిరివెన్నెల **5** గానం: ఉష

ప: నే తొలిసారిగా కలగన్నది నిన్నేకదా
నా కళ్ళెదురుగా నిలుచున్నది నువ్వేకదా
స్వప్నమా నువ్వు సత్యమా తేల్చి చెప్పవేం ప్రియతమా
మౌనమో మధురగానమో తనది అడగవేం హృదయమా
ఇంతలో చేరువై అంతలో దూరమై అందవా స్నేహమా ॥నే తొలిసారిగా॥
చ: రెక్కలు తొడిగిన తలపు నువ్వేకాదా నేస్తమా
ఎక్కడవాలను చెప్ప నువ్వే సావాసమా
హద్దులు చెరిపిన చెలిమి నువ్వై నడిపే దీపమా
వద్దకు రాకని ఆపకిలా అనురాగమా..
నడకలు నేర్పిన ఆశవు కద తడబడనీయకు కదలిన కథ..
వెతికే మనసుకు మమతే పంచుమా.. ॥నే తొలిసారిగా॥
చ: ప్రేమా నీతో పరిచయమే ఏదో పాపమా
అమృతమనుకొని నమ్మటమే ఒక శాపమా
నీ ఒడి చేరిన ప్రతి మదికి బాధే ఫలితమా
తీయని రుచిగల కటిక విషం నువ్వే సుమా
పెదవులపై చిరునవ్వుల దగా..కనబడనీయవు నిప్పులసెగ
నీటికి ఆరని మంటల రూపమా
నీ ఆటమిటో ఏనాటికి ఆపవు కదా..నీ బాటమిటో ఏ జంటకీ చూపవు కదా..
తెంచుకోనీవు పంచుకోనీవు ఇంత చెలగాటమా
చెప్పకోనీవు తప్పకోనీవు నీకు ఇది న్యాయమా
పేరులో ప్రణయమా..తీరులో ప్రళయమా..పంతమా..బంధమా..
నీ ఆటమిటో ఏనాటికి ఆపవు కదా..
నీ బాటమిటో ఏ జంటకీ చూపవు కదా..

రచన: విశ్వ **6** గానం: మనో, విశ్వ, భార్గవి

అ: మెహబూబా మెహబూబా లవ్‌ప్రిన్సే మనమబ్బా
కనుసైగే చాలబ్బా దిల్‌కబ్బా సున్‌షబ్బా
ఆ: మెహబూబా మెహబూబా మెరుపే ఈ మగువబ్బా
చూపేస్తే చురకబ్బా నా వలపే వడదెబ్బ ॥మెహబూబా॥
అ: ఛేంజ్ ద బీట్..
ఆ: ఓ మాన్..
అ: నాన్సెన్స్
చ/అ: మేక్.. బ్రేక్ బట్ డోన్ట్ మిస్టేక్ గివ్.. టేక్ కాజ్ లైఫ్ ఆన్ స్టేక్
ప్రెజెంట్ ఈజ్ యువర్స్ నో ఫ్యూచర్.. నో పాస్ట్
ఐ వాజ్ సర్వైవ్‌డ్ యు జస్ట్ ఫర్



రచన: చంద్రసిద్దార్ధ **3** గానం: రాజేష్ **7** రచన: కులశేఖర్

సో మచ్ టు సే
దట్ ఐ లవ్ యు
నా దట్ సో మచ్
ఐ నీడ్ యు
హౌ వుడ్ ఇట్ బి
ఇఫ్ యు లీవ్ మి
ఫీల్ ఇట్ ఫర్ మి టు బిలీవ్ మి
ఐ యామ్ ఆల్ ఎలోన్..
బట్ నాట్ ఎలోన్
లీవింగ్ ఫర్ యు..
ఐయామ్ డైయింగ్ ఫర్ యు
ఐయామ్ ఆల్ ఎలోన్
బట్ నాట్ ఎలోన్
లీవింగ్ ఫర్ యు..
ఐయామ్ డైయింగ్ ఫర్ యు..ఫర్ యు..

ఏమైనదో ఏమో నాలో..
కొత్తగా ఉంది లోలో..
కలలిలా నిజమైతే.. వరమిలా ఎదురైతే..
నాలో నీవై.. నీలో నేనై..
వుండాలనే నా చిగురాశనీ..
లోలో పొంగే భావాలన్నీ
ఈవేళిలా నీతో చెప్పాలనీ వున్నది.
అందాల సిరిమల్లెపువ్వు..
ఏ మూలదాగావో నువ్వు
చిరుగాలిలా వచ్చి నీవు..
ఎదలోన సడిలేపినావు
ఏదో రోజు నీకై నువ్వు
ఇస్తావనే నీ చిరునవ్వుని
ఎన్నెన్నెన్నో ఆశలతోనే ఉన్నానులే
నీ కోసం.. ఇలా..

రచన: కులశేఖర్ **4** గానం: కె.కె., ఉష

అ: ప: దేవుడే దిగివచ్చినా స్వర్గమే నాకిచ్చినా
షాజహాన్ తిరిగొచ్చినా తాజ్‌మహల్ రాసిచ్చినా
ఇప్పుడీ సంతోషం ముందర చిన్నబోతాయి అన్నీ కదరా
లోలోన మనసంత సంతోషమే
ఈ ప్రేమ పులకింత సంతోషమే ॥2॥
అ: చ: వెన్నెల చూడు నన్నిలా
ఎంత హాయిగా ఉంది ఈ దినం
నమ్మవా నన్ను నమ్మవా చేతికందుతూ ఉంది ఆకసం
ఇప్పడే పుట్టినట్టుగా ఎంత బుజ్జిగా ఉంది భూతలం
ఎప్పడు ముందరెప్పడు చూడలేదిలా దీని వాలకం
ఆ: ప్రేమిస్తే ఇంతేనేమో పాపం
దాసోహం అంటుందేమో వంగి వంగి ఈ లోకం
అ: చ: కోయిలా నేర్చుకోయిలా ఆమె నవ్వులో తేనె సంతకం
హాయిగా పీల్చుకోయిలా చల్లగాలిలో ఆమె పరిమళం
నీటిపై చందమామలా నేడు తేలుతూఉంది నా మది
చీటికి మాటిమాటికి కొత్తకొత్తగా ఉంది ఏమది
అణువంతే ఉంటుందమ్మ ప్రేమ..
అణచాలి అనుకున్నామా చేస్తుందమ్మ హం..గా..మా.. అ: ॥దేవుడే॥



అ: అయితే వస్త బంగరు బొమ్మ అడ్డు చెప్పకుంటె
అయ్యో అమ్మొ అంటావేమో వచ్చి వెళ్ళగానే
అ: అమ్మమ్మమ్మొ ఈ ముద్దుగుమ్మ కనుగీటితే
అబ్బబ్బబ్బో ఆ బ్రహ్మకైన మతి చెదరదా
ఆ: కన్నె ప్రాయం చిన్న సాయం కోరుతోంది తీర్చరా
అ: లిప్ప లిప్పకి సీలేద్దాం సోకులన్నీ ఇక ఆరేద్దాం
హద్దు దాటుతూ మాటలు మానేద్దాం
ఆ: ముద్దుల్లోన ముంచేస్తాడు ముచ్చటైనవాడు
సరిపోతుందని అసలే అనడు సిగ్గులేని ప్రియుడు. అ:॥మనసూరుకోదే॥
చ/అ: అబ్బబ్బబ్బో అదిరేటి అందమే అందుకో
అయ్యయ్యయ్యో రగిలేటి వేడి చల్లార్చుకో
అ: అంత వరమూ యిచ్చినాక ఆగుతానా నా సఖి
ఆ: నేను కూడా మరి అంతేగా ఆగలేను రారా ఇంక
కొత్తగుందిరో చిత్రం చూపించూ
అ: ఊరూవాడా ఏకం అయ్యి కుళ్ళుకుందురంట
జంటంటే మనదేలే అంటూ ఒప్పకుందురంట ॥మనసూరుకోదే॥

రచన: సీతారామశాస్త్రి **5** గానం:దేవి,సంజయ్‌కృష్ణమోహన్,రఘు,ఉష,రాధిక

ప/అ: ఎక్స్‌క్యూజ్‌మి.. ఆ: ఏంట్రా..
అ: 'రా' నా..? సరే రానా..?ఈ మాట కోసమే చూస్తున్నా..
నిన్నే ప్రేమిస్తున్నా అని నీతెలా చెప్పనా అనుకున్నా
తీరా నువు 'రా' అన్నాక.. నో ప్రాబ్లమ్ వచ్చేస్తున్నా.. ॥నో ప్రాబ్లమ్॥
ఆ: ఎక్స్‌క్యూజ్‌మి.. అ: య్యా..టెల్ మి..
ఆ: తగ్గించు కొంచెం నీ జోరు.. నువ్వంటె నాకు యమబోరు.. (2)
ఐ హేట్ యు.. ఐ హేట్ యు..
అ: అబ్బబ్బ..నో..నో..
ఆ: ఐ హేట్ యు..
అ: హే యు కాంట్ డూ దిస్ టు మి యార్..
అ: సెక్స్‌క్యూజ్‌మి..
ఆ: వాట్..?
అ: సారీ.. ఎక్స్‌క్యూజ్‌మి..
ఆ: ఏంటీ..?
అ: మస్త్ మస్త్‌గున్నావే మిస్సూ.. వస్తాను ఇస్తావా కిస్సు.. (2)
ఆ: మిస్సు కాదు బాసూ.. అది నా మిస్సెస్సు.. నేనిస్తాను నీకు డిష్ము డిష్ము.. (2)
అ: ఎక్స్‌క్యూజ్‌మి.. ఆ: మళ్ళీ ఏంటి..?
అ: చూసాక నిన్ను తొలిసారి.. నాకేదో అయ్యిందె వయ్యారి..



కో: ఛ నిజమా..
ఆ: మా జంటను చూడండ్రా బాబు! మరి మా లవ్వుకు అరవై ఏళ్లంట..
ఆ: అంచేత మనసంతా ప్రేమ నింపుకోండి
లేకుంటే లైఫంతా బోరే.. ఇది నిజం.. ॥మొదటి॥
చ/ఆ:ప్రేమనే తినుచు ప్రేమనే కొలుచు పాట్లు ఎన్నాళ్ళురా? కో: హద్దిరబ్బ
ఆ: ప్రేమలో గెలుపు ప్రేమతో మలుపు ప్రేమతో బ్రతకరా
ప్రేమనే వరము పొందకపోతే వయసు దండగేరా
ఆ: ప్రేమించే మనసే లేకున్నా.. కో: హద్దిరబ్బ.. అ: మాదంతా హ్యాపీ లైఫేగా..
ఆ: ఏ తోడూ లేని మీదంతా.. కో: హద్దిరబ్బ.. అ: ఏమాత్రం లైఫే కాదంటా..
లవరంటూ ఒకరుంటే నువ్వు కింగు భాయి
లవ్వంటూ లేకుంటే వేస్టు తెలుసుకోవోయి ॥మొదటి॥

రచన : సురేంద్ర కృష్ణ **3** గానం : ఆర్పీ పట్నాయక్, ఉష

ప/అ: హాయ్ రే హాయ్..హాయ్ రే హాయ్ రే హాయ్.. నా చెలియ ఐ లవ్ యు అందోయ్..
ఆ: హాయ్ రే హాయ్..హాయ్ రే హాయ్ రే హాయ్.. ప్రేమికుడి వరసే నచ్చిందోయ్..
అ: రేగిందిగా ఎదలో అల..
ఆ: ఇచ్చానుగా మనసే ఇలా..
అ: ఈ మాట కోసం..నీ ప్రేమ కోసం.. ఉన్నాను నేను ఇన్నాళ్ళుగా.. అ:॥హాయ్ రే హాయ్॥
చ/అ: ప్రేమంటే ఉంటుంది మనలా.. నీ ప్రేమే బంగారు నిధిలా.. ఎన్నడూ కరగనీ కలలా..
ఆ: ఇన్నాళ్ళు ఉన్నాము విడిగా.. ఈరోజే అయ్యాము జతగా.. ఈ వరం శాశ్వతం అవగా..
అ: నువు లేకుంటే కలవరం
ఆ: కనుముందుంటే పరవశం
అ: ఇంతకు మించిన హాయేం లేదంటా.. అ:॥హాయ్ రే హాయ్॥
చ/అ: పుట్టిందే నీ ప్రేమ కోసం.. నీతోటే నాకున్న స్వర్గం.. కనుక నా మనసునే పరిచా..
ఆ: కన్నుల్లో నీదేగా రూపం.. నువ్వంటే చాలంది ప్రాణం.. ప్రియతమా మనవినే వినుమా..
అ: ఒకరికి ఒకరం సాక్షిగా..
ఆ: మనకిక మనమే తోడుగా..
అ: మనసుతో మనసుకు కుదిరెను ఒప్పందం..... అ:॥హాయ్ రే హాయ్॥

రచన: సురేంద్ర కృష్ణ **4** గానం: టిప్పు, హరిణి

అ: మనసూరుకోదె మందాకిని నువు ముందరుంటే కన్యామణి
కుదురుండదె నిదురుండదె ఓ భామిని
ఆ: నాలోని ఈడు నిను చూడగ పొంగింది వరద గోదారిలా
నూరేళ్లిలా ఉంటానిలా నీదానిలా..
అ: విన్నపాలు చేసుకున్నా..నాయికా..రా..ఇక..
ఆ: ఏదో ఏదో అయ్యిందయ్యో చెయ్యి తగలగానే.
నిన్నే తోడు కోరిందయ్యో అందగాడ రారా




## తారాగణం

నాగార్జున అక్కినేని, గ్రేసీసింగ్, శ్రేయ, కె. విశ్వనాథ్, చంద్రమోహన్, పరుచూరి వెంకటేశ్వర్రావు, పృథ్వి, తనికెళ్ళ భరణి, బ్రహ్మనందం, కోటశ్రీనివాస్‌రావు, ఎల్.బి.శ్రీరామ్, సునీల్, ఆహుతి ప్రసాద్, బెనర్జీ, మెల్కోటే, కృష్ణమోహన్, సుమిత్ర, అనితాచౌదరి, దేవిశ్రీ లహరి, మధుమణి మరియు ప్రత్యేక పాత్రలో ప్రభుదేవా


ఎస్. గోపాల్‌రెడ్డి


సిరివెన్నెల సీతారామశాస్త్రి


కులశేఖర్


ఆర్.పి. పట్నాయక్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : యమ్.వి.యస్. హరనాధ్‌రావు |
| పాటలు | : సీతారామశాస్త్రి, కులశేఖర్, చంద్రసిద్దార్థ, విశ్వ |
| సంగీతం | : ఆర్.పి. పట్నాయక్ |
| ఎడిటింగ్ | : కృష్ణారెడ్డి |
| ఆర్ట్ | : అశోక్ |
| డాన్స్ | : రాజు సుందరం, ఫరాఖాన్, కళ్యాణ్, హరికుమార్ |
| సమర్పణ<br>డైరెక్టర్ ఆఫ్ సినిమాటోగ్రఫీ | : ఎస్. గోపాల్‌రెడ్డి |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : రామచంద్రరాజు, రవికుమార్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : డి. బ్రహ్మనందరావు |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : శ్రీనివాస్ ఠాగూర్, ఆరిపాక ప్రభాకర్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : యాదగిరి. డి., నవీన్ బండి |
| కో-డైరెక్టర్ | : సాయికిషోర్ |
| స్క్రీన్ ప్లే | : గోపిమోహన్ |
| నిర్మాత | : డా॥ కె.ఎల్. నారాయణ |
| కథ, దర్శకత్వం | : దశరథ్ |

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.


దశరథ్


డా॥ కె.ఎల్. నారాయణ






## తారాగణం

ఆర్యన్‌రాజేష్, నికిత(నూతన పరిచయం), చంద్రమోహన్, జయసుధ, ప్రకాష్‌రాజ్, సన, చలపతిరావు, మల్లిఖార్జునరావు, యల్.బి.శ్రీరాం, బెనర్జి, సూర్య, బబ్లూ, ఖయ్యూం(జూ॥అలీ), 'చిత్రం'శ్రీను, గణేష్, రమ్యశ్రీ, తదితరులు.


ఇ.వి.వి. సత్యనారాయణ


డి.రామానాయుడు


చంద్రబోస్


సురేంద్రకృష్ణ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సతీష్ |
| పాటలు | : సీతారామశాస్త్రి, చంద్రబోస్, సురేంద్ర కృష్ణ |
| సంగీతం | : కోటి |
| ఎడిటింగ్ | : కృష్ణారెడ్డి |
| స్టిల్స్ | : ఇ.వి.వి.గిరి |
| మేకప్ | : హరి |
| కాస్ట్యూమ్స్ | : జగదీష్ |
| డాన్స్ | : శివ-సుబ్రహ్మణ్యం, ప్రసన్న కళ్యాణ్, విజయశాంతి, స్వర్ణ |
| డైరెక్టర్ ఆఫ్ సినిమాటోగ్రఫీ | : వి. శ్రీనివాసరెడ్డి |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : వెంకటేశ్వరరావు, కిశోర్. |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : డి.వి.యస్.ఆర్.సి. ప్రసాద్ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : కిషోర్ బొల్లెంపల్లి |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : ఈశ్వర్‌రెడ్డి, సూర్యం, బి.వి.వి.చౌదరి |
| కో-డైరెక్టర్ | : నెక్కంటి సురేష్ |
| స్క్రీన్ ప్లే, కథ, దర్శకత్వం | : ఇ.వి.వి.సత్యనారాయణ |
| నిర్మాత | : డా॥డి. రామానాయుడు |

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.


కోటి


సీతారామశాస్త్రి

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | | |
|---|---|---|
| చిత్రం | : | దేవదాసు (2002) |
| సంగీతం | : | ఇస్మాయిల్ దర్బార్ |
| రచన | : | నుస్రత్ బద్ర్ |
| గానం | : | కవితా సుబ్రమణ్యం, కె.కె. |
| అభినయం | : | మాధురీదీక్షిత్, షారుఖ్‌ఖాన్ |

## మార్‌డాలా...

యే కిస్కీ హై ఆహట్, యే కిస్కాహై సాయా
హుయీ దిల్ మేఁ దస్తక్, యహాఁ కౌన్ ఆయా
హమ్ పే యే కిస్నే హరా రంగ్ డాలా
ఖుషీ నే హమరీ హమే మార్‌డాలా ఓ మార్ డాలా
మార్‌డాలా హాఁ మార్ డాలా ॥హమ్ పే॥
న చాంద్ హథేలీ పర్ సజాయా
న తారోం సే కోయీ భీ రిష్తా బనాయా
న రబ్ సే కోయీ షికాయత్‌కీ ॥నరబ్ సే॥
హర్ గమ్‌కో హమ్‌నే ఛుపాయా
హర్ సితమ్ కో హఁస్‌కే ఉఠాయా
కాంటోఁకో భీ గలే సే లగాయా
ఔర్ ఫూలోంసే జఖ్మ్ పాయా
హాఁ మగర్ దువామేఁ జబ్ యే హాథ్ ఉఠాయా ॥హాఁ మగర్॥
ఖుదా సే దువా మేఁ తుమ్హే మాంగ్ డాలా ॥హమ్ పే॥





దేవదాసు కథ మనందరికీ తెలిసినదే. బెంగాలీ రచయిత శరచ్చంద్ర చటర్జీ 1917 లో వ్రాసిన 'దేవదాస్' నవల ఆధారంగా ఇప్పటి వరకు ఏడు చిత్రాలు వచ్చాయంటే ఆ కథ గొప్పదనం అర్థం చేసుకోవచ్చు. ఒక మూకీ చిత్రం, తెలుగులో రెండు చిత్రాలు, బెంగాలీలో ఒకటి, మలయాళంలో ఒకటి, హిందీలో రెండు చిత్రాలు ఈ కథతో నిర్మించబడ్డాయి. ఈ కథలో ఉన్న ఆర్ద్రత దర్శకులను ఇంకా ఆకర్షిస్తూనే ఉంది. అందుకు నిదర్శనమే సంజయ్‌లీలా బన్సాలీ రూపొందించిన సరికొత్త 'దేవదాస్'.

పి.సి.బరువా దర్శకత్వంలో కె.ఎల్.సెహగల్ ముఖ్యపాత్ర పోషించగా హిందీలో మొదటి 'దేవదాస్'1935లో వచ్చింది. ఈ చిత్రానికి ఛాయాగ్రహకుడిగా పనిచేసిన బిమల్‌రాయ్





దర్శకుడు సంజయ్‌లీలా బన్సాలీ

దర్శకుడిగా మారిన తర్వాత 1955లో ఈ కథను మళ్ళీ తెరకెక్కించారు. ఇందులో దిలీప్‌కుమార్, వైజయంతిమాల, సుచిత్రా సేన్ నటించారు. ఇప్పుడు సంజయ్‌లీలా బన్సాలీ షారుఖ్ ఖాన్, మాధురీ దీక్షిత్, ఐశ్వర్యారాయ్‌లతో 'దేవదాస్' చిత్రాన్ని పునర్నిర్మించారు.

'ఖామోషి - ద మ్యూజికల్', 'హమ్ దిల్ దే చుకే సనమ్' చిత్రాలతో తన సామర్థ్యాన్ని నిరూపించుకున్న బన్సాలీ తన తదుపరి చిత్రానికి 'దేవదాస్' కథను ఎంచుకోవడానికి కారణాన్ని వివరిస్తూ దేవదాసు అమరప్రేమ తనకి ప్రేరణ కలిగించిందని అంటారు.

తను రూపొందించే ప్రతి చిత్రానికి ముందు మాధురీ దీక్షిత్ హీరోయిన్‌గా అనుకుంటానని చెప్పే బన్సాలీ తన మెదటి రెండు చిత్రాలకు ఆమెను ఒప్పించలేకపోయినా ఈ మూడో చిత్రానికి ఆమెను చంద్రముఖి పాత్రకు ఒప్పించారు. ఇక పార్వతి పాత్రకు ముందు కరీనా కపూర్‌ని అనుకున్నా తర్వాత తన 'హమ్ దిల్ దే చుకే సనమ్' హీరోయిన్ ఐశ్వర్యా రాయ్‌నే ఎంపిక చేశారు. దేవదాసుకు చంద్రముఖిని పరిచయం చేసే స్నేహితుడు



చున్నీలాల్ పాత్రను గోవిందా, సైఫ్ అలీఖాన్ తిరస్కరించిన మీదట జాకీష్రాఫ్ అంగీకరించారు. ఇలా మెదటి నుంచి ఎన్నో అడ్డంకుల్ని ఎదుర్కొంది ఈ చిత్రం. ఇలాంటి అవరోధాలని ఎదుర్కొని భారీవ్యయంతో కళాత్మకంగా నిర్మించిన ఈచిత్రం విడుదలకు ముందే కేన్స్ (Cannes) చిత్రోత్సవంలో 'దేవదాసు' తొలి సారిగా ప్రదర్శింపబడుతుంది.

ఒక చిత్ర నిర్మాణం మొదలు పెట్టే ముందు ఏ అంశానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారని బన్సాలీని అడిగితే ఆయన సంగీతానికే అంటారు. ఆయన మెదటి చిత్రం 'ఖామోషి - ద మ్యూజికల్ 'లో సంగీతమే ప్రధానాంశం. ఆయన తరువాతి చిత్రం 'హమ్ దిల్ దే చుకే సనమ్' సంగీత భరిత చిత్రం. ఈచిత్రానికిసంగీతాన్ని అందించిన ఇస్మాయిల్ దర్బార్‌కు జాతీయ అవార్డు లభించింది. 'దేవదాసు' చిత్రానికి కూడా ఇస్మాయిల్ దర్బారే సంగీతం సమకూర్చారు. చంద్రముఖి పాత్రపరంగా నృత్యానికి కూడా ప్రాముఖ్యత ఉండటం వల్ల ప్రముఖ కథక్ నృత్యకారుడు పండిట్ బిర్జూమహరాజ్‌కు నృత్య దర్శకత్వ బాధ్యతలు అప్పగించారు. నృత్యంతో పాటు ఆయన ఒక పాటకు సాహిత్యం, సంగీతం, గానం కూడా అందించారు. ఈ చిత్రంలో ఇంకో



విశేషమేమిటంటే చంద్రముఖి, పార్వతి ఒక పాటలో కలిసి నృత్యం చేసారు! చిత్ర కథనంలో ఈపాట ఏ సందర్భంలో వస్తుందో వేచి చూడాల్సిందే.



తొలిసారిగా సినిమాకు పాటలు రాసిన నుస్రత్ బద్ర్ కథలోని భావపరంపరకు తగ్గట్టు కవిత్వం అందించగా ఇప్పటి పాపులర్ సంగీతానికి భిన్నమైన సంగీతాన్ని అందించారుదర్బార్. శ్రేయ ఘోసాల్ అనే నూతన గాయని ఈచిత్రం ద్వారా పరిచయమవుతున్నారు. లతామంగేష్కర్ అభిమాని అయిన బన్సాలీ తనకు శ్రేయ గానం చిన్నప్పటి లతాగానాన్ని తలపిస్తుందని అంటారు.

ఇక కథ విషయానికి వస్తే దేవదాసు, పార్వతి చిన్ననాటి స్నేహితులు.యుక్త వయసులో ఆస్నేహం ప్రేమగా మారుతుంది. కానీ దేవదాసు తండ్రి వారి పెళ్ళికి అంగీకరించడు. తండ్రి మాటకు ఎదురు చెప్పలేక దేవదాసు పార్వతిని వేరే పెళ్ళి చేసుకోమంటాడు. స్వాభిమానం దెబ్బతిన్న పార్వతి పెళ్ళి నిశ్చయమయిన తర్వాత దేవదాసు పశ్చాత్తాపంతో తన వద్దకు వచ్చినా తిరస్కరిస్తుంది. కోపంతో దేవదాసు కర్రతో ఆమె నుదుటి మీద కొడతాడు. ఆ మచ్చ వారి ప్రేమకు, అతని అహానికి గుర్తుగా నిలిచిపోతుంది. తరువాత పార్వతి ఒక మధ్య వయస్కుడిని పెళ్ళాడుతుంది. తన ప్రేమను చంపుకోలేని దేవదాసు తాగుడికి అలవాటుపడుతాడు. అతని స్నేహితుడి ద్వారా పరిచయమైన చంద్రముఖి అనే నాట్యకత్తె అతనిపై ప్రేమ పెంచుకొని తన వృత్తిని కూడా వదులుకుంటుంది. అయినా దేవదాసు పార్వతిని మరువలేక తాగుడికి బానిసై తీవ్ర అనారోగ్యం పాలవుతాడు. అవసాన దశలో పార్వతిని చూడాలని ఆమె ఊరుకి వెళ్ళి ఆమెను చూడకుండానే అమె గుమ్మం దగ్గరే మరణిస్తాడు.

దేవదాసు కన్నా పార్వతి, చంద్రముఖి ఆత్మబలం గలవారిగా అనిపిస్తారు. ఆత్మబలం లేకపోవడంలోనే అతని సొగసు ఉందేమో. చంద్రముఖి అందించిన ఆసరా అందుకోవటం తప్ప ఏమీ చేయలేని అసహాయుడతను. తననుంచి ఏమీ ఆశించకుండానే డబ్బులిచ్చే అతని సహృదయతకు ఆమె కరిగిపోతుంది. అతడు తనవాడు కావాలని కోరుకుంటుంది. ఆ కోరికే ఈ పాట సారాంశం. చంద్రముఖి దేవదాసు ఎదుట నృత్యం చేస్తూ తన ప్రేమను తెలిపే పాట యిది.

ఆహట్ అంటే అలికిడి. సాయా అంటే ఛాయ, నీడ. దస్తక్ అంటే తలుపు తట్టిన చప్పుడు.

**ఈ అలికిడి ఎవరిది, ఈ నీడ ఎవరిది**
**గుండె తలుపు తట్టారు, ఎవరది?**

తన జీవితంలోకి ప్రవేశించి ప్రేమను చిగురింపజేసిన దేవదాసు రాకను నమ్మలేని చంద్రముఖిలోని అలజడి ఇది.

హరా రంగ్ అంటే ఆకుపచ్చరంగు. ఖుషీ అంటే ఆనందం. 'మార్‌డాలా' అంటే 'చంపేసింది' అని తెలుగు పాటల్లో 'చంపకు', 'చంపొద్దే' అనే మాటలు మనకు తెలిసినవే.

అలాంటిదే ఈ మాట. విరహం, ప్రేమ, దుఃఖం, సంతోషం వంటి భావాలు భరింపనలవికావటం లేదని చెప్పడానికి ఈ మాట వాడతారు.

**నాపై ఎవరుచల్లారీ పచ్చరంగును**
**పట్టలేకున్నాను నేను ఈ ఆనందం**

ఆకుపచ్చరంగు ఆనందానికి, సుఖానికి ప్రతీక. 'పచ్చగా ఉండండి'

అనే దీవెన, 'పచ్చని సంసారం' అనే నానుడి మనకు తెలిసిందే. ఇక రంగులు చల్లుకోవడం అనే ప్రక్రియ కూడా మనకు కొద్దోగొప్పో తెలిసినదే. ఉత్తర భారతంలో హోలీ పండుగలో రంగులు చల్లుకోవటం సర్వసాధారణం. 'ఆనందానికి సూచకమైన రంగును చల్లటం' అనే ప్రయోగం ద్వారా 'ఆనందం కలిగించటం' అనే భావాన్ని చెప్పడం కవి ఊహాశక్తికి నిదర్శనం. నిస్సారమైన తన జీవితంలో పచ్చదనం మొలకెత్తిందని, ఆ ఆనందాన్ని పట్టలేకపోతున్నానని చంద్రముఖి అంటోంది.



బిమల్ రాయ్ 'దేవదాస్'లో ఈ





సందర్భంలో వచ్చే పాటలో కూడా రంగు ప్రస్తావన ఉండటం గమనార్హం. ఎస్.డి.బర్మన్ సంగీతంలో లతా పాడిన ఆ పాట:

'ఆమైఁ తుఝే ఆంఖోఁ మేఁ బసాలూఁ
రంగ్ భరే ఆంచల్ మేఁ ఛుపాలూఁ'
**నిన్ను నా కళ్ళలో ఉంచు కుంటాను**
**రంగుల చెంగులో దాచుకుంటాను**

అని భావం. దుఃఖాలు అంటకుండా సంతోషం అందిస్తాననే స్వాంతన.

'హథేలీ' అంటే అరచేయి. సజానా అంటే అలంకరించడం. చాంద్ అంటే చందమామ - ఇక్కడ సందర్భాన్ని బట్టి అరచేతిలో గోరింటాకుతో పెట్టుకునే చందమామ. 'తారే' అంటే తారలు. రిష్తా అంటే సంబంధం. రబ్ అంటే దైవం. 'షికాయత్ కర్నా' అంటే బాధ చెప్పుకోవటం.

**అరచేతిలో చందమామ పెట్టలేదు**
**తారలతో నేస్తం కట్టలేదు**
**దేవుడికైనా మొరపెట్టలేదు**

చిన్న సరదాలు కూడా తీరని జీవితం చంద్రముఖిది. సరదాలను త్యాగం చేసినా జీవితంలో ఆమెకు ఏమీ దక్కలేదు. జీవితాన్ని నిర్దేశించే తారలు (గ్రహాలు) ఆమెకు అనుకూలించలేదు. దేవుడికి కూడా ఎప్పుడూ తన గోడు చెప్పుకోలేదు.

గమ్ అంటే బాధ, దుఃఖం. ఛుపానా అంటే దాచడం. 'సితమ్' అంటే ఇతరులు పెట్టే బాధలు. 'హఁస్‌కే ఉఠానా' అంటే నవ్వుతూ భరించడ. కాంటే అంటే ముళ్ళు. ఫూల్ అంటే పువ్వులు. జఖ్మ్ అంటే గాయం.

**ప్రతి బాధని దిగమింగాను**
**ప్రతి యాతన నవ్వి భరించాను**
**ముళ్ళని గుండెకి హత్తుకుని**
**పువ్వులచే గాయపడ్డాను**

ముళ్ళవంటి బాధల్ని గుండెలో దాచుకుని నవ్వుతూ భరించింది. పువ్వులు కూడా ఆమెకు శత్రువులే అయ్యాయి.

దువా అంటే ప్రార్థన, వేడికోలు. ఖుదా అంటే దైవం. 'మాంగ్ డాలా' అంటే 'అడిగేశాను' అని.

**అయినా దేవుణ్ణి వేడుకున్నప్పుడు**
**నిన్నే వరముగా కోరుకున్నాను**

ఇన్ని కష్టాలున్నా దేవుణ్ణి ప్రార్థించినప్పుడు ఆమె కోరుకునేది ఒక్కటే - అతడు తనకు దగ్గరవ్వాలని.

ఈ పాటలో కవితా సుబ్రమణ్యం ముఖ్యగాయని అయినాకథక్ నృత్యరీతులకనుగుణంగా కె.కె. ఆలపించిన ఆలాపనలు ఒక నిండుదనాన్ని తీసుకువచ్చాయి.

-సత్యనారాయణ రాజు

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు




వి.మంజురాణి - హైదరాబాద్

ప్ర॥ చదువుని 'అమ్మ'డానికి కారణం?

జ॥ తెలివితేటలు 'అబ్బ'డానికి

ప్ర॥ సూర్యవంశంలో పుట్టిన చంద్రుడు ఎవరు?

జ॥ శ్రీరామచంద్రుడు

ప్ర॥ కాలేజీల్లో చెట్లు పెంచితే ఏమౌతుంది?

జ॥ విద్యార్థుల పరీక్ష చెట్టెక్కుతుంది

## ఈ రూటే వేరు




శివారు : ఆరుగురు శివుళ్ళు

- వి.మంజురాణి, హైద్రాబాద్

బిల్డర్లు : బిల్లును చూపించి భయపెట్టేవారు

- కోట చందన, మచిలీపట్నం

మాజీ : అమ్మగారూ

- జగదీష్, హైద్రాబాద్

## చిలిపి లిపి



"అరుణా! ప్లీజ్ గివ్ మి పొటాషియం అయోడిన్ డబుల్ సల్ఫర్"
(రసాయన శాస్త్రంలో సంకేతాలు ఇలా ఉంటాయి. పొటాషియం-కె, అయోడిన్-ఐ, సల్ఫర్-ఎస్, దీన్ని బట్టి ఊహించుకోండి).

-సి.హెచ్.రాము,
పాయకరావుపేట.

వాడు రెండు 'చాప'ల మధ్య ఉంటూ ఐ.పి.యస్. పరీక్ష పాసైన వాడిలా ఆ డిగ్రీని చివర్న తగిలించుకుని అంకెలన్నీ తనవే అంటున్నాడు.

ఎవడ్రా వాడు?

పోల్చుకో చూద్దాం

ఊహూ!

గణిత శాస్త్రం

ఎలా?

ఇలా... MAT + HE + MAT + ICS = మేథమేటిక్స్

-జి.వెంకటరమణ, అద్దంకి



## చిలిపి కవిత




ఓట్లు అడగడానికి ముందు
మరిచిపోతారు
గతంలో చేసిన పొరపాట్లు...!
ఎన్నికయ్యాక పదవి కోసం పడతారు
నానా రకాల పాట్లు!!
ఎన్నికయ్యాక ఇంకేముంది
కుర్చీలో కునుకుపాట్లు!!!

-ప్రవీణ్
సుశ్రీ, బెల్లంపల్లి

## డబుల్ రోల్



'ఎనీవే'...ఆనాడు సహాయం చేసింది 'నీవే'నా

-హెప్సీ అండ్ నిషి, కుకట్‌పల్లి.

'తనైతే' ఏ పనీ చెయ్యదంటున్నావ్...మరి 'చేతనైతే' ఆ పని నువ్వు చెయ్యి చూద్దాం!

- శిరీష, చందానగర్.

'ఆ కారం' డబ్బా మీద పడ్డాక వాడి 'ఆకారం' పూర్తిగా మారిపోయింది

- భమిడిపాటి వెంకటేశ్వరరావ్, రుద్రారం.

## పేరు - రిపేరు




ఓ చినదానా - నువ్వుంటే చాలు - ఆనందం

- దాసరి చంద్రయ్య, నెల్లూరు

నేను నిన్ను ప్రేమిస్తున్నాను - నువ్వు లేక నేను లేను - నువ్వేనేను నేనేనువ్వు

- ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్

ఆకాశవీధిలో - పుష్పకవిమానం - చాలా బావుంది

-సాయి దినేష్, కర్నూలు.

# పేరడీ పేరేడ్



ముద్దపప్పు కూరలో
ములగకాడ పులుసులో
తెలుగు వారి టేస్టులూ
ఎందరికీ తెలుసులే.... ॥ముద్ద॥
మిరపకాయలో కారం దాగుందని తెలుసును
ఉల్లిపాయలో ఏదీ దాగుందో తెలుసునా
కోసినా...తరిగినా...కన్నీళ్ళే వస్తాయి...
ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా!! ॥ముద్ద॥
'రసం' అరవదే కాని ఘాటున్నదీ దానికీ
జొరమొచ్చిన మనిషికే తెలిసొస్తుందా రుచీ
వడియాలను జతచేసి కడుపారా తినుకో
తినుకొనీ హాయిగా...కమ్మగా నిదురబో ॥ముద్ద॥
ముక్కోటి ఆంధ్రులూ మురిసీ తింటుంటారు
ముందు జనమ బంధాలు ముడియేసి పెడతారు
తిన్నోళ్ళ ఎక్కిళ్ళు కడుపునిండు దీవెనలు
బ్రేవుమనే తేన్పులూ...
బ్రేవుమనే తేన్పులు... మీ అందరికీ సేసలు ॥ముద్ద॥

('మూగమనసులు' సినిమాలోని 'ముద్దబంతి పువ్వులో'
పాట ఆధారంగా)

మామిడి మహేంద్ర
పూణే

మే 20 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి పుట్టినరోజు సందర్భంగా...



# సినిమా పాటే ఆయన ఆస్తి ఆయన పేరు సీతారామశాస్త్రి

**సీతారామశాస్త్రి గారికి కులశేఖర్ మానసపుత్రుడు... ప్రియశిష్యుడు కూడా! 'గురుదక్షిణ' అనే అతి ప్రాచీన సంప్రదాయాన్ని అత్యంత 'నవీనం'గా కొందొకచో 'కవీనం'గా పునరుద్ధరిస్తూ - బొటనవేలును అడగని ఆ 'గురువు' తనలో పెంచిన 'గురుత్వాకర్షణశక్తి' ఎంతటిదో 'గురుతెరిగిన వాడు కనుక ఈ వ్యాసాన్ని 'పాఠకులకు అందించే 'గురుతర' బాధ్యతను తనకు తానుగా తలకెత్తుకొని, తలెత్తుకుని నిలబడేలా రాసిన కులశేఖర్‌కు 'హాసం' కృతజ్ఞతలు.**



"నాదు కవనము వహ్ని గర్భము
నాదు కవనము సుప్త చైతన్య చరితము"

అని ఓ పదిహేడేళ్ళ కుర్రాడు తన లెటర్ హెడ్ మీద వేసుకుంటే ఆ తరం కవులంతా కనుబొమలెగరేశారు. వీడి అసాధ్యం కూల అనుకున్నవాళ్ళూ లేకపోలేదు. ఆయనమాత్రం "నీ కరుణా కటాక్ష వరమో క్రోధారుణ వీక్షణమో నే కవితకు అభిషిక్తుడనో శబ్దాటవి నభిశప్తుడనో గైర్వాణీ నా జననీ" అంటూ సరస్వతీ చరణారవింద వరివస్యా వాల్లభ్యం వదల్లేదు. ఆ నూనూగు మీసాల కవి పేరు చేంబోలు సీతారామశాస్త్రి. ఈ పిల్లకవి పట్టుదల, "పాట"కారితనం సరస్వతికి ముచ్చటేసింది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు తెలియకుండా ఆమె అమృతభాండం నుంచి ఓ పైప్‌లైన్ డైరెక్ట్‌గా ఈయన కలానికి కనక్షన్ ఇచ్చేసి తెలుగు సినిమా జగత్తులో అమృత ధారల్ని కురిపింపచేసింది, చేస్తోంది. అందుకే కాబోలు ఆయన 'నా పాట పంచామృతం' అని సగర్వంగా చెప్పుకోగలిగారు.

అప్పుడెప్పుడో ఆకాశగంగ తన జటాకటాహంలో తాండవమాడితే పరమశివుడు పరవశించి పోయేడట. శాస్త్రిగారి గంగావతరణ కవితా ప్రవాహానికి, కాశీనాథుని విశ్వనాథుడు తడిసి ముద్దయిపోయాడు ఆనందంతో...

తెలుగు సినిమా పాటకు పట్టిన కల్మషాన్నంతా ఈ భగీరథుడి చేత ప్రక్షాళన చేయించాలనుకున్నాడాయన. శివుడాజ్ఞ అయింది. ముక్కోటి దేవతలంతా తథాస్తన్నారు. సీతారామశాస్త్రి అనే కవి సిరివెన్నెల సినిమాతో అడుగుపెట్టి అదే ఇంటిపేరు, ఒంటిపేరు కూడా చేసుకున్నారు.

సిరివెన్నెల సినిమా పాటలు రాగానే ఆంధ్రదేశం ఒక్కసారి అవాక్కయింది. అంతవరకు ఒకే మూసలో వస్తున్న పాటలకు భిన్నంగా ఈ పాటలు రూపుదిద్దుకుని ట్రెండ్ క్రియేట్ చేశాయి. ఈ పాటలు రాసినాయనకు ముప్ఫై ఏళ్ళు కూడా లేవని తెలిసి సహజ కవి ఎమ్.ఎస్.రెడ్డి లాంటి దిగ్గజాలు కూడా విస్తుపోయేరు. ఆంధ్రదేశం ఎక్కడ విన్నా అవే పాటలు. పదాలు పలకటం రానివాళ్ళు, అర్థాలు తెలియనివాళ్ళు "విరించినై విలపించితినీ" అని కూడా పాడుకున్నారంటే ఈ పాటలు వాళ్ళనెంత ప్రభావితం చేశాయో అర్థమవుతుంది.

అప్పట్లో ఆ సినిమా హీరో హీరోయిన్‌కోసం కాకుండా పాటలు రాసిన సీతారామశాస్త్రి గారిని చూడాలని ప్రేక్షకులు ఎగబడటం నిజంగా భారత చలనచిత్ర పరిశ్రమలోనే ప్రథమం. ఒకే ఒక సినిమాతో ఆ కవిని చూడాలనీ, ఆయనతో మాటలాడాలనీ ఆయన కోసం అభిమానులు పడిగాపులు పడటం అనే అదృష్టం ఇంకెవరికీ దక్కలేదు. మొదటి సినిమాతోనే ఆయనలో ఎంత సత్తా ఉందో నిరూపించుకునే అవకాశం కలిగింది. అయితే సినిమా పాటలో కవిత్వాలేమిటోయ్ కమర్షియల్ ఎలిమెంట్స్ ఉండాలిగానీ, అన్నారు కొందరు. ఆయనేం తక్కువతిన్నారా?

**"బోటనీ పాఠముంది, మాటనీ ఆట ఉంది"** అన్నారు.

ఈ పాటకి కుర్రకారు "శివ"మెత్తి ఆడేరు...

**"బలపం పట్టి భామ బళ్ళో..."** అని రాసి అమలిన శృంగారాన్ని అద్భుతంగా ఆవిష్కరించగలరని నిరూపించారు.

ఇక ఆయనకీ ఆయన కలానికీ ఎదురే లేకుండా పోయింది.

"ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యా" అంటాడు కాళిదాసు. పార్వతీ దేవి పూర్వజన్మలో నేర్చుకున్న విద్యలన్నీ నేనంటే నేనని ఆమెను చేరుకున్నాయిట. శాస్త్రిగారు పాట రాయటం ప్రారంభిస్తే తెలుగు వాఙ్మయంలో పదాలన్నీ మరో జన్మ ఎత్తి తమ ప్రాముఖ్యాన్ని చాటుకోవాలంటే శాస్త్రిగారి పాటలోనే పుట్టాలని అహమహమికతో ఎగబడతాయి.

### సినిమా పాట ఇవాళ బిజినెస్సు ఆయనకి మాత్రం తపస్సు

చిన్న సినిమా అయినా పెద్ద సినిమా అయినా ఆయన పడే శ్రమ ఒకటే. పదిహేనేళ్ళనుంచీ ఇదే వృత్తిలో ఉన్నా తొలిరోజుల్లో ఉండే పట్టుదలే ఇప్పుడూ ఆయన నరనరాల్లోనూ ఉంది. ట్రెండులు మారుతున్నా, కొత్తగా రోజుకో పాటల రచయిత కెరటంలా ఎగసి పడుతున్నా మేరుపర్వతంలా

ఆయనే ఇప్పటికీ ఎప్పటికీ నెంబర్ వన్. ఎందుకంటే పాటకోసం ఆయన పడే శ్రమ చేసిన పరిశ్రమ అలాంటిది...

కాళిదాసు నుంచి కవులెవరయ్యా అంటే చిటికెనవేలుతో ప్రారంభించి తరవాత ఎవరి పేరు చెప్పాలన్నదీ తేలక ఆ వేలు ఖాళీగా వదిలేస్తే అది అనామికగా (ఉంగరపు వేలు) ఉండిపోయిందట. సీతారామశాస్త్రి గారి తరవాత సినిమా కవి ఎవరు అంటే కూడా ఇదే సమాధానం.

పాటలో ఒక థాట్ కంటిన్యుటీ తు.చ. తప్పకుండా పాటించటం శాస్త్రిగారి ప్రత్యేకత. "గురువుగారూ! పాటలో థాట్ ఏమీ వద్దండీ", అని దర్శక నిర్మాతలు అంటే... 'వీళ్ళు తాట (థాట్) తీసెయ్యమంటున్నారయ్యా' అంటూ నవ్వుతారాయన. ఎన్నో సినిమాలు ఆయన పాటల పుణ్యమా అని శతదినోత్సవాలు జరుపుకున్నాయి. ఎందరో దర్శక నిర్మాతలు తమ ఉనికిని కాపాడుకోగలిగారు.

**ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి**
**ఎప్పుడూ వదులుకోవద్దురా ఓరిమి (పట్టుదల)**
**మనసు కాస్త కలత పడితె మందు ఇమ్మని**
**మరణాన్ని అడగకు**
**కనుల నీరు తుడుచువారు ఎవరు లేరని**
**చితి చెలిమి చేయకు (శ్రీకారం) -**

లాంటి పాటలు వింటే డాక్టరు కాబోయి రైటరు అయిన శాస్త్రిగారు నిజంగా మానసిక వైద్యుడనిపిస్తుంది. ఓ సంఘటన చెబితే మీరూ నిజమేనంటారు.

విశాఖపట్నంలో నిడమర్తి బసవరాజు అని ప్రముఖ హిప్నాటిస్టు. ఆయన దగ్గరకి ఓసారి ఓ ఎమ్.సి.ఏ. కుర్రాడు ట్రీట్మెంటుకు వచ్చాడు. అతడు ప్రతి సబ్జెక్టులోనూ సెంట్ పర్సెంట్ మార్కులు తెచ్చుకునే విద్యార్థి. అతనిదో సబ్జెక్టు పోయింది. దాంతో అతను డిప్రెషన్‌కి లోనై ఆత్మహత్య చేసుకోబోతే వాళ్ళ తల్లిదండ్రులు ఆపి బసవరాజు దగ్గరకు తీసుకువచ్చారు. బసవరాజుగారు శాస్త్రిగారు రాసిన "ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి" పాట వినిపించారు.

'సార్, ఆ పాటను మళ్ళా పెట్టండి' అంటూ పదే పదే విని నిజంగా ఆత్మహత్య చేసుకోవటం అవివేకమని గ్రహించాడు ఆ కుర్రాడు. నేను ఓడిపోలేదు అంటూ రీ వాల్యుయేషన్‌కి పెట్టడం అతనికి డిస్టింక్షన్ రావడం కూడా జరిగాయి. దీనికి నేను, విశాఖపట్నం ఆంధ్రభూమి రిపోర్టర్ అనుపోజు అప్పారావు, బసవరాజు ప్రత్యక్ష సాక్షులం.

అసువులు పోసిన కవి భారవి కవిత ఎప్పుడో విన్నాం...

మళ్ళీ అంతటి ఘనత శాస్త్రిగారి పాటలో ప్రత్యక్షంగా చూస్తున్నాం.

నిరుద్యోగులైన యువకులు, అత్తవారింటి ఆరళ్ళకు నలిగిపోతున్న ఆడపడుచులు, బతుకుపోరులో విసిగిపోయిన బాటసారులు, నిరాశానిస్పృహల్లో కుంగిపోయిన శ్రమజీవులు -

ఇలా ఎందరో శాస్త్రిగారి పాటలు విని సేదతీరుతున్నారు, బతుకుమీద ఆశ పెంచుకుంటున్నారు.

శాస్త్రిగారి పాటల్లో ఆశావాదం అణువణువునా ప్రస్ఫుటమవుతుంది.

సినిమా పాట వృత్తి అయినా ఆయన ప్రవృత్తి మానవత్వం. ఎవరికయినా కష్టం వస్తే చాలు, ముందుగా ఈయన తల్లడిల్లి పోతారు. ఆయనతో మాట్లాడటమే పెద్ద ఎడ్యుకేషన్. ఆయనతో ఓ పదినిముషాలు మాట్లాడితే చాలు. డిప్రెషన్‌లో ఉన్న వారెవరికైనా కొండంత బలం.

ఆయనకి అవార్డులు కొత్తకాదు. మొదటి సినిమా నుంచి వరుసగా కోకొల్లలుగా అవార్డులూ, ప్రశంసలూ అందుకుంటూనే ఉన్నారు. అష్టనందులు ఆయనింట కొలువు తీరాయి. **అయితే ఈ మానసిక వైద్యుడికి డాక్టరేట్ ఇచ్చి ఆ గౌరవాన్ని ఏ యూనివర్శిటీ దక్కించుకుంటుందో?!**



బతుక్కి భరోసా ఇచ్చే శాస్త్రిగారి పాటలన్నీ కలిపి, ఓ పాఠ్యపుస్తకం చేసి, స్కూళ్ళలోనూ, కాలేజీల్లోనూ విద్యార్థులకు ఆత్మ విశ్వాసం పెంపొందించే సబ్జక్టుగా బోధిస్తే మానవాళికి ఎంతో ఉపకారం చేసిన ఘనత ప్రభుత్వాలకు లభిస్తుంది.

ఇలాంటి సుకవిని కని ఆంధ్రదేశానికి అందించిన కీ.శే. డా॥. యోగి, సుబ్బలక్ష్మి దంపతులకు, శాస్త్రిగారిని సినిమాకవిగా పరిచయం చేసిన కళాతపస్వి డా॥.కె. విశ్వనాథ్ గారికి, ఆయనకు శాస్త్రిగారిని పరిచయం చేసిన సినీ రచయిత ఆకెళ్ళగారికి తెలుగు సినిమాపాటల అభిమానులు సర్వదా కృతజ్ఞులు.

శాస్త్రిగారి అవక్ర పరాక్రమ జైత్రయాత్రకు అవిశ్రాంతంగా సహకరిస్తున్న వారు ముఖ్యంగా ఇద్దరు. ఒకరు శాస్త్రిగారిని తీర్చి దిద్దిన సత్యారావు మాష్టారయితే, మరొకరు శాస్త్రిగారి అర్ధాంగి శ్రీమతి పద్మావతిగారు.

శాస్త్రిగారి కీర్తికౌముది దిగ్దిగంతాలకూ వ్యాపిస్తే అదిచూసి నలువరాణి వరవీణామృదుపాణి శ్రీవాణి తన ప్రతిరూపమని మురిసిపోతోంది. నటరాజస్వామి జటాజూటిలోకి చేరకుంటే విరుచుకుపడు సురగంగకు విలువేముంది? అని నిగ్గదీసి అడిగితే నీరుకారిపోయిన గంగమ్మతల్లికూడా శాస్త్రిగారి చల్లని పాటకి పొంగిపోతోంది.

జామురాతిరి జాబిలమ్మ ఆయన పాటలకు వెన్నెల పూస్తోంది. శివపూజకు చివురించిన సిరిసిరిమువ్వలు ఘల్లుఘల్లుమంటున్నాయి. పేదగరికపూలు తేనెదోసిలితో హృదయాంజలి పడుతున్నాయి. తూనీగ మరో తూనీగను పిలుస్తూ వంతపాడుతోంది. పరమపదంలో ఉన్న డా॥.యోగిగారికి ముక్కోటి దేవతలూ శాస్త్రిగారి దిగ్విజయ యాత్ర వివరాలను విశేషాలనూ అందిస్తూనే ఉన్నారు. అవి విని ఆయన మురిసిపోతున్నారు. పుత్రోత్సాహాన్ని అక్కడినించే ఆనందిస్తున్నారు. దీవెనలందిస్తున్నారు.

గురువుగారికి జన్మదిన శుభాకాంక్షలతో

-కులశేఖర్.

## సిరివెన్నెల

**సంగీతం : కె.వి.మహదేవన్  గానం : బాలు, సుశీల**

సాకీ: విధాత తలపున ప్రభవించినది అనాది జీవన వేదం ఓం...
ప్రాణనాడులకు స్పందననొసగిన ఆది ప్రణవనాదం ఓం...
కనుల కొలనులో ప్రతిబింబించిన విశ్వరూప విన్యాసం
ఎద కనుమలలో ప్రతిధ్వనించిన విరించి విపంచి గానం....

ప: విరించినై విరచించితిని ఈ కవనం
విపంచినై వినిపించితిని ఈ గీతం
సరసస్వర సురఝురీ గమనమౌ సామవేద సారమిది
నే పాడిన జీవన గీతం ఈ గీతం... ॥విరించినై॥

చ: ప్రాగ్దిశ వీణియపైన
దినకర మయూఖ తంత్రులపైన
జాగృత విహంగ తతులే
వినీల గగనపు వేదికపైన
పలికిన కిలకిల స్వనముల స్వరగతి
జగతికి శ్రీకారము కాగా
విశ్వకావ్యమునకిది భాష్యముగా... ॥విరించినై॥

చ: జనించు ప్రతిశిశు గళమున పలికిన జీవననాద తరంగం
చేతన పొందిన స్పందన ధ్వనించు
హృదయ మృదంగ ధ్వానం
అనాది రాగం ఆదితాళమున అనంత జీవనవాహినిగా
సాగిన సృష్టి విలాసమునే.... ॥విరించినై॥
నా ఉచ్ఛ్వాసం కవనం
నా నిశ్వాసం గానం
సరసస్వర సురఝురీ గమనమౌ సామవేద సారమిదీ
నే పాడిన జీవనగీతం ఈ గీతం......

## స్వాతి కిరణం

**సంగీతం : కె.వి.మహదేవన్  గానం : వాణీ జయరాం**

ప: తెలిమంచు కరిగింది తలుపు తీయనా ప్రభూ!
ఇల గొంతు వణికింది పిలుపు నీయనా ప్రభూ!.....
నీ దోవ పొడవునా కువకువల స్వాగతం!
నీ కాలి అలికిడికి మెలకువల వందనం!! ॥తెలిమంచు॥

చ: ఈ పూల రాగాల పులకింత గమకాలు
గారాబు కవనాల గాలి సంగతులు
నీ చరణ కిరణాలు పలుకరించినా చాలు
పల్లవించును ప్రభూ! పవళించు భువనాలు
భానుమూర్తీ! నీ ప్రాణ కీర్తన విని
పలుకనీ ప్రణతులని ప్రణవ శ్రుతిని!
పాడనీ ప్రకృతిని ప్రథమ కృతిని ॥తెలిమంచు॥

చ: భూపాల! నీ మ్రోల ఈ బేల గానాలు
నీ రాజసానికవి నీరాజనాలు!
పసరు పవనాలలో పసికూన రాగాలు
పసిడి కిరణాలు పడి పదును తేలిన చాలు
తలయూచు.....తలిరాకు బహుపరాకులు విని
దొరలనీ దొరనగవు దొంతరనీ
తరలనీ దారి తొలగి రాతిరినీ...... ॥తెలిమంచు॥

## రుద్రవీణ

**సంగీతం : ఇళయరాజా  గానం : బాలు**

ప: తరలి రాద తనే వసంతం! -తన దరికి రాని వనాలకోసం!!
గగనాల దాకా అల సాగకుంటే -
మేఘాల రాగం ఇల చేరుకోదా? ॥తరలిరాద॥

చ: వెన్నెల దీపం కొందరిదా? అడవిని సైతం వెలుగు కదా!
ఎల్లలు లేని చల్లని గాలి - అందరి కోసం అందును కాదా
ప్రతి మదిని లేపే ప్రభాత రాగం
పదే పదే చూపే ప్రధాన మార్గం
ఏదీ సొంతం కోసం కాదను సందేశం
పంచే గుణమే పోతే ప్రపంచమే శూన్యం
ఇది తెలియని మనుగడ కథ
దిశ నెరుగని గమనము కద ॥తరలిరాద॥

చ: బతుకున లేని శృతి కలదా - ఎదసడి లోనే లయ లేదా
ఏ కళకైనా ఏ కలకైనా - జీవిత రంగం వేదిక కాదా
ప్రజాధనం కాని కళా విలాసం -
ఏ ప్రయోజనం లేని వృథా వికాసం
కూసే కోయిల పోతే కాలం ఆగిందా
పారే ఏరే పాడే మరో పదం రాదా
మురళికి గల స్వరముల కళ
పెదవిని విడి పలుకదు కద ॥తరలిరాద॥

## పెళ్ళిసందడి

**సంగీతం : కీరవాణి  గానం : బాలు, చిత్ర**

ప: హృదయమనే కోవెల తలుపులు తెరిచే తాళం!
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!
త్యాగమనే దేవత సన్నిధి వెలిగే దీపం
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!
అణువణువును చెలిమికి అంకితమిచ్చును ప్రేమ!
తను నిలువున కరుగుతు కాంతి పంచునది ప్రేమ!
గగనానికి నేలకి వంతెన వేసిన వానవిల్లు ఈ ప్రేమ!
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!

చ: ఇవ్వడమే నేర్పగల ఈ ప్రేమ!
తన కొరకు ఏ సిరిని అడగదు కదా!
నవ్వడమే చూపగల ఈ ప్రేమ!
మంటలనె వెన్నెలగ మార్చును కదా!
గాలికి గంధము పూయడమే పూలకు తెలిసిన ప్రేమ సుధ!
రాలిన పూవుల జ్ఞాపకమే కాలం చదివే ప్రేమ కథ!!
ప్రియమైన తనవారి సుఖశాంతులే కోరి
మురిసేటి గుణమే ప్రేమ
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ! ॥హృదయమనే॥

చ: ఏ జతనో ఎందుకో విడదీసి వెంటాడి వేటాడు ఆటే ప్రేమ
మౌనముతో మనసునే
శృతిచేసి రాగాలు పలికించు పాటే ప్రేమ
శాశ్వత చరితల ఈ ప్రేమ మృత్యువు ఎరగని చిరునామా
శ్వాసను మంగళహారతిగా వెలిగించేదే ఈ ప్రేమ!!
మరణాన్ని ఎదిరించి మరుజన్మగా వచ్చి
కరుణించు వరమే ప్రేమ!
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ! ॥హృదయమనే॥

## మనసిచ్చి చూడు

సంగీతం : మణి శర్మ గానం : మనో, తేజ, మురళి

ప: బోడి చదువులు వేస్తు! నీ బుర్రంతా భోంచేస్తూ
అడి చూడు క్రికెట్టు! టెండూల్కర్ అయ్యేటట్టు!
ఒక్క ఫోజు కొట్టు! లక్షలు వచ్చిపడేటట్టు!
'ఆదిదాసు' బూట్లు! తొడగవ నీకు ఆరుకోట్లు!
ఎంత చదివితే సంపాదిస్తావ్ అంత పెద్ద అంతస్థు!!
ఓరి ఇన్నోసెంటు స్టూడెంటూ! ॥బోడి చదువులు॥

చ: చిరపుంజిలోన చినుకెంతైనా తడుస్తుందా నీ జుట్టు?
థార్ ఎడారి గోలెందుకురా గోదారి ఒడ్డునుంటూ?
వీరప్పన్ కొట్టేసుంటాడు అశోకుడెపుడో నాటిన చెట్లు!
పాతడేట్లు బట్టీ వేస్తూ అసలేంటీ కుస్తీపట్లు?
'ఐక్యూ' అంటే అర్థం తెలుసా అతి తెలివికి తొలి మెట్టు
ఆడే పాడే ఈడును దానికి పెట్టకు తాకట్టు
పనికిరాని చెత్తంతా నింపకు మెదడు చెదలు పట్టు!
ఓరి ఇన్నోసెంటు స్టూడెంటూ!! ॥బోడి చదువులు॥

చ: లీకు వీరులకు ముందే తెలుసు క్వశ్చన్ పేపర్ గుట్టు!
లోకజ్ఞానం కలిగినవాడే కోచింగ్ సెంటర్ పెట్టు
మార్కులకోసం ఏడవలేదురా ఎదిగిన ఏ సైంటిస్టూ
గుర్తుపట్టరా ఏ రంగంలో ఉందో నీ ఇంట్రెస్టు
నీక్కూడా ఉండే ఉంటుంది ఏదో ఒక టాలెంటు
నీకు నువ్వు బాసవ్వాలంటే దాన్ని బయట పెట్టు
రేసు హార్సువై, లైఫును గెలిచే పరుగు మొదలు పెట్టు!!
ఓరి ఇన్నోసెంటు స్టూడెంటూ!! ॥బోడి చదువులు॥

చ: రెండోఎక్కం రాకపోయినా
నీకేఁవిట్రా లోటు? కాలిక్యులేటర్ చేపట్టు
బిల్లుకడితే నీ బెడ్రూంలో వేస్తాడు బాసింపట్టు
సాక్షాత్తు బిల్‌గేట్సు!!
పిచ్చోడెవడో జుత్తుని పీక్కుని ఎన్నో కనిపెట్టు
పైసా ఉంటే అదే నీకు అవి అన్నీ కొనిపెట్టు!
చదువూ సంధ్యా వదిలిపెట్టి సన్నాసివి కమ్మంటూ
సలహా ఇస్తున్నాననుకుంటే అదే రాంగు రూటు
బతుకు బాటలో ముందుకు నడపని బరువు మోయవద్దు
ఓరి ఇన్నోసెంటు స్టూడెంటూ!! ॥బోడి చదువులు॥

## శృతిలయలు

సంగీతం : కె.వి.మహదేవన్ గానం : జేసుదాస్

ప: తెలవారదేమో స్వామీ!
నీ తలపుల మునకలో
అలసిన దేవేరి అలమేలు మంగకు.... ॥తెలవారదేమో॥

చ: చెలువము నేలగ చెంగట లేవని
కలతకు నెలవై నిలిచిన నెలతకు
కలల అలజడికి నిద్దుర కరవై
అలసిన దేవేరి అలమేలు మంగకు ॥తెలవారదేమో॥

చ: మక్కువ మీరగ అక్కున జేరిచి
అంగజుకేళిని పొంగుచు తేల్చగా
ఆ మత్తునే మది మరి మరి తలచగా
అలసిన దేవేరి అలమేలు మంగకు ॥తెలవారదేమో॥

## మనసులో మాట

సంగీతం : యస్వీ కృష్ణారెడ్డి గానం : బాలు

ప: ఏ రాగముంది మేలుకొని
ఉండి లేవనంటున్న మనసుని పిలువగ
ఏ తాళముంది సీసమునుపోసి
మూసుకొనిఉన్న చెవులను తెరువగ
సంగీతమంటె ఏమిటో
తెలిసి ఉండాలి మనకి ముందుగా-అంత
సందేహముంటె తీర్చుకో,
గురువులున్నారు కనులముందుగా వెళ్లి
నీలిమేఘాన్ని గాలివేగాన్ని నింగిమౌనాన్ని అడగరా - కడలి
అలపించేటి ఆ తరంగాల అంతరంగాన్ని అడగరా-మధుర
ప్రాణగీతాన్ని పాడుతూ ఉన్న ఎదసడినడిగితె
శృతిలయ తెలుపద?
బ్రతుకును నడిపిన సంగతి తెలియద?

చ: ఏ సుప్రభాత గళముతో నేల స్వాగతిస్తుంది
తొలి తొలి వెలుగుని?
ఏ జోల పాట చలువతో నింగి సేదతీర్చింది
అలసిన పగటిని?
స్వర్ణతరుణాలు, చంద్రకిరణాలు,
జిలుగులొలికి బదులు పలుకునెవరికి?
మంచు మౌనాలు పంచమంలోన
మధువు చిలుకు ఎవరి చెలిమి రవళికి?
తోటలో చేరి పాట కచ్చేరి చేయమంటున్న వినోదమెవరిది?
వేల అందాల పూల గంధాల చైత్ర గాత్రాన సునాద మెవరిది?
పంచవర్ణాల పింఛమై నేల నాట్యమాడేటి వేళలో మురిసి
వర్షమేఘాల హర్ష రాగాలు వాద్యమయ్యేటి లీలలో తడిసి
నీరుగా నీరు ఏరుగా ఏరువాకగా
నారు చిగురులు తొడగగ
పైరు పైటేసి పుడమి పాడేటి
పసిడి సంక్రాంతి పదగతులెవరివి?
ఆరు కాలాలు ఏడు స్వరములతో
అందజేస్తున్న రసమయ మధురిమ
వినగల చెవులను కలిగిన హృదయము
తన ప్రతి పదమున చిలుకద సుధలను
జోహారు నీకు సంద్రమా!
ఎంత ఓపికో! అసలు అలసట కలుగదు?
ఓహోహో గాన గ్రంధమా!
ఎంత సాధనో దిశలు ఎదలకు తెలియదా?
నీ గీతమెంత తడిమినా శిలలు సంగీత కళలు కావనీ ఎంత
నాదామృతాన తడిసినా ఇసుక రవ్వంత కరగలేదనీ తెలిసీ
అస్తమిస్తున్న సూర్యతేజాన్ని కడుపులో మోసి నిత్యమూ కొత్త
ఆయువిస్తున్న అమృతంలాంటి
ఆశతో ఎగసి ఆవిరై అష్టదిక్కులూ
దాటి మబ్బులను మీటి నిలువున నిమిరితె గగనమే కరగద
జల జల చినుకుల సిరులను కురవదా
అణువణువణువున తొణికితె స్వరసుధ
అడుగడుగడుగున మధువని విరియదా....

## నిన్నే పెళ్ళాడుతా

సంగీతం : సందీప్ చౌతా　　గానం : రాజేష్

ప: ఎటో వెళ్ళిపోయింది మనసు
ఇలా ఒంటరయ్యింది వయసు
ఓ చల్లగాలి ఆచూకి తీసి
కబురీయలేవా ఏమయిందో..... ॥ఎటో॥
ఏ స్నేహమో కావాలని ఇన్నాళ్ళుగా తెలియలేదు
ఇచ్చేందుకే మనసుందని నాకెవ్వరూ చెప్పలేదు
చెలిమి చిరునామా
తెలుసుకోగానే రెక్కలొచ్చాయో ఏమిటో.... ॥ఎటో॥
కలలన్నవే కొలువుండని కనులుండి ఏం లాభమంది
ఏ కదలిక కనిపించని శిలలాంటి బ్రతుకెందుకంది
తోడు ఒకరుంటే జీవితం ఎంతో వేడుకౌతుంది అంటూ.....
ఎటో వెళ్ళిపోయింది మనసు
ఎటెళ్ళిందో అది నీకు తెలుసు
ఓ చల్లగాలి ఆచూకి తీసి
కబురీయలేవా ఏమయిందో..... ॥ఎటో॥

## మాస్టర్

సంగీతం : దేవా　　గానం : చిరంజీవి

ప: తమ్ముడూ! అరె తమ్ముడూ!
ఈ తికమక తెగులే ప్రేమంటే ఈ తెలియని దిగులే ప్రేమంటే-
నను అడగర చెబుతా డౌటుంటే
నువు బెదరవు కద నా మాటింటే
అమ్మడూ! ఓ అమ్మడూ!
నువు మరీ పరాగ్గా వుంటుంటే
నీకు నిదరే సరిగా రాకుంటే-
ఏం జరిగిందో తెలియాలంటే ఆ రహస్యాన్ని చెబుతా వింటే.....
కో: మాస్టారూ మాస్టారూ మాంచి లెక్చరు ఇచ్చారు
మాస్టారూ మాస్టారూ లవ్‌లో మీరు మెగాస్టారు ॥తమ్ముడూ!
వేల వేల భాషలున్న నేల మీద ఎక్కడైన
ప్రేమగ్రామరొకటే లవ్వరూ - ఆ లాంగ్వేజ్ తెలియనిదెవరు
మూగసైగలైన చాలు వేడి ఊపిరైన చాలు
గుర్తుపట్టలేరా ప్రేమికులు-అవి అచ్చుతప్పలేని ప్రేమలేఖలు
అమెరికాలో ఇంగ్లీష్ ప్రేమ-ఆఫ్రికాలో జంగిల్ ప్రేమ
ఏకమయ్యే ఏకాంతంలో ఎక్కడైనా ఒకటే ప్రేమ
తమ్ముడూ! అరె తమ్ముడూ!
గుడ్డివాడు కుంటివాడు నల్లవాడు తెల్లవాడు
ప్రేమ దేశమెళ్ళగానె మానవుడిగ మిగులుతారు॥తమ్ముడూ॥
చ: లక్షలాది లక్షణాలు చూపుతున్న
ప్రేమకున్న అక్షరాలు మాత్రం రెండు-
అది మహా సముద్రం ఫ్రెండు
సెంచరీల తోటి పెద్ద సీరియల్‌గా
సాగుతున్న మహానవలరా ప్యారు- ఆ స్టోరీ కొట్టదు బోరు
'క' గుణింతం తెలియని వారు - కాళిదాసులు ఐపోతారు
కాఫీ టీలే తాగని వారు దేవదాసులు ఐపోతారు
అమ్మడూ! ఓ అమ్మడూ!
లబ్ డబ్ హార్టుబీటు లవ్ లవ్ అన్నదంటె
హైక్లాసు లోక్లాసు చూసుకోదు ప్రేమకేసు ॥తమ్ముడూ॥

## పట్టుదల

సంగీతం : ఇళయరాజా　　గానం : జేసుదాస్

ప: ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి
ఎప్పుడూ వదులుకోవద్దురా ఓరిమి
విశ్రమించవద్దు ఏ క్షణం - విస్మరించవద్దు నిర్ణయం
అప్పుడే నీ జయం నిశ్చయంరా..... ॥ఎప్పుడూ॥
చ: నింగి ఎంత గొప్పదైనా రివ్వుమన్న గువ్వపిల్ల
రెక్కముందు తక్కువేనురా
సంద్రమెంత పెద్దదైనా ఈదుతున్న చేపపిల్ల
మొప్పముందు చిన్నదేనురా
పశ్చిమాన పొంచి ఉండి రవిని మింగు అసుర సంధ్య
ఒక్కనాడు నెగ్గలేదురా
గుటకపడని అగ్గిఉండ సాగరాలనీదుకుంటు
తూరుపింట తేలుతుందిరా
నిశా విలాసమెంతసేపురా ఉషోదయాన్ని ఎవ్వడాపురా
రగులుతున్న గుండెకూడా సూర్యగోళమంటిదేరా॥ఎప్పుడూ॥
నొప్పి లేని నిముషమేది జననమైనా మరణమైనా
జీవితాన అడుగడుగునా......
నీరసించి నిలిచిపోతే నిముషమైనా నీది కాదు
బ్రతుకు అంటే నిత్య ఘర్షణ.......
దేహముంది ప్రాణముంది
నెత్తురుంది సత్తువుంది
అంతకన్న సైన్యముండునా
ఆశ నీకు అస్త్రమౌను శ్వాస నీకు శస్త్రమౌను
ఆశయమ్ము సారథౌనురా
నిరంతర ప్రయత్నమున్నదా నిరాశకే నిరాశ పుట్టదా
ఆయువంటు ఉన్నవరకు చావుకూడా నెగ్గలేక
శవము పైనె గెలుపు చాటురా ॥ఎప్పుడూ॥

## మనీ

సంగీతం : శ్రీ　　గానం : శ్రీనివాసమూర్తి

ప: భద్రం బీ కేర్‌ఫుల్ బ్రదరు, భర్తగ మారకు బ్యాచిలరు
షాదీ మాటే వద్దు గురూ, సోలో బ్రతుకే సో బెటరూ
అలికి మెళ్ళో ముళ్ళేశానని ఆనందించే మగవారు
ఆ తాడే తమ ఉరితాడన్నది ఆలోచించక చెడతారు
మొగుడయ్యే ముహూర్తమే
మగాడి సుఖాల ముగింపు ఛాప్టరు ॥భద్రం॥
చ: వంటకని వైఫెందుకురా హోటళ్ళే చాలు
వంటికని ఒకటా రెండా అంగడి అందాలు
కోతికి ఉందా, కోడికి ఉందా ఈ పెళ్ళాచారం
జంటలు కట్టే జంతువులెరగవు వెడ్డింగ్ విడ్డూరం
ఎందుకు మనకీ గ్రహచారం ॥భద్రం॥
చ: చచ్చి చెడి డే అండ్ నైటూ చాకిరి చేస్తావు
తెచ్చినది డార్లింగ్ దయ్యం చేతిలో పోస్తావు
బీడీ కోసం బీబీ ముందు దేహీ అంటావు
గాడిని దాటని గానుగ ఎద్దయి బతికేం చేస్తావు
బాండెడ్ బానిసవవుతావు! ॥భద్రం॥

## సొగసు చూడతరమా

సంగీతం : రమణీ భరద్వాజ్ గానం : అనురాధా శ్రీరామ్

ప: సీతాకోక చిలకాలమ్మా లేలేత చిగురాకులమ్మా!
పొరాడు పాపాయిలమ్మా పొంగి పొరేటి సెలయేరులమ్మా!
పొత్తిళ్ళల్లో చిట్టి పుత్తడిబొమ్మను
పొదువుకున్న ముద్దుగుమ్మ అమ్మ...
పొందేటి ఆనందమేదో తెలియాలంటే
ఎత్తాలి తను ఆడజన్మ - బ్రహ్మా.... ॥సీతాకోక॥
చ: కుహు కుహు కూసే కోయిలా
-ఏదీ పలకవే ఈ చిన్నారిలా
మిల మిలా మెరిసే వెన్నెలా-ఏదీ నవ్వవే ఈ బుజ్జాయిలా
అందాల పూదోటకన్నా చిందాడు పసివాడె మిన్న
బుడత అడుగులే నడిచేటి వేళలో
పుడమి తల్లి కెన్ని పులకలో ॥సీతాకోక॥
చ: గలగలా వీచే గాలిలా సాగే పసితనం తీయని ఒక వరం
ఎదిగిన ఎదలో ఎప్పుడూ నిధిలా దాచుకో ఈ చిరుజ్ఞాపకం
చిరునవ్వుతో చెయ్యి నేస్తం - చీమంత అయిపోదా కష్టం
పరుగు ఆపునా పడిపోయి లేచినా
అలుపు సొలుపు లేని ఏ అలా ॥సీతాకోక॥

## శుభలగ్నం

సంగీతం : యస్వీ కృష్ణారెడ్డి గానం : బాలు

ప: చిలకా! ఏ తోడు లేక ఎటేపమ్మ ఒంటరి నడక
తెలిసీ అడుగేసినావే ఎడారంటి ఆశల వెనక
మంగళసూత్రం అంగడి సరుకా? కొనగలవా చేజారాకా
లాభం ఎంతొచ్చిందమ్మా సౌభాగ్యం అమ్మేశాక!! ॥చిలకా॥
చ: బతుకంతా బలిచేసే పేరాశను ప్రేమించావే!
వెలుగుల్నే వెలి వేసే కలలోనే జీవించావే!
అమృతమే చెల్లించి ఆ విలువతో........
హలాహలం కొన్నావె అతి తెలివితో!
కురిసే ఈ కాసుల జడిలో! తడిసీ నిరుపేదైనావే!!॥చిలకా॥
చ: అనురాగం కొనగలిగే ధనముందా ఈ లోకంలో?
మమకారం విలువెంతో మరిచావా సిరిమైకంలో?
ఆనందం కొనలేని ధనరాశితో.......
అనాధగా మిగిలావె అమవాసలో!
తీరా నువు కనుదెరిచాక!
తీరం కనబడదే ఇంక ॥చిలకా॥

## నువ్వే కావాలి

సంగీతం : కోటి గానం : చిత్ర

ప: కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూడవెందుకు
చెప్పలేని గుండెకోత పోల్చుకుందుకు
మనం అన్నది ఒకే మాటని నాకిన్నాళ్ళు తెలుసు
నువ్వు నేను ఇద్దరున్నామంటే నమ్మనంటు ఉంది మనసు
ఓ...ఓ...ఓ...ఓ....
చ: ఈనాడే సరికొత్తగా మొదలైందా మన జీవితం
గతమంటూ ఏం లేదని చెరిగిందా ప్రతి జ్ఞాపకం
కనులు మూసుకుని ఏం లాభం? కలై పోదుగా ఏ సత్యం
ఎటూ తేల్చని నీ మౌనం - ఎటో తెలియని ప్రయాణం
ప్రతి క్షణం ఎదురయ్యే నన్నే దాటగలదా? ॥కళ్ళల్లోకి॥
చ: గాలిపటం గగనానిదా - ఎగరేసే ఈ నేలదా
నా హృదయం నీ చెలిమిదా - ముడివేసే ఇంకొకరిదా
నిన్నా మొన్నలన్ని నిలువెల్లా నిత్యం నిన్ను తడిమే వేళ
తడే దాచుకున్న మేఘంలా ఆకాశాన నువ్వు ఎటు ఉన్నా
చినుకులా కరగకా శిలై ఉండగలవా ॥కళ్ళల్లోకి॥

## మనసంతా నువ్వే

సంగీతం : ఆర్.పి.పట్నాయక్ గానం : సంజీవని, ఉష

ప: తూనీగా తూనీగా
ఎందాక పరిగెడతావే రావే నా వంక
దూరంగా పోనీక
ఉంటాగా నీ వెనకాలే రానీ సాయంగా
ఆవంకా ఈవంకా తిరిగావే ఎంచక్కా
ఇంకానా చాలింక ఇంతేగా నీరెక్కా
ఎగిరేనా ఎప్పటికైనా ఆకాశం దాకా ॥తూనీగా॥
చ: దోసిట్లో ఒక్కో చుక్కా పోగేసి ఇస్తున్నాగా
వదిలేయకు సీతాకోక చిలకలుగా
వామ్మో బాగుందే చిట్కా నాకూ నేర్పిస్తే చక్కా
సూర్యుణ్ణే కరిగిస్తాగా చినుకులుగా
సూర్యుడు ఏడీ, నీతో ఆడి,
చందమామ అయిపోయాడుగా.....ఆ....ఆ... ॥తూనీగా॥
చ: ఆ కొంగలు ఎగిరి ఎగిరి సాయంత్రం గూటికి మళ్ళీ
తిరిగొచ్చే దారిని ఎప్పుడూ మరచిపోవెలా
ఓ సారటు వైపెళుతుంది మళ్ళీ ఇటు వైపొస్తుంది
ఈ రైలుకి సొంతూరేదో గురుతురాదెలా....
కూ కూ బండి మా ఊరుంది
ఉండిపోవె మాతో పాటుగా......ఆ.....ఆ.....ఆ... ॥తూనీగా॥

## కళ్ళు

సంగీతం : బాలు గానం : సీతారామశాస్త్రి

ప: తెల్లారింది లెగండోయ్ - కొక్కొరొక్కో!
మంచాలింక దిగండోయ్ - కొక్కొరొక్కో!
పాపులాంటి సీకటి పడగ దించిపోయింది!
బయంనేదు - బయంనేదు నిదర ముసుగు తీయండి
సావులాటి రాతిరి సూరు దాటిపోయింది
బయంనేదు బయంనేదు, సాపలు సుట్టేయండి
ముడుసుకున్న రెప్పలిరిసి పిట్ట సెట్టు ఇడిసింది
మూసుకున్న రెప్పలిరిసి సూపులెగరనీయండి!!॥తెల్లారింది॥
చ: సురుకు తగ్గిపోయింది, సెందురుడి కంటికి!
సులకనైపోయింది-లోకం సీకటికి
కునుకు వచ్చి తూగింది- సల్లబడ్డ దీపం
ఎనక రెచ్చిపోయింది-అల్లుకున్న పాపం
మనకబారి పోయిందా సూసే కన్ను!
ముసురుకోదా మైకం మన్నూ మిన్నూ!!
కాలం కట్టిన గంతలు తీసి కాంతుల ఎల్లువ గంతులు ఏసి
॥తెల్లారింది॥
చ: ఎక్కిరించు రేయిని సూసి, ఎర్రబడ్డ ఆకాశం
ఎక్కుబెట్టి ఇసిరిందా, సూరీడి సూపుల బాణం
కాలి, బూడిదైపోదా కమ్ముకున్న నీడ
ఊపిరితో నిలబడుతుందా సిక్కని పాపాల సీడ
సెవట బొట్టు సవురుగా సూరీణ్ణి ఎలిగిద్దాం!
ఎలుగు సెట్టు కొమ్మల్లో అగ్గిపూలు పూయిద్దాం!!
వేకువ శక్తుల కత్తులు దూసి,
రేతిరి మత్తును ముక్కలు సేసి ॥తెల్లారింది॥

మే 28 కోటి పుట్టిన రోజు సందర్భంగా...

# కోటి అనుభవాలూ మదిలో భావాలూ



పాప్ ఆల్బమ్ తరహాలోనే సినిమా పాటలు కూడా ఉంటే ప్రేక్షకుడు ఆ సినిమా ఆడియో ఆదరిస్తున్నాడు. ఆఖరకు టీవీ సీరియల్స్ పాటలకు కూడా బీట్ కావాల్సివస్తోంది.

ఎంతో కాంప్లికేటెడ్ రాగాలతో నేను చేసిన పాటలు కొన్ని ప్రేక్షకుల్ని ఆకట్టుకోలేకపోయాయి. అవి చివరకు మేం ఇష్టపడి చేసుకున్న పాటలుగానే తప్ప, ప్రేక్షకుల్ని ఇష్టపడేలా చేయలేకపోయిన పాటలుగా మిగిలిపోయాయి. ఇందిర మందిర సుందరకారా (గోవిందా గోవింద), వనమాలి వనమాలి (శ్రీమతి వెళ్ళొస్తా) ఆ కోవలోనివే.

నాకు రాగాల గురించి అంతగా తెలీదు. మా నాన్నగారు కూడా దగ్గర కూర్చోబెట్టుకుని ఇది ఈ రాగం అని ఏనాడు చెప్పలేదు. అయితే ఆయన మనసులోని ఆశీస్సులే నేడు మమ్మల్ని ఈ స్థాయికి చేర్చాయి.

ఇప్పటి వరకూ నేను సాధించింది ఏదీ లేదు. నాన్నగారి పేరు చెడగొట్టకుండా నెట్టుకుంటూ వస్తున్నాం. ఆయనకన్నా ఎక్కువగా సాధించేంత స్తోమతకాని, జ్ఞానం కానీ నాకు లేవు.

ప్రస్తుతం ప్రేక్షకులు ఎక్కువుగా బీట్‌ను ఇష్టపడుతున్నారు. ఇప్పుడున్న మోడ్రన్ ఎక్విప్‌మెంట్స్ ఉపయోగించుకుని ఎ.ఆర్.రెహమాన్, మణిశర్మ లాంటి సంగీత దర్శకులు శ్రోతలకు బాగా చేరువకాగలిగారు.



ఇప్పుడు ఉన్న హీరోలకు కూడా చక్కటి మ్యూజిక్ టేస్ట్ ఉండటం సంతోషకరమైన విషయం. 'హలో బ్రదర్' చిత్రంలో 'ప్రియరాగాలే' అనే మెలోడి పాటకు 'డీప్ ఫారెస్ట్' అనే సి.డి.లో ఉన్న కోరస్ ఎఫెక్ట్ ఉపయోగించుకుంటే బాగుంటుందని నాగార్జున సూచించారు.

నాన్నగారి(ఎస్.రాజేశ్వరరావు)పై ఓ డాక్యుమెంటరీ తీయాలని కోరిక. తప్పకుండా అది చేస్తాను. అలాగే నాన్నగారి పేరు మీద ఓ వెబ్‌సైట్ ప్రారంభించే యోచన కూడా ఉంది.

నాన్నగారు ఇచ్చిన స్వరాస్థలతో 'నువ్వేకావాలి' చిత్రంలోని 'ఎక్కడవున్నా' పాట చేసాను. గతంలో నాన్నగారు ఈ ట్యూన్‌ను 'లక్ష్మీనిలయం' అనే చిత్రంకోసం చేయటం జరిగింది. దురదృష్టవశాత్తు ఆ చిత్రం విడుదల కాలేదు. ఆ చిత్రంలో ఎం.కె.రాము గారు ఓ పాట రాశారు -"ముద్దులగుమ్మ మోజులు ఎన్నో తెచ్చింది, అన్నీ నీకే ఇస్తా తీసుకో" ఇది ఆ పాట పల్లవి. అప్పుడు గుర్తింపుకు నోచుకోని ఆ పాట పల్లవి టేక్ -ఆఫ్‌ను ఈ 'ఎక్కడవున్నా పక్కన నువ్వే' పాటకు ప్రారంభంగా తీసుకున్నాను.



ఒక్కోసారి ఇతర భాషలలోని స్వరాలను ఇన్స్పిరేషన్‌గా తీసుకోవటం జరుగుతూ ఉంటుంది. మనం తెలుగులో చేసిన మంచి ట్యూన్స్ ఇతర భాషల వారు కూడా ఉపయోగించుకుంటున్నారు.

నేను ఎక్కువగా ఇష్టపడేది మధ్యమావతి రాగాన్ని. నేను చేసిన ప్రతి చిత్రంలోనూ ఈ రాగంతో చేసిన పాట ఒక్కటైనా ఉంటుంది. మోహన, భీంప్లాస్, శంకరాభరణం రాగాలను కూడా ఎక్కువ ఇష్టపడతాను. అయితే భీంప్లాస్ రాగంతో నేను చేసినవి తక్కువ పాటలే అయినా అన్నీ నాన్నగారు గతంలో చేసిన పాటల ప్రమాణాలకు ఏ మాత్రం తగ్గకుండా చెయ్యగలిగాను.

ఇటీవల సింగీతం శ్రీనివాసరావుగారు ఓ మ్యూజిక్ ఆల్బమ్ చేసారు. పాటలన్నీ చాలా బాగున్నాయి.

శివరంజని వంటి పేతాస్ రాగంతో నేను చాలా ప్రయోగాలు చేసాను. ఈ రాగంతో ప్రయోగాలు చేయటానికి ఒక విధంగా ఇళయరాజా గారే నాకు ఇన్స్పిరేషన్. ఇంచుమించుగా నేను ఇ.వి.వి.తో చేసిన ప్రతి చిత్రంలోనూ ఈ రాగంతో ఓ పాట ఉంటుంది. గతంలో ఈ తరహా ప్రయోగాన్ని కోదండపాణిగారు చేసారు.



సంగీతం ఆత్మ తృప్తి అయితే, సాహిత్యం ఆలోచన. ఆలోచన లేని ఆత్మతృప్తి ఎక్కువకాలం నిలబడదు. 'ఎక్కడవున్నా' పాటలో ఈ రెండూ సమానంగా కుదిరాయి. ఇలాంటి మంచి పాటలు రావాలంటే దర్శక నిర్మాతలకు చక్కటి టేస్ట్ ఉండాలి.

'అమరశిల్పి జక్కన' లో నాన్నగారు 'బహుదారి' రాగంలో 'నిలువుమా నిలువుమా' అంటూ ఓ పాట చేసారు. నాకు తెలిసినంత వరకూ ఆ రాగంలో పాటను చేసింది నాన్నగారు ఒక్కరే కావచ్చు. ఆ రాగంలో నాకు కూడా ఓ పాట చేయాలని ఉంది.

## ప్రియా ఓ ప్రియా

రచన: భువనచంద్ర | గానం: బాలు, చిత్ర

ప/ఆ: హుల్లల హుల్లల హుల్లలా.........
కమ్మని కలలకు ఆహ్వానం చక్కని చెలిమికి శ్రీకారం
పలికిన పాటకి నా ప్రాణం అంకితం లన్నది నా హృదయం
హ్యాపీ న్యూ ఇయర్ ॥2॥ ॥కమ్మని॥
పులకించిన కాలపు ఒడిలో పురి విప్పినదో స్వర పుష్పం
చిరునవ్వుల వీణలు మీటి వినిపించినదో నవరాగం
హ్యాపీ న్యూ ఇయర్ ॥2॥ ॥కమ్మని॥
చ/అ: ఓ జాబిలి నా నెచ్చెలి విన్నానులే నీవన్న మాట
ఆ: నా కోసమే వస్తావనీ కట్టానులే ఓ కనుల తోట
అ: అణువణువు నిన్ను తడిమే చూపులకే ఎంత మహిమో
ఆ: అనుక్షణము నిన్ను పిలిచే పెదవులకే ఎంత సుఖమో
ఆ: ప్రియా ఓ ప్రియా
అ: ప్రియా ఓ ప్రియా
ఆ: మనసులో ఉన్నది ఓ మాట తెలుపనా కమ్మగ ఈ పూట
అ: ప్రియా ఓ ప్రియా
చ/ఆ: హుల్లల హుల్లల హుల్లలా.....
అ: హుల్లల హుల్లల హుల్లలా.....
ఆ: ఓ నేస్తమా....అ: ఓ నేస్తమా
ఆ: చిరుగాలితో....అ: చిరుగాలితో
ఆ: కబురంపిన....అ: కబురంపిన
ఆ: నేనాగలేక
అ: ఓ జానెమన్.....ఆ: ఓ జానెమన్
అ: మేడిన్ హెవెన్...ఆ: మేడిన్ హెవెన్
అ: రాసేయనా....ఆ: రాసేయనా
అ: ఓ ప్రేమలేఖ
ఆ: విరహమనే మంచుతెరలో చిక్కినది లేత పరువం
అ: కౌగిలిలో వెచ్చబడితే కరుగునులే కన్నె బిడియం
అ: ప్రియా ఓ ప్రియా... ఆ: ప్రియా ఓ ప్రియా
ఆ: మనసులో ఉన్నది ఓ మాట తెలుపనా కమ్మగ ఈ పూట
అ: ప్రియా ఓ ప్రియా
ఆ: పులకించిన కాలపు ఒడిలో పురివిప్పినదో స్వర పుష్పం
అ: ప్రియా ఓ ప్రియా

## చాలా బాగుంది

రచన: సీతారామశాస్త్రి | గానం: బాలు, సంగీత

ప/అ: దివి జాడవిడి ఇల జారిపడి
సురగంగకు అందిన వరము ఇది
శివుడే పతిగా జత చేరుకుని
కరుణించిన చల్లని తరుణమిది
కలుషాల తడి నిను తాకదని కలువమ్మను
కోవెల పిలిచినది
మనసున్న ఉలి శిల చాటు చెలి
మనువాడిన సుముహూర్తమ్ము ఇది
కళ్యాణి రాగాలు వినమన్నది...
కో: స సస గరిసస సనిదని ససస్గరిస॥2॥ ॥దివి॥
చ/అ: ఇది మంచి పని దీవించమని
పది మందిని పిలిచిన సందడిది
కథ కాదు అని ప్రజలందరికి అనిపించిన
పచ్చని సత్యమిది
ఆ: కళకళలాడే కాంతుల ఏరై పొంగిన పందిరిది...
వెన్నెల సంద్రమిది
అ: గుండెలలో గుడి గంటలుగా వినిపించిన
నవ్వుల మంత్రమిది
కనివిని ఎరుగని పరిణయమిది అని
చాటించు సన్నాయి సంబరమిది
కో: స సస గరిససనిదని ససస్గరిస ॥2॥ ॥దివి॥
చ/ఆ: తల దించుకుని నిదురించకని
ఎద తట్టిన పుస్తెల నేస్తమిది
అ: తడబాటుపడే పసి అడుగులకి నడకలు నేర్పినదీ సప్తపది
అలజడి చేసే అల్లరి గాలి మురళిని చేరినది
మృదువుగ పాడినది
ఆ: కల్లలయే కలలన్నిటిని కనుముంగిట కట్టిన కొంగుముడి
అ: మమతల కొలువుగ నిలిచిన మనిషికి
దేవతలే తలవంచు సమయమిది
కో: స సస గరిససనిదని ససస గ్గరిస ॥2॥ ॥దివి॥
ఆ: ఆ....
కో: గమపదపమపగ మపదపమదగమపద సాససస ॥గమ॥

## ఈశ్వర్ అల్లా

రచన: సీతారామశాస్త్రి | గానం: జేసుదాస్, చిత్ర

ప/ఆ: ఆ............
అ: చెంపలకు సిగ్గందం ఆ సిగ్గు నా సొంతం
అందుకోనా అందమా
ఆ: కన్నులకు కలలందం నా కలలు నీ కోసం
అల్లుకోనా బంధమా
అ: శృంగార తీరం చేరుకుందామా
ఆ: బంగారు భారం పంచుకుందామా
అ: లాలన కోరే లాహిరిలో...... ॥చెంపలకు॥
చ/అ: ఒంపుల వీణని ఇంపుగా మీటనీ
దుడుకుగా లాగనీ సంగతులన్నీ
ఆ: సొంపుల సొమ్ముని కాపాడుకొమ్మని
ఒడి చేరుకోనీ తహతహలన్నీ
అ: పొందితే నీ జంట కుందనపు బొమ్మ
ఆ: ధన్యమౌతుందంట మన్మధుడి జన్మ
అ: స్వాగతించా ప్రియతమా ॥చెంపలకు॥
చ/ఆ: వయ్యారి ఊహని తోడుగరమ్మని
తుంటరి ఆశని తెరవిడిరానీ
అ: వెయ్యేళ్ల హాయిని తీయగ సాగనీ
గుండెల్లో పొంగనీ అమృతవాహినీ
ఆ: ఊసులతో నా శ్వాస నిన్ను తాకింది
అ: ఊయల ఊపే భాష నేర్పమంటోంది
ఆ: పాపవై రా ప్రియతమా... ॥చెంపలకు॥

## హలో బ్రదర్

రచన: భువనచంద్ర గానం: బాలు

ఓ...ఓ...ఓ...ఓ...ఓ...

అ: ప్రియరాగాలే గుండెలోన పొంగుతున్న ఈ వేళ
ఆ: ప్రియగానాలే కన్నె ప్రేమ దోచుకున్న శుభవేళ
అ: చేరాలి సొగసుల తీరం
ఆ: సాగాలి తకధిమి తాళం
అ: తగ్గాలి తనువుల దూరం
ఆ: తీరాలి వయసుల తాపం ॥ప్రియరాగాలే॥
చ: అల్లరి కోయిల పాడిన పల్లవి
స్వరాలలో నీవుంటే పదాలలో నేనుంట
ఆ: వేకువ పూచిన తొలితొలి గీతిక
ప్రియా ప్రియా నీవైతే శ్రుతి లయ నేనౌతా
అ: కలకాలం కౌగిలై నినే చేరుకోనీ
ఆ: కనురెప్పల నీడలో కలే ఒదిగిపోని
అ: ఓ ప్రియా...... ఓ...... దరిచేరితే దాచుకోనా...
ఆ: తొలిప్రేమలే దోచుకోనా... ॥ప్రియరాగాలే॥
ఆ: సవ్వడి చేయని యవ్వన వీణలు
అలా అలా సవరించూ పదే పదే పలికించు
అ: వయసులు కోరిన వెన్నెల మధువులు
సఖిచెలీ అందించు సుఖాలలో తేలించు
ఆ: పెదవులతో కమ్మని కథే రాసుకోనా
అ: ఒడి చేరి వెచ్చగా చలే కాచుకోనా
ఆ: ఓ ప్రియా......ఓ...... పరువాలనే పంచుకోనీ...
అ: పడుచాటలే సాగిపోనీ.... ॥ప్రియరాగాలే॥

## నువ్వేకావాలి

రచన: సీతారామశాస్త్రి గానం: శ్రీరాం ప్రభు, గోపికా పూర్ణిమ

ప: ఎక్కడ ఉన్నా పక్కన నువ్వే ఉన్నట్టుంటోంది
చెలీ! ఇదేం అల్లరి
నా నీడైనా అచ్చం నీలా కనిపిస్తూ ఉంది
అరే ఇదేం గారడీ
నేను కూడా నువ్వయానా పేరుకైనా నేను లేనా
దీని పేరేనా ప్రేమ అనే ప్రియ భావన ॥ఎక్కడ॥
చ: నిద్దుర తుంచే మల్లెల గాలి - వద్దకు వచ్చి తానెవరంది
నువ్వే కదా చెప్ప ఆ పరిమళం
వెన్నెలకన్నా చల్లగ ఉన్న చిరునవ్వేదో తాకుతూ ఉంది
నీదే కాదా చెప్ప ఆ సంబరం
కనుల ఎదుట నువు లేకున్నా - మనసు నమ్మదే చెబుతున్నా
ఎవరు ఎవరితో ఏమన్నా - నన్ను పిలిచినట్టనుకున్నా
ఇది హాయో ఇది మాయో నీకైనా తెలుసునా
ఏమిటౌతోందో ఇలా నా ఎదమాటునా
దీని పేరేనా ప్రేమ అనే ప్రియభావనా ॥ఎక్కడ॥
చ: కొండలనుంచి కిందికి దూకేతుంటరి వాగు నాతో అంది
నువ్వూ అలా వస్తూ ఉంటావని
గుండెల నుంచి గుప్పున ఎగసేఊపిరి నీకో కబురంపింది
చెలీ నీకై చూస్తూ ఉంటానని
మనసు మునుపు ఎపుడూ ఇంత
ఉలికి ఉలికి పడలేదుకదా
మనకు తెలియనిది ఈ వింత ఎవరి చలవ ఈ గిలిగింత
నాలాగే నీక్కూడా అనిపిస్తూ ఉన్నదా
ఏమి చేస్తున్నా పరాకే అడుగడుగునా
దీని పేరేనా ప్రేమా అనే ప్రియభావనా ॥ఎక్కడ॥

## కన్యాదానం

రచన: సీతారామశాస్త్రి గానం: బాలు

ప: కళ్యాణం ఇది కనివిని ఎరుగని కళ్యాణం
శుభతరుణం గత చరితలు చూడని శుభతరుణం
అమృత హృదయమే వేదికగా అపురూపమైన వేడుకగా
ఏ మనసుకు ఏ మనసు సొంతమో తెలిసిన చల్లని స్నేహం
జరిపించే కన్యాదానం......
కో: జరిపించే కన్యాదానం (2) ॥కళ్యాణం॥
చ: తెలియని లిపిలో ఆ విధి రాసిన భాషకి భాష్యం కాగా
వివాహ బంధపు విలువను సరిగా వివరించిన శుభలేఖ
తరలిరండనే పిలుపే కాదు తెలుసుకోండనే హెచ్చరిక
మనువుకి అర్థం మళ్ళీ చెబుతా సత్యం చాటే పత్రిక
తనువు తలపు రెండూ మెడలో వాలే తాళి అని
ప్రకటించే కన్యాదానం....
కో: ప్రకటించే కన్యాదానం (2) ॥కళ్యాణం॥
చ: ఇద్దరి ప్రాణాలొకటిగ చేసే ప్రణయం పేరే పరిణయం
ఇద్దరి పాదాలొకటిగ సాగే పయనం పేరే పరిణయం
త్రివేణి సంగమమనిపించాలి
మూడుముళ్ళ ఈ సుముహూర్తం
అనేక జన్మలు నడిపించాలి ఏడడుగుల ఈ తొలి గమనం
ఈ పరమార్థం తెలియని పెద్దలు
జరిపిన వేడుక చెల్లదని
ప్రళయనాదమే వేదమంత్రమై మనిషి రూపులో ఈ బ్రహ్మ
జరిపించిన కన్యాదానం
కో: జరిపించిన కన్యాదానం (2) ॥కళ్యాణం॥

## గిల్లికజ్జాలు

రచన: సీతారామశాస్త్రి గానం: బాలు, చిత్ర

సససా రిరిరిరి గగగగ పపపప గగగగ సససస ఆ......
ప/అ: చిన్నారి కిట్టయ్య పుట్టి ఘల్లున గజ్జలు కట్టి
ఇల్లంతా పారాడు సమయం అదిగదిగో
అల్లారు ముద్దుల పట్టి తాతయ్య మీసాలు పట్టి
తారంగమాడేటి తరుణం ఇదిగిదిగో
కనులు తెరిచి కలలు కనెను ప్రతి హృదయం ఇదిగిదుగో
ఆ కలలు నిజమై ఎదుట నిలిచే ఉదయమెప్పుడు ॥చిన్నారి॥
చ/అ: కలువలమే కన్నులకి చంద్రకిరణమవమా
మన వంశమునే వెలిగించే సూర్యబింబమువమా ఆ......
ఆ: ఎత్తుకునే చేతులలో చంటిపాపవైనా
గిరినెత్తుకునే చేతలలో కృష్ణమూర్తికారా
అ: పిల్లనగ్రోవిని అల్లన ఊదుతు నల్లనయ్య రారా
నీ అల్లరితో ఆ రేపల్లెను మా ఇంట చూడనీరా ॥చిన్నారి॥
చ/ఆ: ఇక్కడని అక్కడని వెతుకుతున్న వేళ
ఏ ఒక్కరికీ చిక్కననీ వెక్కిరించి పోడా ఆ........
అ: లేడు అనీ రాడు అనీ మాయ చేయకమ్మా
గోవిందుడిని తొందరగా అప్పగించవమ్మా
ఆ: తొమ్మిది నెలలను గమ్మున పదమని వెంట తరమలేవా
ఈ బొమ్మల కొలువున సందడి లేదని వాణ్ణి
పిలువలేవా ॥చిన్నారి॥




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం చేసిన
రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావికొండలరావు**

రాసిన వ్యాసమిది



# షూటింగ్‌లో టింగ్ టింగ్

**(షూటింగ్ అంటే సినిమా షూటింగ్, టింగ్‌టింగ్ అంటే - ఇక్కడి అర్థం తమాషాలు, సరదాలు, కబుర్లు మొదలైనవన్నమాట.)**

సినిమాల్లో అవుడ్డోర్ అనీ ఇన్‌డోర్ అనీ రెండు వుంటాయి. ఆ రోజుల్లో స్టూడియోలో, ఫ్లోర్‌లో షూట్ చేస్తే - ఇన్‌డోర్. బయట ఎక్కడ తీసినా అవుడ్డోరే. ఆ లెక్కలో చూస్తే ఇవాళ అన్నీ అవుడ్డోర్లే. స్టూడియో ఫ్లోర్‌లో తక్కువ. అలాంటిదే ఒక అవుడ్డోర్ మద్రాసులో - ఒకరింట్లో. ఆ ఇల్లు ఊరికి చివర. షూటింగ్ ఏమిటంటే - ఆ (ఇంటి) ఇల్లాలు మరణించటం, ఆమెను పాడెమీద కట్టి తీసుకువెళ్ళడం, తక్కిన పాత్రలన్నీ భోరున ఏడవడం - వగైరా. ఉదయం షూటింగ్. షూటింగ్‌కి కావలసిన సరంజామా ఏడో గంటకి ఆ యింటి దగ్గర జేరవేయాలన్నారు. అందుకని, ఆర్ట్ డిపార్ట్‌మెంట్‌వాళ్ళు వెదుళ్ళతో కట్టిన పాడె, పాడెముందు తీసుకెళ్ళే "నిప్పుఉట్టి" సిద్ధంచేసి ఆ ఇంటి దగ్గరికి వాన్‌లో తీసుకొచ్చారు. అది పెద్ద ఇల్లు. కాంపౌండు, పెద్దగేటు వున్నాయి. లోపట ఇంటివాళ్ళున్నారు. గేట్ దగ్గర వాచ్‌మన్ కూడా వుంటాడు. ఇక ఆర్ట్ డిపార్ట్‌మెంట్ వాళ్ళు వచ్చి, గేటు కొట్టి, పిలిచి అలసిపోయారు. ఇంట్లోవాళ్ళు ఇంకా లేవలేదు. వాచ్‌మన్ ఎక్కడికో పోయినట్టున్నాడు. ఇక లాభంలేదని, ఆ పాడెనీ, నిప్పుకుండనీ గేటు దగ్గర పెట్టేసి, ఇంకేవో సామాన్లు తీసుకురావటానికి ఆ సెట్టు అసిస్టెంట్స్ - వచ్చిన వాళ్ళతో వెళ్ళిపోయారు. ఏడున్నర ప్రాంతాలలో ఆ ఇంటికి ఎదురుగా వున్నవాళ్ళు ఒక్కొక్కళ్ళే నిద్ర లేస్తున్నారు. ఒక భర్త, నెమ్మదిగా తన భార్యని గుమ్మంలోకి తీసుకువచ్చి ఎదురుగేటు చూపించాడు. ఆమె దిగ్గుమంది. ఆ భర్త కూడా ప్రశ్నార్థకంగా ఆమె వైపు చూశాడు. అలాగే ఇంకో ఇంటి వాళ్ళూ గుమ్మంలోకొచ్చి కంగారు పడ్డారు. వీళ్ళందరికీ గేటు పక్కనే ఉన్న పాడె, కుండ కనిపించాయి! అదంతా సినిమా షూటింగ్ సరంజామా అని వాళ్ళకి తెలీదు.

"పాపం! నిన్నటిదాకా ఆయన నిక్షేపంగానే వున్నాడు. రాత్రికి రాత్రి ఏమైందో పాపం!"

"అది కాదే - ఆ ముసలావిడ, ఇంటి ఆవిడ తల్లి కాబోలు, ఆవిడకు చాలాకాలంగా సుస్తీటగా. ఆవిడ పోయిందేమో!"

"ఆవిడ పోవడం ఏమిటండీ -నిన్న సాయంకాలం కూడా నాతో మాట్లాడితేనూ"

పొద్దున్నే వాళ్ళయింటికి పాలు తీసుకొచ్చిన పాలవాడు కూడా కంగు తిన్నాడు. ఇలాంటి సమయంలో పాలు ఇవ్వడమా - మానడమా అని ఆలోచించి, వెళ్ళిపోయాడు. పక్క ఇళ్ళవాళ్ళు ఇక ఆగలేకపోయారు. ఎదురింటి వారి చుట్టాల్లో తమకు స్నేహితులైన వాళ్ళింటికి ఫోన్ చేసి అడిగారు -ఈ విషయం చెప్పారు. మరి కాస్సేపటికి, పక్కయింటివాళ్ళూ ఎదురింటి వాళ్ళూ పరామర్శకి బయల్దేరారు. వాచ్‌మన్ గేటు తీసాడు. "ఏమైంది?" అని అడిగారు నెమ్మదిగా. అతను ఇంకా నెమ్మదిగా "ఏంలేదే" అన్నాడు. అందరూ దిగాలు పడుతూ, లోపలకు వెళ్ళారు. "' రండి రండి - ఏమిటి పొద్దున్నే వచ్చారు - ఎంత అదృష్టం ! రండి కూర్చోండి " అంది ఇల్లాలు. వీళ్ళు ముఖాలు చూసుకున్నారు. ఎక్కడా విచారాలు లేవు. శవం వున్న సాక్ష్యమూ లేదు! మరి ?...ఆ పాడె...నిప్పుకుండ...?..

ఉండబట్టలేక అడిగారు - ఆ పాడె అవీ ఏమిటనీ. "అదా ! సినిమా షూటింగ్ మా ఇంట చేస్తామన్నారు. అయితే, అలాంటి సీను వుందని మాకు చెప్పలేదే " అన్నాడు ఇంటాయన.

మొత్తానికి టీ కప్పులో తుపాను చల్లారిపోయింది. ఎదురింటి,






ఓ ఆంగ్ల వనిత ఓ మారుమూల తెలుగు నగరానికి వచ్చి ఎంతో సంఘసేవ చేసి అక్కడి వాళ్ళ అభిమానాన్ని పొందింది. ఆవిడ వెళ్ళిపోయే ముందు ఆ ఊరి వాళ్లు గొప్ప సన్మానం చేశారు. ఆ సభలో ఆమె ఉపకారబుద్ధిని వేనోళ్ళ పొగుడుతూ అధ్యక్షత వహించిన మంత్రిగారు ఆఖర్న ఇలా అన్నారు:

'వేరే చెప్పేదేముంది, ఆమెను 'ఉమెన్ ఆఫ్ ది టౌన్' అనొచ్చు". వెంటనే ఎంతో అవమాన భారంతో ఆమె సభని విడిచి వెళ్ళిపోయింది. ఆ మాటకి అర్థం వేశ్య అని! ఏం చేస్తాం... మంత్రిగారి ఇంగ్లీషు అంతంత మాత్రమే!

పక్కింటివాళ్ళు 'అమ్మయ్య' అనుకున్నారు. గేటుగలవాళ్లు గేటు దగ్గరకు రాగా, సినిమాకు సంబంధించిన వాళ్లు ఒక్కొక్కరూ కార్లు దిగుతున్నారు. అపార్థాలు కల్పించినందుకు, ఆ చర్యకూ ప్రొడక్షన్ వాళ్ళు మీద మండిపడ్డారు. ''పొరపాటయిపోయింది. ఇప్పటికిప్పుడు ఇంకో ఇంటికి వెళ్ళలేం - క్షమించండి, ఎక్స్యూజ్, మన్నిచ్చుడుంగో'' లాంటి మాటలన్నీ వాడి, షూటింగ్ అవుననిపించుకున్నారు!

**(ఈ సంఘటన 1976 ప్రాంతాలలో జరిగింది. ఆ సినిమాలో నేనూ ఉన్నాను. తక్కిన వివరాలు గుర్తులేవు)**



xxx

అల్లు రామలింగయ్య గారితో అవుడ్డోరు. రామానాయుడు గారు 'పాపకోసం' సినిమా తీసారు. అందులో అల్లువారు, నేనూ బ్రాహ్మణ పాత్ర ధారులం. మద్రాసుకు దూరంగా అవుడ్డోర్ పెట్టారు. మంచి ఎండ. ఒంటి గంటలోపలే షూటింగ్ బ్రేక్ చేసి, భోజనాలు పెట్టారు. రామలింగయ్య గారికి భోజనం చేసిన తర్వాత ఓ అరగంట పాటైనా విశ్రమించే అలవాటుంది. అంచేత ఆయన ఎక్కడికి వెళ్ళినా ఒక చిన్న దిండు కూడా తనతో తెచ్చుకుంటారు. "నాకు మళ్ళీ షాటు ఎప్పుడు? టైముంటుందా?" అని అసిస్టెంట్‌ని అడిగారు. అతను ఆలోచించి, " ఉంది, మీరు రెస్ట్ తీసుకోండి" అన్నాడు. అన్నదే తడవుగా అల్లువారు, సదరు దిండు వగైరాలు తీసుకుని, నిద్రాభంగం కలగకుండా షూటింగ్ స్పాట్‌కి దూరంగా వెళ్ళిపోయి, మంచి నీడ ఇస్తున్న చెట్టు చూసుకుని , దిండు పెట్టుకుని సుఖనిద్రలోకి జారుకున్నారు. షూటింగ్ నాలుగ్గంటలకల్లా ఐపోయింది. "పాకప్" అన్నారు. అనడమేమిటి - అందరూ ఎవరికి దొరికిన కార్లో వాళ్ళు ఎక్కి బయల్దేరిపోయారు. మధ్యాన్నం తర్వాత రామలింగయ్య గారికి షాట్ రాలేదు గనక, ఆయన హాయిగా నిద్రపోయారు. షూటింగ్ పాకప్ హడావుడిలో ఎవరికీ ఆయన సంగతి గుర్తులేదు - ఆయన దూరంగా వెళ్ళి పడుకోడం చేత. నిదానంగా రామలింగయ్య గారు నిద్రలేచి, అటూ ఇటూ చూశారు. షూటింగ్ అలికిడేం కనిపించలేదు. నిశ్శబ్దంగా వుంది. 'లొకేషన్ మార్చారులా వుంది '' అనుకున్నారు. పక్కనే కాలువ గట్టున బట్టలుతుకుతున్న ఓ అబ్బాయిని అడిగారు - " షూటింగ్ సంగతి తెలుసా ?'' అని. అందరూ వెళ్ళిపోయారన్నాడు. అల్లువారి ఒళ్ళు జల్లుమంది. గుండె కలుక్కుమంది....

ప్రొడక్షన్ కార్లు ఆఫీసుకి చేరాయి. "రామలింగయ్య గార్ని ఏ కారులో దింపారు?'' అని వాళ్ళలో వాళ్ళు తర్జనభర్జన చేసుకుని, నాలికలు కొరుక్కుని, అయ్యయ్యో అనుకుని కారు మీద పరుగెత్తారు.

సరిగ్గా లొకేషన్ దగ్గరగా కారు చేరుకునే ముందు ఓ బస్టాండ్ ఉంది. అక్కడ పిలక, నుదిటిమీద విభూతి రేఖలతో, ఒంటి మీద చొక్కా లేకుండా, చంకలో దిండుతో ఒకాయన నించుని వున్నాడు. చూశారు - రామలింగయ్య గారు ! " సార్...సారీ సర్...రండి " అని కొరెక్కించారు. "నేనూ సారీ చెప్పాలి. ఎక్కడ పడుకున్నానో మీతో చెప్పాలిగా'' అన్నారాయన. మొత్తానికి ఆ కథ అలా కంచికి వెళ్ళింది.

అటు తర్వాత, ఇంకో షూటింగ్‌లో రామలింగయ్యగారు నా పక్కనే వుండగా, ఈ కథంతా తక్కిన వాళ్ళతో చెప్పి -"రామలింగయ్యగారూ ! జ్ఞాపకం వుందా ? ఇలా ఎక్కడ జరిగిందో ?'' అని అడిగాను.

'ఏ షూటింగ్‌లో జరిగిందంటే ఎలా చెప్పనూ? ఇలాంటివి చాలాసార్లు జరిగాయి - అన్నారు అల్లు రామలింగయ్య తెలిగ్గా నవ్వేస్తూ.




'ఏ తెలుగు వాక్యాన్నయినా ఉన్నదున్నట్టు ఇంగ్లీషులోకి అనువాదం చెయ్యడంలో నన్ను మించినవాడు లేడు!' అని చెప్పుకొనే ఓ తర్జుమా 'సర్దార్‌జీ' దగ్గరకి ఓ వాక్యం తెచ్చారు.

"నాన్నేమో తన కూతురికి పెళ్ళి చేద్దామనుకుంటున్నాడు కాని ముందు కొడుక్కే పెళ్ళి చేద్దామంటోంది అమ్మ'' ఆయన తక్షణం ఇలా అను'వధించి' అందించాడు.

ద ఫాదర్ వాన్టెడ్ టు మ్యారి హిజ్ డాటర్. బట్ ద మదర్ వాన్టెడ్ టు మ్యారి హర్ సన్ ఫస్ట్. (దీనికర్థం ఎలా వస్తోందో పాఠకులు ఈపాటికి గ్రహించే ఉంటారు)



సీరియల్ 8



-మల్లాది వెంకట కృష్ణమూర్తి

## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజు కట్ చేసిన ఫోటో భాగాల వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. జాంబవతికి పాముల్ని పెంచే అలవాటు ఉండడం వలన ఆమెకు వచ్చిన పెళ్ళి సంబంధాలన్నీ తప్పి పోతూ ఉంటాయి. అలా బామ్మ తరపు బంధువులలో అనన్య తప్ప వేరే వారసులెవరూ లేక పోవటం జరుగుతూ ఉంటుంది. ఈ కథ అంతా బామ్మ చెబుతూవుండగా వచ్చిన లింగ మయ్యను చూడగానే బామ్మ అనారోగ్యం నటిస్తుంది. అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్పకుండా దాట వేస్తుందామె. అనన్యకి లవ్‌లెటర్ రాయడం కోసం జి.గురుప్రసాద్ అనే జర్నలిస్ట్ సహాయాన్ని కోరుతాడు నిరుపమ్. అతనిచ్చిన ఏ లెటరూ నచ్చకపోవటంతో గుణింతాలతో పజిల్‌లా ఉండే ఓ తెలివైన లెటర్‌ని తయారుచేస్తాడు నిరుపమ్.



"ఆహా! ఓహో! ఈ భూప్రపంచం మొత్తం మీద తమరి లాంటి సాధనం మరొకటి లేదంటే నమ్మండి. అందరి నోళ్ళు మూయించి, కళ్ళు తెరిపించి, చెవులప్పగించి, కదలకుండా కూర్చోపెట్టగలిగే కెపాసిటీ తమరికి కాక మరెవరి కుంటుందండి?"

టి.వి.ముందు కూర్చుని మాట్లాడుతున్న భర్త వెంకటరత్నానికి కాఫీ గ్లాసు అందించి వెళ్ళింది అతని భార్య జయశ్రీ. దాన్ని యధాలాపంగా అందుకుని కాఫీ తాగుతూ మళ్ళీ టి.వి.ని పొగడసాగాడు వెంకటరత్నం.

"లోకంలో ఎన్ని రంగులుంటే, అన్ని రంగులూ తమరిలోనే. సినిమాలేనా, న్యూసేనా, డ్రామా సీరియల్సేనా, ఔత్సాహిక మిమిక్రీయిస్ట్‌లనించి, మినిష్టర్లదాకా అంతా తమరి ద్వారానే కదండి మాకు దర్శనం అవుత. ఇంటిల్లిపాదినీ ఓ గదిలో కట్టిపడేసేది తమరి శక్తే కదండి".

ఏ వస్తువునైనా పొగడకుండా ఉండలేకపోవడం తన అన్న తత్వం అని తెలిసిన నిరుపమ్ అరగంట నించి వస్తున్న వెంకటరత్నం వాక్ప్రవాహానికి ఇక నిద్ర పట్టదని మంచం మీంచి లేచి కూర్చున్నాడు.

"మీ ముందు ఫ్రిజ్, ఫాన్, న్యూస్‌పేపర్, అన్నీ బలాదూరే. అక్కడేదో జరిగితే పావుగంటలో స్క్రీన్ కింద కదులుతూ, ఇది ఇక్కడ ఇలా జరిగింది అని చెప్పేది తమరే కదండి? మనిషికి ఒంటరితనం అనేదే లేకుండా చేయగలిగేది ఒక్క మీరే కదండి"

"ఇంక చాలన్నాయ్", విసుక్కున్నాడు పళ్ళు బ్రషింగ్ చేసుకుని వచ్చిన నిరుపమ్.

"నిన్న బ్యాంక్ నించి ఐదు వందలకి కొత్త పదిరూపాయల నోట్లు తెమ్మన్నాను. తెచ్చావా?" ప్రశ్నించాడు వెంకటరత్నం, తమ్ముణ్ణి.

"తెచ్చానన్నయ్యా. వదినకిచ్చాను."చెప్పాడు.

"ఏవీ అవి?" అడిగాడు భార్యని.

"ఏం? వాటినీ పొగడటానికా? మీరు బజారుకెళ్ళినప్పుడు తీసుకుందురుగాని...ఈ వెధవ టి.వి.లు వచ్చి పడ్డాక పనులేం తెమలడం లేదు. ఉదయం ఈ బాలచందర్ కథాంజలి ఒకటి, వంట పనులు చేసుకోకుండా అడ్డుగా. నన్నడిగితే టి.వి.లని బ్యాన్ చేయాలి" చెప్పింది జయశ్రీ.

"ప్చ్.. ఏమిటా మాటలు. టి.వి.వింటుందే" చెప్పాడు వెంకటరత్నం.

"విననీండి. ఉన్నమాటే కదా. ఉదయం వంటకీ అడ్డు. రాత్రి నిద్రకీ అడ్డే. సోనీ లో వచ్చే ఆ హారర్ షో 'ఆహట్' చూడకుండా నిద్ర పోలేము కదా. పాడు టి.వి. ఇది లేని రోజుల్లో ఎంచక్కా....."

"టి.వి.నేం అనొద్దన్నానా? అయినా నీకు మంచిలో కూడా చెడు మాత్రమే చూడడం అలవాటై పోయిందే" విసుక్కున్నాడు వెంకటరత్నం బాధగా.

"మరేం ఫరవాలేదు. దాన్ని నిందాస్తుతి అంటారులే అన్నయ్యా" చెప్పాడు నిరుపమ్ నవ్వుతూ.

"రాత్రి తమరెందుకో లేటుగా వచ్చినట్టున్నారు?" అడిగాడు వెంకటరత్నం, నిరుపమ్‌ని.

"అవును, కొద్దిగా లేటయింది" అన్నాడు నిరుపమ్.

"తెల్లారురుఝాముున రెండున్నర దాటింది నిరు వచ్చేసరికి" అందించింది జయశ్రీ.

"అది కొద్దిగా లేటు. బాగా లేటంటే ఇప్పుడు వచ్చివుండేవాడివేమో? నీ దగ్గర ఏదో వాసన కూడా వచ్చినట్లుంది?" అడిగాడు వెంకటరత్నం.

"నాకేం రాలేదే?" నిరుపమ్‌కి ఏం మాట్లాడాలో తెలీక అలా మాట్లాడేసాడు.

"తాగిన వాళ్ళకి ఆ వాసన తెలీదు. పక్కవాళ్ళకే తెలుస్తుంది" చెప్పింది జయశ్రీ.

"ఏమిటి? తాగావా? ఇంకేమైనా ఉందా? లివర్ కేన్సర్, ఆల్కహాల్ తీసుకునే వాళ్ళలో అరవైఎనిమిది శాతానికి వస్తుందిట. కాస్తంత ఖబడ్దార్‌గా ఉండడం నేర్చుకో" కోపంగా చెప్పాడు వెంకటరత్నం.

"అలాగే అన్నయ్యా"

"గుర్తుంచుకో. ఈ లోకంలో పొగడ్డానికి పనికిరాని వస్తువులు రెండు. ఒకటి సిగరెట్, రెండు ఆల్కహాల్".

"అలాగే అన్నయ్యా".

డోర్ బెల్ మ్రోగింది. మరికొద్ది క్షణాల్లో లింగమయ్య లోపలకి వచ్చాడు. "రా లింగమయ్య! ఏమిటి విశేషాలు?" అలాంటిదేదో వుంటేకాని తమింటికి ఆయన రాడని తెలిసిన వెంకటరత్నం ఆయన్ని ఆహ్వానిస్తూ అడిగాడు.

"విశేషాలు సశేషాలేనోయ్. కిందటి వారం బామ్మగారింటికి వెళ్ళొచ్చాను. దిబ్బసకుక్కలా ఆరోగ్యంగా వుంటోందావిడమధ్య"

"అరె పాపం!"

"కొందరు అంతే. ఎప్పుడూ ఏదో రోగం. కానీ నూరేళ్ళాయుష్షు.

కొందరు ఆరోగ్యంగా తింటూ, తిరుగుతూ ఓ శుభోదయం పక్కలోంచి లేవరు... ఎల్లుండి మానాన్నగారి ఆబ్దీకం. మా ఇంటికి భోజనానికి అంతా రావాలి. చెప్పి పోదామని వచ్చాను".

"అలాగే, పెదనాన్న పోయి రెండేళ్ళు అయినట్లుగా లేదసలు"

"చెప్పాగా. రోగం అనేదే ఎరగడు. తింటూ తిరిగేవాడు. ఓ శుభోదయాన మంచం మీంచి లేవలేదు".

జయశ్రీ లింగమయ్యకి కూడా కాఫీ తెచ్చిచ్చింది.

నిరుపమ్ బాత్ రూంలోకి వెళ్ళాడు వాళ్ళేదో ఆస్తి వ్యవహారాలు మాట్లాడుకుంటుంటే.

-----

నిరుపమ్‌కి గతరాత్రి జరిగింది సరిగ్గా గుర్తులేదు. బేంక్‌కి వచ్చాక గత రాత్రి తను రాసిన మాథమేటికల్ ప్రేమలేఖని చాలా యధాలాపంగా టిఫిన్ బాక్స్, కర్చీఫ్‌లతోపాటు తన ఆఫీసుడ్రాయర్‌లో పడేసాడు. అది ఓ స్టాఫ్ సర్కిలర్ ఫైల్‌లోని ఆఫీసుకాగితాల్లో కలిసి, ఆ బ్రాంచ్‌లో పనిచేసే పదకొండు మంది స్టాఫ్ దగ్గరకి వెళ్ళింది. చాలా ఆఫీసుల్లో చాలామందిలా ఆ



ఆఫీస్‌లోని కొందరు దాన్ని చదవకుండానే మిగతా సర్క్యులర్ కాగితాలతోపాటు దాన్నీ చదివినట్లుగా ఇనీషియల్ వేసారు. బ్రాంచ్ మేనేజర్ దాన్ని 'లోన్స్ టు ప్రయారిటి సెక్టార్ ఫైల్‌లో ఫైల్ చేయమని' నోట్ చేసింది. చీఫ్ కేషియర్ దానిమీద, ఆ సబ్జెక్ట్ మీద పాత సర్క్యులర్‌తో లింక్‌చేసి పంపమని రాసాడు. బోనస్, జీతాలపెరుగుదల, ఏన్యువల్ హాలిడేస్ లిస్ట్ లాంటి, ఫెస్టివల్ అడ్వాన్స్ పెరుగుదల లాంటి కొన్ని సర్క్యులర్సే ఆసక్తిగా చదువుతారు ఆ బ్రాంచ్ స్టాఫ్ అంతా.

అయితే అది ఎవరికి రాయబడిందో ఆ అనన్య మాత్రం తన టేబుల్ మీదకి వచ్చే ప్రతీ కాగితాన్ని శ్రద్ధగా చదువుతుంది. అలాగే దాన్నీ చదివింది. కొద్దిగా ఆశ్చర్యపోయింది. కొద్దిగా నవ్వుకుంది. తర్వాత కొద్దిగా ఆలోచించి దాని మీద ఏదో రాసింది.

ఆ ఫైల్ తన టేబుల్ మీదకి రాగానే నిరుపమ్ ఇందాకటిలా యధాలాపంగా దాన్ని తెరచి సర్క్యులర్స్ మీద సంతకాలు చేస్తూంటే, ఆ కాగితంలోని తన చేతిరాతని గుర్తుపట్టి చదివాడు. చదవగానే గత రాత్రి బీర్ తననా ప్రేమలేఖని రాయించడం గుర్తుకొచ్చింది. మిగతా వాళ్ళంతా రాసింది చూసాక చివరలో అనన్య రాసింది చదివాడు.

'మనం 142857లా జీవించాలన్న మీ తపన అర్థం చేసుకున్నాను. మన జీవితాలు ఇంకోలా కూడా అవచ్చుగా? దాన్ని 7 చేత హెచ్చవేసి చూడండి' కింద అనన్య ఇనీషియల్ వుంది.

కేలిక్యులేటర్ మీద 142857 ని 7 తో హెచ్చవేసాడు. జవాబుగా ఆరంకెల సంఖ్య వచ్చినా దాన్లో 142857 లు, 1 నించి 6 తో హెచ్చవేస్తే వచ్చినట్లుగా పక్కపక్కన రాలేదు. అసలు 142857 లలో ఒక్క అంకె కూడా లేదా సంఖ్యలో.జవాబుగా 999 999 వచ్చింది. అది అంగీకారమో, తిరస్కారమో లేక ఉదాసీనతో అర్థంకాలేదతనికి.

ఆ కాగితం ఫైల్‌లోంచి తీసి ముక్కలు చేసి డస్ట్‌బిన్‌లో పడేసాడు.

అతనికి ఎంతో దిగులేసింది. ఇదేమిటి? ధైర్యం చేయక చేయక, రాయక రాయక రాసిన మొదటి ప్రేమలేఖ మిస్‌ఫైర్ అయిందే అని అతనా మూడ్‌లో వుండగానే తన వ్యాపారానికి లోన్ కోసం అప్లై చేసిన ఓ వ్యాపారస్తుడు వచ్చాడు.

అతని ఫైల్‌ని తెప్పించి దాన్ని తెరచి వ్యాపారానికి అయే పెట్టుబడి వివరాలు స్పెసిఫిక్ డిటైల్స్ చదివి అడిగాడు.

"ఏమిటి? షాపు సైన్‌బోర్డుకి పదివేలవుతుందా? ఎందుకు?"

"తాజా చేపలు ఇక్కడ అమ్మబడును"అన్న అక్షరాలు వెలిగే ఎలక్ట్రిక్ డిస్‌ప్లే బోర్డుని నా షాపున్న బిల్డింగ్ పైన తగిలించడానికి, దాన్ని సప్లైచేసే అతను ఇచ్చిన కొటేషన్ జిరాక్స్ కాపీ కూడా జతచేసాను చూడండి'' చెప్పాడు ఆ వ్యాపారస్తుడు.

దాన్ని చదివాడు నిరుపమ్.

''ఒక్కో అక్షరానికి అయిదు వందలవుతుందన్న మాట"

"అవునండి. పదమూడు అక్షరాలకి, అయిదు వందల చొప్పు ఆరు వేల అయిదువందలు. మిగిలింది ఎలక్ట్రిక్ సర్క్యూట్‌లకి" చెప్పాడతను.

నిరుపమ్ చిరాగ్గా అడిగాడు.

"మీరు అమ్మేవి తాజా చేపలేనా? పాతవి కూడానా?"

"తాజావే. తాజావి కాకపోతే ఎవరూ ఫిష్‌ని కొనరు"

"ఆ సంగతి చేపలు తినే వాళ్ళందరికీ తెలుసు కదా?" ప్రశ్నించాడు.

"తెలుసు"

"అలాంటప్పుడు 'తాజా' అని ప్రత్యేకంగా చెప్పడం దేనికి? ఆ రెండు అక్షరాలు తీసేస్తే వెయ్యి రూపాయలు ఆదా అవుతాయి కదా"

"నిజమేనండి. దాన్ని తీసేద్దాం. 'చేపలు ఇక్కడ అమ్మబడును' అని ఉంచుదాం'' వప్పుకున్నాడతను.

మరికొద్ది క్షణాలు ఆలోచించి అడిగాడు నిరుపమ్.

"మీరు చేపలు ఆ షాపులోనే అమ్ముతారా? లేక ఇంకెక్కడైనానా?"

"ఆ షాపులోనేనండి"

"మీది చేపల దుకాణమే అని కొనే వాళ్ళకి తెలిసినప్పుడు మళ్ళీ ప్రత్యేకంగా 'ఇక్కడ' అని చెప్పడం దేనికి? వేస్టేకదా? పదిహేను వందలు సేవ్ అవుతాయి".

"అలాగేనండి. 'ఇక్కడ' కూడా తీసేద్దాం. 'చేపలు అమ్మబడును' అని రాయిద్దాం'' వప్పుకున్నాడతను కొద్దిగా అయిష్టంగానే.

మరికొద్ది సేపు ఆలోచించి అడిగాడు నిరుపమ్.

"మీరు ఫిష్‌ని అమ్ముతారా లేక ఉచితంగా కూడా ఇస్తూంటారా?"

అడిగాడు.

"ఉచితంగా ఎలా ఇస్తానండి? అమ్ముతాను" చెప్పాడు.

''కొనుగోలు దార్లకి మీరు చేపలు అమ్ముతారని, ఉచితంగా ఇవ్వరని ఖచ్చితంగా తెలుసు కదా?"

"అవునండి వాళ్ళకిది ఖచ్చితంగా తెలుసండి. ఎందుకలా అడిగారు?"

"అమ్మబడును అని వాళ్ళకి తెలిసిన సమాచారమే మళ్ళీ ఎందుకు డబ్బు వృధాచేసి ప్రకటనచేయడం? ఆ అయిదు అక్షరాలని కూడా తీసేస్తే అయిదు అయిదు వందలు..." అని ఆగి కేలుక్యులేటర్‌లో ఆ లెక్కచేసి పూర్తి చేసాడు నిరుపమ్"...

రెండువేల అయిదు వందలు ఆదాకదా"

''అంతేనంటారా?'' కొద్దిగా ఏడుపు మొహంతో అడిగాడు ఆ వ్యాపారస్తుడు.

"నన్నడుగుతారేం? మీరు చెప్పండి. అవునా



కాదా?" గద్దించాడు.

"మీరు అవునంటే అవునండి, కాదంటే కాదండి"

"సో. అమ్మబడును కూడా వద్దు" అని ఆగి నిరుపమ్ మిగిలిన చేపలు అన్న అక్షరాలవంక చూసాడు. అతనికి ఆ స్థానంలో మూడయిదులు పదిహేను వందలు కనిపించాయి.

"మీ దుకాణంలో చేపలుకాక ఇంకా ఏమేం అమ్ముతారు? టి.వి. లు కాని, బట్టలు కాని ఇంకేమైనా అమ్ముతారా?'

"ఒక్క చేపలేనండి. ఇంకేం అమ్మమండి".

"కదా? ఆ సంగతి మీ దుకాణంలోకి వచ్చే ప్రతీ కస్టమర్‌కి తెలిసే వస్తాడు కదా. ఇంక ఈ చేపలు అన్న ప్రకటన ఎందుకు?"

"మొదటిసారి వచ్చే కస్టమర్స్ కోసం" నసిగాడు ఆ వ్యాపారస్తుడు.

"వాళ్ళకీ ప్రకటన అనవసరం. చేపల దుకాణం ఎక్కడుందో ఫర్లాంగు దూరంనించే వాసననిబట్టి తెలుసుకోగలరు. దీన్నీ తీసేద్దాం. ఏమంటారు?"

ఏడుపు ఒకటే తక్కువ మొహంలో! మౌనంగా చూసాడతను.

"కాబట్టి ఈ బోర్డ్‌కోసం మీరు కోరే పదివేలు తీసేద్దాం ఏం?" అని ఆ అమౌంట్‌ని రౌండప్ చేసేసాడు నిరుపమ్. తర్వాతి వివరం అయిన 'అమ్మే చేపలు వుంచడానికి అద్దాల బీరువాలు అన్న ఐటమ్‌ని చదివి అడిగాడు'.

"చేపలకోసమని మీ దుకాణంలోకి వచ్చేవారికి తెలుసుగా అక్కడ చేపలు దొరుకుతాయని. మరి వాళ్ళకది తెలీనట్లుగా మీకు అద్దాల బీరువాలెందుకు చెప్పండి?"

ఆ వ్యాపారస్తుడు లేచి, నిరుపమ్‌తో చెప్పాడు.

"నాకర్జెంట్ సంగతి ఒకటి ఇప్పుడే గుర్తుకొచ్చింది. మరోసారి ఫోన్ చేసి వస్తాను".

"అలాగే"

"నేను ఫోన్‌చేసినప్పుడు మీ మూడ్ సరిగ్గా ఉందా లేదా అని అడుగుతాను. ఆ ప్రశ్నకి జవాబు చెప్పాక మిమ్మల్ని కలుస్తాను"

అతనెళ్ళాక నిరుపమ్ డస్ట్‌బిన్‌లోని చింపేసిన ప్రేమలేఖని చూసి గట్టిగా నిట్టూర్చాడు. మరోసారి నిట్టూర్చాడు. ఇంకోసారి కూడా నిట్టూర్చాడు. మేనేజరమ్మ నించి పిలుపువచ్చింది నిరుపమ్‌కి. ఆవిడ దగ్గరకెళ్ళాడు.

"ఏమిటయ్యా ఈ డ్రాఫ్టులు? ఇలాగేనా ఇవి? ఆఁ? వీటిని కస్టమర్స్‌కిస్తే కొంపలు మునగవు? ఓ మనిషి ఒక్కగంటలో ఇన్ని తప్పులు ఎలా చేయగలడసలు? ఆఁ?"

నిరుపమ్ మౌనంగా వుండిపోయాడు.

"ఇదివరకోసారి కూడా ఇలాగే జరిగింది. మరోసారి జరిగితే నీకు మెమో ఇస్తానన్నాను. ఇంకోసారి ఈ తప్పులు జరగనివ్వనని మాట ఇచ్చావు. గుర్తుందా?" అడిగిందావిడ.

"గుర్తుందండి. నేను నా మాటని నిలబెట్టుకోలేక పోయాను కాబట్టి నాకు మెమో ఇస్తానన్న మీ మాటని మీరు నిలబెట్టుకోనక్కర్లేదండి. చెల్లుకి చెల్లు".

మరికొద్ది సేపు ఆవిడ పెట్టే చివాట్లు తిని, నిరుపమ్ తన సీట్లోకి వచ్చాడు. ఇదంతా ఓరకంట గమనిస్తూ పనిచేసుకుంటున్న అనన్య సన్నగా నవ్వుకోసాగింది.

----

"ఇవాళ నేను బేంక్ నించి వస్తూంటే ఏంజరిగిందో తెలుసా బామ్మా?" ఇంటికి వచ్చాక అడిగింది అనన్య బామ్మని.

"ఏం జరిగిందో చెప్తే తెలుస్తుంది..."

"దారిలో ఓ ఏడంతస్తుల అపార్ట్‌మెంట్ కడుతున్నారు. ఓ పనిచేసే కూలి దురదృష్టవశాత్తూ గోడమీంచి కిందపడ్డాడు"

"అరెపాపం!"

"అదృష్టవశాత్తూ కింద గడ్డి వున్న ఓ లారి ఆగివుంది"

"పోన్లే"

"దురదృష్టవశాత్తూ ఆ గడ్డిలోంచి ఓ పదునైన గడ్డపలుగు తలక్రిందులుగా గుచ్చివుంది".

"అరెరె!"

"అదృష్టవశాత్తూ అది ఆ కూలీ పడేచోటికి ఆరడుగుల దూరంలో వుంది".

"దురదృష్టవశాత్తు కూలి నేలకూలే టైంకి ఆ లారీ ముందుకి వెళ్ళిపోయింది"

"అయ్యో!"

"అదృష్టవశాత్తూ ఆ గడ్డి మోపు లారీలోంచి అతను నేలమీద పడ్డచోటుకి జారింది".

"పోన్లే"

"దురదృష్టవశాత్తు అతను నేలమీద పడ్డాక గాని ఆ గడ్డిమోపు లారీలోంచి జారలేదు"

"అయ్యో చచ్చాడా?"

"లేదు అతను పడింది పన్నెండంగుళాల ఎత్తుగల గోడమీంచే" అని ఫక్కున నవ్వింది అనన్య.

"ఇవాళ బభ్రువాహనుడి మేరేజ్ డే" చెప్పింది బామ్మ.

"ఆయనెవరు?" ఆసక్తిగా అడిగింది అనన్య.

(ఇంకావుంది)

మే 17 జమునారాణి పుట్టినరోజు సందర్భంగా...

# విలక్షణ గళంతో రాణించిన జమునారాణి





చిత్ర సంగీత చరిత్రలో కొండొక స్వర్ణాధ్యాయానికి నాయిక కుమారి కె. జమునారాణి అంటే అతిశయోక్తి కానేరదు. బహుశః కె. అనే యింటి పేరు మొదటి అక్షరం "కుమారి"నే సూచించడం కోసమే లెస్సగా కుదిరిందేమో అనవచ్చు. సంగీత సేవకే అంకితమై జమునారాణి అవివాహితగానే వుండిపోవడం, కళాసేవకై చేయబడిన అపురూపమైన త్యాగం అనడం కూడా సబబే. ఇటీవల దూరదర్శన్‌లో ఆమెతో జరపబడిన 'సందర్శన్"లో ఆమె వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలు - సాధారణంగా అంతటి ధైర్యంతో చెప్పగలవారు కూడా సాహసించలేని వనిపించింది. నిర్మొగమాటంగా, నిజాన్ని చెప్పగలడం ఆమెకొచ్చిన స్వర్ణగుణం.

1938వ సంవత్సరంలో, మే మాసంలో 17వ తేదీన జన్మించిన జమునారాణి జీవితం రాణిగానే రాణిస్తూ వుంది - నేడు కూడా ఎవ్వరిపైనా ఆధారపడవలసిన ప్రసక్తి కాని, అవసరంకాని లేకుండానే! ఆమె తల్లి ద్రౌవది కూడా సంగీతవిదుషీమణిగా విలసిన విశిష్టవ్యక్తి. జమునారాణికి శాస్త్రీయ గానంలో పునాది వేసిన తొలిగురువు శ్రీమతి ద్రౌపది గారే.



ఆమె తండ్రి శ్రీ వరదరాజులు. చిత్ర సంగీతానికి, ద్రౌపదీ వరదరాజుల కానుకయే జమునారాణి బాణి. ఆమె కంఠస్వరంలో వైచిత్రి నమ్మిళితమై వినివిన్తుంది. నంగతులు పాడేటప్పుడు, నొక్కినొక్కి వదిలే రీతి, ఆమె బాణిలో గల ప్రత్యేకాంశం. వినగానే ఈ గొంతు జమునారాణిదే అని ఎవరైనా సరే నమ్మకంగా చెప్పగలిగేటంత వ్యక్తిత్వం ఆమె సొమ్ము... అట్టి మేటిగాయనీమణి జమునారాణితో కూడా హిట్ యుగళ గీతాలు పాడివుండడం నా సుయోగమే.

అభినవ త్యాగయ్యగా వెలుగొందిన చిత్తూరు.వి.నాగయ్యగారి "త్యాగయ్య" చిత్రంలో ప్రప్రథమంగా పాడారు జమునారాణి. అయితే, మొదటిసారిగా నాయికకై పాడే దుర్లభావకాశం, "ద్రోహి" చిత్రంలో లక్ష్మీరాజ్యం పాత్రకి లభించింది. ఇప్పటిదాకా, తెలుగు, మలయాళం, కన్నడ, సింహళం భాషలలోనేకాక తమిళంలో కూడా ప్రజాదరణపొందిన పలు చిత్ర గీతాలు పాడి బహుభాషా గాయికగా ప్రఖ్యాతికెక్కారు. స్వర్ణోత్సవ సన్నివేశాన్ని కూడా దాటి యాభై ఐదు సంవత్సరాల సంగీత సేవ ఈమెకి సదా సదానంద కారణం.

ఆ రోజుల్లో ఆంధ్రాలో వాడవాడలా మాటి మాటికీ దశదిశలా మార్మోగిన "మామా మామా మామా" పాట "మామా" (కె.వి. మహదేవన్)గారి సంగీత దర్శకత్వంలో ఈమెకి దక్కిన ఘనతకు విజయానికి చిన్న సూచన. అది యుగగాయకరత్న స్వర్గీయ శ్రీ ఘంటసాలతో కలిసి పాడిన యుగళ గీతమని అందరికీ తెలిసిన నిజమే. ఆ గీతం "మంచి మనసులు" చిత్రానికే వన్నె తెచ్చింది. తనకి అమితంగా నచ్చిన గీతం "భీష్మ"లో పాడిన "హైలో హైలేసా" అన్న విషయం ఆమెనొక్కి వక్కాణిస్తారు. ఈ నొక్కి పలకడం ఆమె మాటలలోనూ పాటలలోనూ కూడా కొట్టొచ్చినట్టు కనబడి వినబడే వైశిష్ట్యం. సింహళభాషలో ఈ జమున పాడిన గీతాలు "శ్రీలంక"లో నేటికీ జనరంజకాలై మ్రోగుతున్నాయి. విదేశ పర్యటన సందర్భాన, లండన్ (బ్రిటన్) పారిస్ (ఫ్రాన్స్), స్విస్ (స్విట్‌జర్‌లాండ్), జర్మనీ, దక్షిణాఫ్రికా, అమెరికా, మలేషియా మున్నగు నగరాలలోనూ దేశాలలోనూ ఈమె పలుగాన కార్యక్రమాలు సాగించారు. సింగపూర్, దుబాయిలలో కూడా మంచి పేరుగడించారు. ఆంధ్ర, తమిళ రాష్ట్రాలలో ఈమె జరిపే సంగీత కార్యక్రమాలు కోకొల్లలు. ఇటీవల "నాయకన్' చిత్రంలో జిక్కితో కలిసి ఆలపించిన ఫిమేల్ డ్యూయెట్ గ్రేట్ హిట్. తమిళ గీతాలలో కె.వి. మహదేవన్ సంగీత దర్శకత్వంలో ఈమెతో నేను ఆలపించిన "పడిక్కవేణ్డు పుదియపాడం, వాద్ది యారమ్మా" అన్నది మాంఛి వూపుగల పాట. తెలుగులో కూడా కొన్ని మంచి యుగళ గీతాలు పాడివున్నామిద్దరమూ- "ఆత్మబంధువు"కై "దక్కెనులే నాకు నీ సొగసు", "ఉషా పరిణయం"లో "ఓ జవరాలా ఉషాబాలా", "బ్రతికీ ఫలంబేమీ" మున్నగు గీతాలలో హుషారుగా సాగేవి రెండు. ఒకటి మాత్రం శోకగీతం. "ఓ జవరాలా" పాట అద్భుతంగా చిత్రీకరింపబడిన "స్వప్నగీతం" (డ్రీమ్ సీక్వెన్స్ సాంగు) ఇటీవలే చూసే అవకాశం లభించింది. "బ్రతికీ ఫలంబేమి" లో జిక్కి గూడా పాడారు. కాని "కులగోత్రాలు" చిత్రానికై జమునారాణీ నేనూ పాడిన కామెడీ సాంగ్ పెద్ద హైలెట్. ఈ పాటకి గిరిజాపద్మనాభాల



లిప్‌మూవ్‌మెంట్, ఎక్స్‌ప్రెషన్‌తో కూడిన అపూర్వమైన నటనా, "తేజా" టి.వి.లో అతి తరచుగా వినిపించేటంతగా విలసిల్లాయి. పాడిన అనేక గీతాల్లో "మర్మయోగి" చిత్ర గీతం ముఖ్యంగా పేర్కొనదగినది - "రావాలి రావాలి" అని ఆ పాట పల్లవి. మాధవపెద్దితో "అన్నదమ్ములు'లో "రగులుతుంది" అనీ, "రాముడు- భీముడు"లో "సరదా సరదా సిగరెట్టు" అనీ చాలా సరదాగా పాడారు జమున.

పి. సుశీలతో 'కలెక్టర్ జానకి',లో పాడిన 'నీ వన్నది నేననుకున్నది' పాట, యస్. జానకితో "బండరాముడు'లో పాడిన "అద్దిర బల్లా బల్లగుద్ది కాయందునా ఓరి నాయనా!" పాట రెండూ గట్టి హిట్లు.

'బంగారు తిమ్మరాజు'లో 'నాగ మల్లికోనలోనా' 'కులదైవం'లో ఘంట సాలతో 'పదపదవే'

'సూటుబూటు వేసిన బావా', 'చివరకిమిగిలేది'లో 'అందానికి నేనే', 'శభాష్ రాజా' లో 'ఓ వన్నెలా వయ్యారి', 'శభాష్ రాముడు'లో 'వన్నెలు కురిసే', 'బండరాముడు'లో 'ఎవరని అడిగే', 'మంచిమనసులు'లో 'ఎంత టక్కరివాడు', 'మాంగల్య బలం'లో 'తిరుపతి వేంకటేశ్వరా', 'భాగ్యదేవత'లో 'తలచిన తలపులు' 'నాయకుడు'లో 'నా నవ్వే దీపావళి' మొదలైన గీతాలన్నీ గాయనీమణి జమునారాణి అదర గొట్టేలా పాడి అందరిచేతా 'శభాష్ జమునా' అనిపించుకున్నారు.

నాయకామణి "జమున"గారికి, గాయికామణి "జమున" (జమునారాణి)గారు పాడివుండడం ప్రత్యేకించి చెప్పవలసిన ముఖ్యాంశం. ఇటువంటి సముచిత సందర్భాలూ, సన్నివేశాలూ చాలా అరుదైనవనే అనాలి.

ఆ విధంగా "సంచలనాత్మక చిత్రంగా విజయవంతంగా ప్రదర్శింపబడిన "మూగ మనసులు" చిత్రంలో జమున గారికి జమున పాడిన "ముక్కుమీద కోపం" ఇద్దరినీ బాగా సమన్వ యించిన "కింగ్ (ఆర్ క్వీన్) ఆఫ్ టీజింగ్ సాంగ్స్" అనడం ఎంతైనా సమంజసం. ఈ విధంగా జమునా ద్వయం - తగిన జంట.





అప్పుడప్పుడు ప్రత్యేకంగా సంస్థలూ సభలూ జరిపే "సంగీత (లలిత) కార్యక్రమాలలో పాల్గొనే టప్పుడు, మేమిద్దరం కలుసుకోవడం కద్దు. ఆమధ్య ఒకసారి నాతో ఆమె "మీరు పాడిన పాటలెన్నో మేటి బాణీలు. అవి నేను కూడా పాడితే ఎంత బాగుండును అనిపిస్తుంది నాకు తరచూ" అని చెప్పినప్పుడు చాలా గొప్పగా ఆనందించాను ఆమె అందిం చిన మెప్పుకి.

అందరితోనూ సరదాగా మాటాడే జమునారాణి తన దృష్టిని 'వృత్తిధర్మం' పైననే కేంద్రీకరించి, పాడే ప్రతీ పాటకీ, శక్త్యానుసారం పరిపూర్ణన్యాయం చేకూర్చగలిగే సాటిలేని మేటి పాటగత్తె.

విరామ సమయాలలో కుటుంబ సభ్యులతో సరదాగా మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యడం ఆమెకి హేపీ, హాబీ. ఇతరుల వ్యవహారాలలో బొత్తిగా జోక్యం కలగజేసుకో గోరని మనస్తత్వం. తనేమిటో తన పనేమిటో- ఈమెకి తమ అన్నగారు చాలా ఆత్మీయ మిత్రులు. ఆమధ్య ఆయన పరమపదించినప్పుడు ఎంతో బాధ జెందినా, క్రమంగా కోలుకుని, ఆత్మస్థైర్యంతో నిత్య కళాజీవన ప్రయాణాన్ని ఆదర్శప్రాయంగా సాగిస్తున్న మహిళామణి. అన్నగారు కె.వి. స్వామిగారంటే గొప్ప గౌరవం.ఈమెకి తమ అన్నగారి తనయుడిపైన అతివాత్సల్యం. ఆయన విదేశంలో నిజకార్యమగ్నులైవున్న విద్యావంతులు. పేరు కె.వి. శ్రీనివాస్, కంప్యూటర్ ఇంజనీర్.

ఎవరి వృత్తిలో గాని ముఖ్యంగా చిత్ర సీమలో ఒడుదుడుకులూ, మేడుపల్లాలూ విభిన్న విచిత్ర పరిణామాలూ (మార్పులూ) సహజమైనవే, క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొని, ధైర్యస్థైర్యాలతో ముందుకుసాగే అదృష్టం అందరికీ లభించదు. అట్టి అరుదైన అదృష్టం జమునారాణికి దక్కడం అభినందనీయం. ఓటమిని ఓడించి ఎన్నెన్నో గెలుపులు సాధిస్తున్న వీర గాయికామణి మన జమునారాణి. బహుముఖ ప్రతిభావతి. మే 17వ తేదీన జన్మదిన శుభ సందర్భాన ఈ అద్వితీయ గాయనికి మనందరి శుభాకాంక్షలని అందిద్దాం, ఆయురారోగ్యైశ్వర్యాలని ప్రసాదిస్తూ సదా దీవెనల పూలవానలు కురిపించమని సర్వవ్యాపీ సర్వజ్ఞుడూ సర్వశక్తి మంతుడూ అయిన సర్వేశ్వరుడిని సదా ప్రార్థిద్దాం!!!

-డా॥ పి.బి. శ్రీనివాస్

### నేను స్వయంగా పాడి నాకు నచ్చిన పాటలు

| పాట | చిత్రం |
|---|---|
| జవరాలా (పి.బి.యస్ తో) | ఉషా పరిణయం |
| అందాన్ని నేను | ముందడుగు |
| ఓ వన్నెల వయ్యారి | శభాష్ రాముడు |
| వన్నెలు కురిసే | శభాష్ రాముడు |
| నాగమల్లి కోనలోన | బంగారు తిమ్మరాజు |

#### బాగా నచ్చినవి

| | |
|---|---|
| హైలో హైలేసా | భీష్మ |
| అందానికి అందము నేనే | చివరకు మిగిలేది |

"నాగమల్లి కోనలోనా" పాట రికార్డ్ చేసినప్పుడు. "చూపుల్లో కైపుంది మావా" ఈ ఎఫెక్ట్ అన్నీను నేను స్వయంగా ప్లాన్ చేస్కొని కోదండపాణి గారికి పాడి వినిపించాను. కోదండపాణి గారు ఆలోచించారు - ఈ ఎఫెక్ట్స్ ఇవన్నీ అవసరమా అని! కానీ డైరెక్టర్ భావన్నారాయణ గారు ఓ.కె. అని గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు. "నీ ఇష్టమొచ్చినట్లు పాడేసేయమ్మా" అని.

ఈ రోజు ఆ పాటకి వున్న ఆదరణ మీ అందరికీ తెలిసే వుంటుంది.

ఇహ చెప్పుకోదగ్గ సంఘటనలు వేరే ఏమీ లేవండి.

-జమునారాణి

## మంచిమనసులు

రచన: కొసరాజు | గానం: ఘంటసాలతో బృందగానం | సంగీతం : కె.వి.మహదేవన్

ఆడ : తప్పు! తప్పూ!
మామా! మామా! మామా! మామా! మామా! మామా!
మగ : ఏమె! ఏమె! భామా! - ఏమె! ఏమె! భామా!
ఆడ : పట్టుకుంటె కందిపోవు - పండువంటి చిన్నదుంటె
చుట్టు చుట్టు తిరుగుతారు మరియాదా ॥2॥
ఆడ : తాళికట్టకుండ ముట్టుకుంటె తప్పుగాదా
మామా-మామా-మామా
మగ : వాలు వాలు చూపులతో - గాలమేసి లాగిలాగి
ప్రేమలోకి దింపువారు మీరు కాదా?
ఆడ : ఓహొూ! ॥వాలు॥
మగ : చెయ్యి వెయ్యబోతే బెదురుతారు వింతగాదా
ఏమె - ఏమె - భామా
ఆడ : నీవాళ్లు నావాళ్లు రాకనే -
మనకు నెత్తిమీద అక్షింతలు పడకనే ॥2॥
ఆడ : సిగ్గుదాచి
మగ : ఓహొూ-
ఆడ : సిగ్గుదాచి ఒకరొకరు - సిగను పూలు కట్టుకొని
టింగురంగ యంటు మీరు తిరగొచ్చునా? లోకం
తెలుసుకోక మగవాళ్లు మెలగొచ్చునా?
మామా - మామా - మామా -
మగ : కళ్లు కళ్లు కలుసుకోను రాకముందే - అహ
కప్పుకున్న సిగ్గు జారిపోకముందే ॥2॥
మగ : మాయజేసి
ఆడ : ఓహొూ
మగ : మాయజేసి మరులుగొల్పి - మాటలోన మాటగల్పి
మధురమైన మా మనసు దోచవచ్చునా?
నీవు మర్మమెరిగి యీ మాట అడగవచ్చునా?
ఏమె - ఏమె - భామా
ఆడ : పడుచుపిల్ల కంటబడితె వెంటబడుదురూ
అబ్బో! వలపంతా వొలకబోసి ఆశ పెడుదురూ ॥2॥
ఆడ : పువ్వు మీద
మగ : ఓహొూ
ఆడ : పువ్వు పువ్వు మీద వాలు పోతు తేనెటీగెవంటి
మగవాళ్ల జిత్తులన్నీ తెలుసులేవయ్యా
మా పుట్టిముంచు కథలన్నీ విన్నామయా
కోరస్ : మామా - మామా - మామా -

## కులగోత్రాలు

సంగీతం:ఎస్.రాజేశ్వరరావు గానం:పి.బి.శ్రీనివాస్‌తో యుగళం | రచన:కొసరాజు

అ: రావే రావే బాలా హలో మై డియర్ లీలా ॥2॥
ఇటు రావే ఇటు రావే ఐ లవ్ యూ
ఆ: పోవోయ్ పోవోయ్ బావా ఎందుకీ పెడతోవ ॥2॥
ఈపల్లెల్లో మన పల్లెల్లో ॥2॥
సొగవీ వేషాలూ చాలు నీ సరదాలు ఇక చాల్లే...ఇక చాల్లే
అ: టిప్పు టాపు దొరసాని అప్‌టు డేటు అలివేణి ॥2॥
ఈ రోజుల్లో మన ఫోజుల్లో ॥2॥ ఇది దొరల ఫేషనే రాణి
ఆ: పెద్దవాళ్లు చూస్తారు దేహశుద్ధి చేస్తారు ॥2॥
పచ్చి పచ్చి లవ్ చూపావంటే పిచ్చాస్పత్రిలోవేస్తారు ॥2॥
ఈ పల్లెల్లో మన పల్లెల్లో ॥2॥
సొగవీ వేషాలూ చాలు నీ సరదాలూ.... ఇక చాల్లే
అ: ఐ లవ్ యూ... ॥రావే॥
అ: తప్పేమున్నది మేడమ్ నాతో షికారు రావడమ్
ఆ: ఇక్కడ పుట్టిన వాళ్లం ఎందుకు మనకీ మేళం,
ఈ పల్లెల్లో మన పల్లెల్లో ॥2॥
సొగవీ వేషాలూ చాలు నీ సరదాలూ...
ఇకచాల్లే...
అ: ఐ లవ్ యూ..... రావే రావే బాలా
ఆ: పోవోయ్ పోవోయ్ బావా ॥రావే॥

## మంచి మనసులు

రచన: కొసరాజు | సంగీతం: కె.వి. మహదేవన్

ఎంతా టక్కరివాడు - నారాజు
ఏమూలనో నక్కినాడు
పంటచేను గట్టుమీద - వంటిగనే పోతుంటే
వెంట వచ్చినట్టులున్నదీ - ఎవరో వెనక నిలచినట్టులున్నదీ
గుబులు గుబులుగా - గుండెఝల్లుమని ॥గుబులు॥
బిక్కు బిక్కుమని చూశాను - ఫక్కున పక్కనె నవ్వేను
ఎవరూ? ... నా నీడ! ॥ఎంత॥
పొర్లిపారు ఏటిలోన - బుటుకు బుటుకు మునుగుతుంటె
బుగ్గతాకినట్టులున్నదీ - ఎవరో పైట లాగినట్టులున్నది
గిలిగింతలు పెట్టినట్లు - వొడలంతా పులకరించె
నీళ్లనంతా వెదకినాను - త్రుళ్లిత్రుళ్లి పారిపోయెనూ
ఎవరూ? .... చేప! ॥ఎంత॥
అర్థరాత్రి వేళ నేను - ఆదమరిచి నిదురపోతే
వద్ద చేరినట్టులున్నదీ - ఎవరో ముద్దులాడినట్టులున్నది
చిక్కినాడు దొంగయనుకొని, చేయిచాచి పట్టబోతే
కంటి కేమి కానరాక - కలిగి కలిగి పోయేను
ఎవరూ? .... కల! ॥ఎంత॥

## భీష్మ

సంగీతం : యస్. రాజేశ్వరరావు | రచన: ఆరుద్ర

ప: హైలో హైలేసా హంస కదా నా పడవ ॥హైలో॥
ఉయ్యాల లూగినది ఊగీస లాడినది
హైలో హైలేసా హంస కదా నా పడవ
ఓహోహై - ఓహోహై
నదిలో నా రూపు నవ నవలాడినది
మెరిసే అందములు మిలమిలలాడినవి
వయసూ వయారమూ పాడినవి పదే పదే ॥హైలో॥
ఎవరో మా రాజూ ఎదుట నిలిచాడు
ఏవో చూపులతో సరసకు చేరాడు
మనసే చలించునే మాయదారి మగాళ్లకి ॥హైలో॥

## రాముడు - భీముడు

సంగీతం:పెండ్యాల గానం: మాధవపెద్దిసత్యంతోయుగళం రచన:కొసరాజు

అ: సరదా సరదా సిగిరెట్టు
ఇది దొరల్ తాగు భల్ సిగిరెట్టు (2)
పట్టుబట్టి ఒక దమ్ములాగితే
స్వర్గానికే ఇది తొలిమెట్టు ॥సరదా॥
ఆ: కంపు గొట్టు ఈ సిగిరెట్టు దీన్ని కాల్చకోయి నా పై ఒట్టు॥2॥
కడుపునిండునా కాలు నిండునా
మొదలుపెట్టవోయ్ నీ పట్టు ॥కంపు॥
ఘ: ఈ సిగిరెట్టుతో ఆంజనేయుడు లంకాదహనం చేసాడు
ఆ: ఆహో...ఎవడో కోతలు కోశాడు
అ: ఈ పొగతోటి గుప్పుగుప్పు మేఘాలు సృష్టించవచ్చు
ఆ: మీసాలు కాల్చుకోవచ్చు అ: ॥సరదా॥
ఘ: ఊపిరితిత్తుల క్యాన్సర్‌కిదియే కారణమన్నారు డాక్టర్లు
అ: కాదన్నారులే పెద్ద యాక్టర్లు
ఆ: పసరు పేరుకుని
కఫము చేరుకుని ఉసురు తీసుకున్నారు
ఆ: దద్దమ్మలు అది విన్నారు ॥కంపు॥
అ: పక్కనున్నవాళ్ళు ఈ సువాసనకు
ముక్కులు ఎగరేస్తారు నీవెరుగవు దీని హుషారు
ఆ: థియేటర్లలో పొగ తాగడమే నిషేధించినారందుకే
అ: కలక్షన్లు లేవందుకే ॥సరదా॥
ఘ: కవిత్వానికి సిగిరెట్టు కాఫీకే ఇది తోబుట్టు
ఆ: పైత్యానికి సిగిరెట్టు బడాయి కింద జమకట్టు
అ: ఆనందానికి సిగిరెట్టు ఆలోచనలను గిలగొట్టు
ఆ: పనిలేకుంటే సిగిరెట్టు తిని కూచుంటే పొగబట్టు
అ: రవ్వలు రాల్చే రాకెట్టు రంగురంగుల ప్యాకెట్టు
ఆ: కొంపలుగాల్చే సిగిరెట్టు
దీని గొప్ప చెప్ప చీదరబుట్టు ॥సరదా॥

## ఉషాపరిణయం

సంగీతం:యస్.హనుమంతరావు గానం:పి.బి.శ్రీనివాస్‌తోయుగళం రచన:సదాశివబ్రహ్మం

ఘ: ఓ...జవరాల-ఉషాబాలా!
ఆ: ఎవరో...నను పిలిచేవారెవరో
అ: నీ మనసే...నిను పిలిచినది-నీ వయసే
ఆ: ఆహో-తెలిసే-నా మదిలో నీ రూపమే మెరిసే
అ: అదిగో మన ప్రేమ చెలువారు సీమ,
పరమానంద భరితము-కాంచుమా
ఆ: నే పసిదానరా - నీ వశమైతిరా, నను దరిజేర్చరా - ప్రియుడా!
అ: చల్లని నెలరాజు కురిపించె సుధలు,
విల్లున నెలరాజు సంధించె విరులు
ఆ: మనమున చెలరేగె నవభావన,
అనురాగముదయించె నాలోన
అ: అదిగో మన ప్రేమ చెలువారు సీమ
ఆ: రావోయి మనో నాయక - ప్రేమగగనాలలో
మధుర భావాలతో-ప్రణయ రాజ్యాలు పాలించి వినోదింపగా
అ: వలచీ వలపించే-నినుపోలులేమా, చెలిమి లభియించె-
ఎనలేని ప్రేమ సుమశరుకోపము-హిమకరుతాపము,
ఎదిరించి ముదమార పోదాము ॥అదిగో॥
ఆ: తొలకరి మెరుపుల అందాలురోసి
అ: తారల తళుకులతో పందాలు వేసి
ఆ: జిలిబిలి నెలవంక నుయ్యాల చేసి
అ: ఏలుదమికమీద ఆకాశం ॥అదిగో॥

## మూగమనసులు

సంగీతం:కె.వి.మహదేవన్ రచన: ఆచార్య ఆత్రేయ

కుహూఁ - ముక్కుమీద కోపం,
నీ ముకానికె అందం
నా బుంగమూతి సందం,
నీ ముందరి కాళ్ళ బందం ॥ముక్కు॥
అడపదడప ఇద్దరూ, అలిగితేనే అందం,
అలకతీరి కలిసేదే అందమైన బందం ॥ముక్కు॥
సిన్నదాని బుగ్గలకు సిగ్గొస్తే అందం,
ఆ బుగ్గమీద సిటికేసి దగ్గరొస్తే బందం ॥ముక్కు॥
ఈడొచ్చిన పిల్లకు జోడుంటే అందం,
ఈడు జోడు కుదిరినాక మూడుముళ్ళే బందం ॥ముక్కు॥
తల్లీ గోదారికీ ఎల్లువొస్తే అందం,
ఎల్లువంటి బుల్లోడికి పిల్ల గౌరి బందం ॥ముక్కు॥

## చివరకు మిగిలేది

సంగీతం:అశ్వత్థామ రచన:మల్లాది రామకృష్ణశాస్త్రి

ప: అందానికి అందం నేనే జీవన మకరందం నేనే
తీగకు పూవుని నేనే పూవుకు తావిని నేనే ॥తీగకు॥
ధరణి అమరధామమె ఆనందము నేనే ॥అందానికి॥
చ. వాలుకనుల చూపులే చెంగల్వ తోరణాలు
అలారు చిరునవ్వులే మల్లెవిరుల హారాలు
నా మేనే మెరుపుతీవ
నగుమోమే చందమామ ॥నామేనే॥
నవరసాల సమ్మోహ సమ్మేళన నేనే ॥అందానికి॥
చ. మలయానిల లాలనలో పదేపదే పరవశమె ॥2॥
గానమేలు ఎలకోయిల గళ మధురిమ నేనే ॥2॥
మాయని తీయందనాలు మన వరాలై
అవలీలగా జగమేలగా ॥అవ॥
నవచైతన్య సమ్మోహ సమ్మేళన నేనే ॥అందానికి॥

## కులదైవం

సంగీతం:మాస్టర్‌వేణు గానం:ఘంటసాలతోయుగళం రచన:కొసరాజు

పదపదవే వయ్యారి గాలిపటమా
పదపదవే వయ్యారి గాలిపటమా
పైన పక్షిలాగా ఎగిరిపోయి పక్కచూపు చూచుకుంటూ
తిరిగెదవే గాలిపటమా..
ప్రేమ గోలలోన చిక్కిపోయినావా
నీ ప్రియుడున్న చోటుకై పోదువా
ఘ: ఓ...ప్రేమ గోలలోన చిక్కిపోయినావా
నీ...ప్రియుడున్న చోటుకై పోదువా
నీ తళుకంతా నీ కులుకంతా
అది ఎందుకో తెలుసును అంతా ॥పదపదవె॥
నీకు ఎవరిచ్చారో బిరుదు తోక
కొని తెచ్చావేమో అంతేగాక
ఆ: రాజులెందరూడినా మోజులెంత మారినా
తెగిపోక నిల్చె నీ తోకా ॥పద॥
అ: నీలి మబ్బుల్లో ఆడుకుందువేమో
మింటి చుక్కల్తో నవ్వుకుందువేమో
ఆ: వగలాడివిలే జగదంతవులే
దిగిరాకుండా ఎటులుందువులే... ॥పద॥

# మహామహోపాధ్యాయ సంగీతావధాని -దుడ్డు సీతారామయ్య!

**అవధానం ఒక సాహితీక్రీడ-**
**అవధాని చంద్రుడైతే - పృచ్ఛకులు తారలు.**
**అవధాని కమలమైతే... పృచ్ఛకులు భృంగాలు...**
**అవధాని యజ్ఞమైతే - పృచ్ఛకులు ఆజ్యం!**
**అవధాని అన్నమైతే - పృచ్ఛకులు... ఆధరువులు-**
**అవధానాన్ని... ఆంధ్రదేశంలో ప్రచారం చేసీ... అజరామరమైన**
**కీర్తిని సంపాదించి... తెలుగువారికి గర్వకారణమైన కారణజన్ములు**

తిరుపతి వెంకటకవులు...

బాల్యంలో అలాంటి అవధానాన్ని చూసిన...సీతారామయ్యకి...

నాకు సంగీతం వచ్చుగదా...! ఈ సాహితీ అవధానాన్నే సంగీతంలో మాత్రం ఎందుకు చెయ్యకూడదూ...! అన్న ఆలోచనొచ్చింది!!

ఎందుకు? అన్నదాంట్లో అనంతమైన శక్తి వుంది!!

ఎందుకూ అన్న ప్రశ్న మొదలైతే... లక్ష సమాధానాలు పుడతాయ్!...

అందులో విశిష్టమైన సమాధానం!... ఒక ప్రక్రియ అయిపోయీ... నిల్చిపోతుంది!!

ఒక పుస్తకాన్ని తండ్రిగారికి అంకితం ఇస్తూ!...

'ఎందుకు? అన్న ప్రశ్న నేర్పినందుకు'-

అన్నారు రచయిత గోపీచంద్!

అంచేత సీతారామయ్య వేసుకున్న ప్రశ్నకి - త్వరలో సమాధానం లభించి... సంగీతావధానై కూర్చున్నాడు!

దుడ్డు సీతారామయ్యగారి తండ్రి దుడ్డు కామశాస్త్రి గారికి సంగీతం వచ్చు...

పైపెచ్చు.... అధ్యాత్మ రామాయణ కీర్తనలూ... అష్టపదులూ తరంగాలూ వాటిలో ప్రావీణ్యం కలవాడు గూడా!...

అదే అబ్బాయికీ అబ్బింది!

అంచేత ఆరంభంలో తండ్రి కామశాస్త్రి దగ్గరే సంగీతం నేర్చుకునీ యవ్వనం వచ్చాక దేశాటనం బైలుదేరాడు!!

ఏ దేశమేగినా ఎందు కాలిడినా...

సీతారామయ్యకి ఒకటే ధ్యాస...!

సంగీతం... సంగీతం... సంగీతం...!

ఉషోదయాన... నడుంలోతు నీళ్ళలో దిగీ...

ఉదయభాస్కరుడికి గానంతో అర్ఘ్యం ఇచ్చేవాడు...

మధ్యాన్నం వేళ... భోజన సమయంలో...

అన్నపూర్ణాదేవిని స్తుతిస్తూ... పరిషేచన చేసేవాడు!!!

సంధ్యాసమయంలో...విశ్రమిస్తున్న సూర్యుడికి వీడ్కోలు చెప్తూ పాడేవాడు!!!

రాత్రి...నులకమంచం మీద పడుకునీ... నీలాకాశంలో మెరుస్తున్న నక్షత్రాల్ని చూస్తూ... జోలపాటలు పాడుతూ... నిద్దరోయేవాడు!!

మద్రాసులో తిరవత్తూరు త్యాగయ్య వద్ద... కొన్నేళ్ళూ...

సుసర్ల దక్షణామూర్తిగారి వద్ద కొన్నేళ్లూ... శిష్యరికం చేసాడు!!

సంగీతంతోపాటే... సాహిత్యాన్నీ.... గణితాన్నిగూడా. సాధన చేసాడు!!

సంగీత అవధానాన్ని ఆరంభించాడు!!

సంగీతావధానం అంటే... రాగ, తాళ, కాల, జాగా, గతి, జాతి భేదాల్తో పాడుతూ

వయొలిన్ వాయించడం. కోరిన జాగాలలో షట్కాలలో రెండు చేతులతోటీ తాళాలు వేసి కాలం మార్చి, న్యస్తాక్షరీ, ఘంటానాదాలతో కలిపి అవధానం చెయ్యడం!!

సంగీత అవధానాలు చేస్తూ ఉత్తర భారతదేశం గూడా వెళ్ళాడు సీతారామయ్య!

ఓసారి అలహాబాదులో...

ఉత్తర భారత సంగీతజ్ఞుడితో పోటీ...

పోటీ కొచ్చిన కాశీ పండితుడు ఆజానుబాహు

ఊర్ధ్వపుండ్రాల్తో... మెళ్ళోధగధగలాడే కంఠాభరణాలు...

బోల్డన్ని.... వెండీ బంగారు పతకాలూ... భారీగా ఉన్న బంగారపు సింహతలాటం!...

పోటీ మొదలైంది! సంగీతానికిభాషయేముందీ!...

ఇటు దక్షిణాత్యం.... అటు ఉత్తర భారత సంగీతం...

అటు హిమాలయం.

ఇటు హిందూ మహాసముద్రం...

అటు గంగ....ఇటు గోదారి

అటు జిలేబీ చుట్టలు... ఇటు తేనెపానకం

అటు తబలా... టకటకలు...

ఇటు మృదంగం తకిటతకలు...

కాశీ పండితుడి సంగీతం - మనని బోర్లపడుకోబెట్టీ

కొబ్బరినూనెతో మాలీషు చేసినట్టుంటే -

సీతారామయ్యగారి సంగీతం -

ప్రేయసి, నెమలి ఈకతో గుండెల మీద రాసినట్టుంది!

దేనిహాయి దానిది -దేని మజా దానిదీ...

దేని గొప్ప దాందే!... ప్రేక్షకులు ఉద్రూతలూగీ ఊగీ - ఆగిపోయారు పోటీముగిసింది!!

పరీక్షచేసేవారు నిర్ణయం చెప్పకుండానే!

కాశీపండితుడు... సింహతలాటం తీసీ!... సీతారామయ్యగారికిచ్చీ తలవొంచుకుని వెళ్ళిపోయాడు...

---

రసజగత్తు 'ఊయల' ఊపిన శ్రీ గరికపర్తి కోటయ్య దేవర గురించి మీరు అందించిన "రసగుళికలు" - రేయింబవళ్ళు 'రుచి' నాస్వాదించేలా - అభిరుచి కలిగించేలా - నా లాంటి సంగీతాభిమానులకు చవి చూపించేరు. సర్వదా కృతజ్ఞుణ్ణి.

రాజగోపాలాచారి అభిమానపాత్రుడైన కోటయ్యదేవర వారిపైన ఓ 'వర్ణం' వ్రాసి తన భక్తిని - ఓ సాహితీ పుష్పంతో సమర్పించుకున్నాడన్నారు. ఆ వర్ణాభరణాన్ని మీ "సంగీత వాఙ్మయ పరిశోధనతో మాకు అక్షర రూపంలో 'హాసం'లో ప్రకటిస్తే సర్వజనామోదం. హర్షణీయం కూడా.

-శ్రీమాన్ శ్రీకాశ్యప్, సింహాచలం

అలా వెళ్ళిపోయాడు... వెళ్ళి... పోయాడు...
యమునా నదిదాకా వెళ్ళి...
సంగీత సభలో ఓడిపోయాను...
సభామర్యాద గనక... తలొంచాను!...
ఇంత జరిగాక... ఇంకా బతకాలా!... ఇదో బతుకా!
'సరస్వతీ మాతా ముఝే మాఫ్‌కరో'
అని యమునలో మునిగీ - ప్రాణత్యాగం చేసేసాడు!!!
దుడ్డు సీతారామయ్యగారి జీవితంలో ఇలాంటివెన్నో సంఘటనలు.
ఓచోట పొగడ్తలు... మరోచోట తెగడ్తలు...
ఇలా గుండెలు కెలికేసే ప్రాణత్యాగాలు...
మరో దగ్గర కనకాభిషేకాలు...
ధూర్జటి అన్నట్టూ...!

నిను సేవింపగ ఆపదల్ బొడమనీ, నిత్యోత్సవంబబ్బనీ
జనమాత్రుండననీ-మహాత్ముడననీ...
అవి నాకు భూషణములే... అంటూ సరస్వతీదేవికి దణ్ణం పెట్టడం
మినహా చేయగలిగిందేవుందీ!!
ఉత్త నిమిత్తమాత్రత్వం తప్పా!

సీతారామయ్యగారు తన సంగీత అవధానాలతో యావదాంధ్రదేశం పర్యటన చేసారు!...

కాకినాడలో చల్లాసుబ్బారావుగారి నుండి సింహతలాటాలూ, మురుగులూ పొందారు... పత్రిరామచంద్ర రావుగారి నుంచి స్వర్ణకంఠ హారాన్ని - పామర్రులో జరిగిన సంగీతప్పోటీల్లో ఆ కాలంలో అక్షరాలా వెయ్యినూట పదహార్లు గెల్చుకున్నారు...

అలాగే గోడేవారి ఎస్టేటులో అహిరి, రీతిగౌళ రాగాలు పాడి ఓలేటి కామరాజు పంతులుగారి దగ్గర కొంత భూమిని శాశ్వతదాన పట్టానీ పొందారు...



తనికెళ్ళ భరణి

మాడుగుల సుబ్బారావుగారు వీరికి జంగారెడ్డిగూడెం దగ్గర పట్టెన్న పాలెంలోనూ...శ్రీరామపురంలోనూ 50 ఎకరాల మొఖాసా ఇచ్చారు.

ఒకప్పుడు పిఠాపురం ఆస్థానంలో సంగీతావధానం చేసే నరికి రాజావారు ముచ్చట పడీ, ఆస్థాన విద్వాంసుడిగాఉండి పొమ్మన్నారట... తనకు అంతకు ముందే నూజివీడూ- గద్వాల సంస్థానాల్లో 'వార్షికం' ఉండటం వల్ల ఆ పదవిని అంగీకరించలేక పోయారు!...

తను ఏ సంస్థానంలోనూ ఆస్థాన పదవిని చేపట్టకుండానే పదకొండు ఆస్థానాల్లో 'వార్షికం' తీసుకున్న విద్వాంసుడు సీతారామయ్య మహేంద్రవాడ బాపన్నశాస్త్రి వంటి ఎంతోమంది శిష్యుల్ని పొందిన ఆయన మీర్జాపురం రాజావారి వివాహ సందర్భంలో సంగీత అష్టావధానం చేసీ- హుసేని రాగాలాపనతో సభికుల్ని మెప్పించినందుకు 'మహామహోపాధ్యాయ' బిరుదుపొందిన దిట్ట...

సంగీత, సాహిత్యాలు, ఆయనకు రెండుకళ్ళు...రెండు కాళ్ళు... రెండు చేతులుకాగా.... రెండింటిలోనూ సమాన ప్రతిభ చూపి - 72 మేళకర్త రాగాల్లోనూ 'సీతారామ భక్తపోష' అనే ముద్రలో రచన చేసిన వాగ్గేయకారుడు!

అన్నింటికన్నా గొప్ప సంగతేంటంటే 34, 848 రాగాల్లో దేనిగురించి అడిగినా అది ఏ జన్యరాగమో... మూర్చన ఏమిటో అలవోకగా చెప్పేసే నాదయోగి సీతారామయ్యగారు!...

ఇటువంటి మహానుభావుడి ఫోటోమనకి దొరక్కపోవడం మన దురదృష్టం!

ఈపాటి చరిత్రైనా దొరకడం మన అదృష్టం!

ఇంతటి సంగీత మేధావిని స్మరించుకోవడం వల్ల బతుకు ధన్యం
ఆయన ఆత్మకి నమస్కారం చేసుకునే అవకాశం రావడం పుణ్యం!!

-తనికెళ్ళ భరణి

ప్రియమైన తనికెళ్ళ భరణి గారికి

మీ వ్యాస పరంపర "హాసం"లో కొద్ది వారాలుగా చదువుతున్నాను. సినిమా విలనీలు, హత్యలు, క్రూరమైన పాత్రలు వెరసి తనికెళ్ళ భరణిగా ఊహించుకున్న మాకు సంగీత సాహిత్యాల కలయిక తెలుగువారి ముద్దుబిడ్డగా విశ్వరూపాన్ని మాకు చూపిస్తున్న హాసం పత్రికా యాజమాన్యానికి వేలవేల కృతజ్ఞతలు. వృత్తిరీత్యా ఛార్టర్డ్ అకౌంటెంట్ అయినా ప్రవృత్తి రీత్యా సంగీత సాహిత్య అభిమానినైన నన్ను అంకెల గారడీ నుండి బయటపడడానికి భావావేశాన్ని కలుగజేస్తున్న మీకు ఎలా కృతజ్ఞతలు తెలుపగలను.

పొగమంచు, సూర్య కిరణాలు పోటీపడుతున్న సందర్భంలో పచ్చటి పొలాల అందాలు, పల్లెపడుచులు ధాన్యపు గింజలతో పోయే వయ్యారాలు, వసంత రుతువులో కోకిల గానాలు, సూర్యోదయ వేళ దేవాలయాలలో విష్ణు సహస్రనామాలు, వేంకటేశ్వర సుప్రభాతాలు, మరి సంధ్యా సమయంలో శివారాధనలు, వర్షంలో తడిసిన నేలమీద వాహ్యాళులు, వేసవికాలంలో తాటి ముంజెలతో దాహార్తి, ఆకలిలో పచ్చటి అరిటి ఆకులో ఆవపెట్టిన పనసపొట్టుకూర, ప్రియురాలికోసం వేగంగా పరుగుపెడుతున్న నల్లని మబ్బులు, కృష్ణాగోదారి హొయిల సోయగాలు ఇవన్నీ తెలియని తెలుగు హృదయం ఉంటుందంటే ఎవరైనా నమ్ముతారా! మీరు సంగీత వాగ్గేయకారులను సజీవంగా ముందు నిలబెట్టే ఈ యత్నం జన్మజన్మలకి మిమ్మల్ని అమరులుగా చేస్తుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు. మీరు ఈ వ్యాస పరంపరను ఇలాగే కొనసాగించమని, మిమ్మల్ని మీరు నమ్మే ఆ పరమశివుడు పదికాలాలపాటు చల్లగా చూడాలని కోరుకుంటూ...

చుండూరి రామకృష్ణ, ఛార్టర్డ్ అకౌంటెంట్,
107ఎ, మెట్రోపామ్‌గ్రోవ్ అపార్ట్‌మెంట్స్,
రాజ్‌భవన్ రోడ్, హైదరాబాద్.

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**
**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**
**మోతీనగర్, హైదరాబాదు - 500 018**
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.




## ఈ సారి సమ్మర్ స్పెషల్ లో...

# బుడుగు 'ఉవాచకం'

★ నా అంతటి వాడు నేడు. నన్ను ఎవరూ తిట్టకూడదు, కొట్టకూడదు. కొట్టితే పాపం, అసలు నేను చిన్నవాడిని, నా నెత్తి మీద దేముడుంటాడు. నన్ను కొట్టితే వాణ్ణి కొట్టడం అన్నమాట.

★ నా దగ్గిర కుంచెం బీడీలు ఉన్నాయి. రౌడీలు బీడీలు కాలుస్తారు. నేను కాల్చననుకో. అయినా జెటకా బండి తోలినప్పుడు చెవిలో పెట్టుకోవాలిగా, అందుకు. బీడీలు ఇంకోందుకు కూడా మంచివి. అమ్మలేనప్పుడు బామ్మ దగ్గిరికి వెళ్ళి మీద పడేస్తానంటే, కాణీ ఇచ్చేస్తుంది, అందుకు.

★ ఎందుకో మరి నేను మేలుకుని ఉన్నప్పుడు అందరూ పెంకి భడవా అని తిడ్తారు. నిద్రపోతున్నప్పుడు నేను ఎంతో ముద్దొస్తానుట. మళ్ళీ యెంచాతో.

★ లావు పాటి పక్కింటి పిన్నిగారి ముగుడుగారికీ, పిన్నిగారికీ నేనంటే కోపం - కోపం అంటే భయం. నేను ఎప్పుడేనా వాళ్ళింటికెళ్తే తలుపేసేస్తుంది. నేను తలుపులోంచి వెళ్ళనుగా కిటికీలోంచి వెళ్తాననుకో.

★ బెస్టంటే మనకి ఇంచక్కా ఉండేది, ఇంకోళ్ళకి కోపం వచ్చేది.

★ నాన్న నన్ను హన్నా అని కోప్పడేస్తున్నాడనుకో. అప్పుడు అమ్మ చెంగు పట్టుకు నించున్నామంటే చాలు. మనకేం భయం లేదు. అమ్మ రక్షిస్తుంది. యేం? ఒక్కోసారి అమ్మ, నాన్న ఇద్దరూ హూ అంటారనుకో. అప్పుడు బామ్మ రక్షిస్తుంది. ఇలాగ వాళ్ళందరూ నన్ను రక్షిస్తారు. నేనూ వాళ్ళని రక్షిస్తాననుకో. ఒక్కోసారి నాన్న నిద్దర పోతున్నాడనుకో. అప్పుడు నాకు జాలేస్తుంది. పోన్లే పాపం అని అల్లరి చెయ్యకుండా వదిలేస్తాను. అలాగన్నమాట.

★ పుట్టార్డడం అంటే మనం ఎక్కడో దొరకడం అన్నమాట. అంటే దేవుడు మన్ని తెచ్చి మా ఇంటో పడేస్తాడు. అపుడు అమ్మా నాన్న కుంచెం రోజులు పెంచుతారు. తరువాత పెంకి భడవాకానా, బడుద్ధాయీ అంటారు. అప్పుడు గబుక్కున అక్షరాభాసం చేసి బళ్ళో పెట్టేస్తారు.

★ ధైర్యం అంటే పోలీసులతో మాట్లాడ్డం అని అర్థం. ధైర్యం అంటే సుబ్బలక్ష్మితో మాట్లాడ్డం అని కూడా అర్థంట, ఇలా అని బాబాయి చెప్పాడు. ధైర్యం అంటే బుడుగ్గాణ్ణి బజారుకి తీసుకెళ్ళడం అని కూడా ఇంకో అర్థం ఉందిట. నాన్నకి ఇలాంటి ధైర్యం లేదు. ఇలా అని అమ్మ అంటుంది.

★ పెంచడం అంటే, మనకి నిద్దర్రానపుడు పడుకో అని కోప్పడేసెయ్యడం. ఇంకా, ఆకలేసినా ఓసారో ఆరుసార్లో అన్నం పెట్టను అనడం, మళ్ళా యేమన్నా కూడా పెట్టను అనడం, అదన్నమాట. మన్ని రోజూ నీళ్ళోసుకోమనడం అసయ్యంగా. అలాగే ఉంకోటి. మన్ని ఎప్పుడూ చెడ్డీ చొక్కా తొడుక్కోమనడం.

★ యిప్పుడు ఓ చిన్న పాపాయి ఏడుస్తోంది గదా. నేనే కనక అమ్మా నాన్న అయితే ఆ పాపాయికి ఇటువేపునీ అటువేపుని కూచుని గారిగా ఏడిచేస్తాను. దెబ్బకి హడ్డిలిపోవాలది. హడ్డిలిపోయి నోర్మూసుకుంటుంది అంతే.

## ఇవి కాక, ముళ్ళపూడి వెంకటరమణ రచనలలో పిల్లలకు సంబంధించిన మరికొన్ని చెళుకులు...

★ పిల్లవాడు తల్లికి దొరక్కుండా చెట్టెక్కేసాడు. 'ఒరే ఒరే పడిపోతావురా' - తల్లి చెట్టు కింద నిలబడి కేకలు వేస్తోంది. 'పడకపోతే దూకేస్తాను, తలంటి పోయనని ఒట్టెయ్'

(వంశవృక్షం సినిమాలో)

★ నాగరాజుకి గెద్ద ఎలా ఎగిరిందీ అని సందేహం వచ్చి ఆ మధ్య - అంటే చాలా ఏళ్ళ క్రితం చాలా మంది కుర్రాళ్ళకి ఇలాగే బోలెడు సందేహాలు వచ్చాయి. జేమ్స్ వాట్ అనే కుర్రాడుండేవాడుట. వాళ్ళమ్మ కాఫీ కెటిల్‌లో నీళ్ళు (వాళ్ళు తెల్లదొరలులే) కాస్తూంటే మూతెగిరెగిరి పడుతోంది. అది ఎలా ఎగురుతుంది అని జేమ్స్‌కి సందేహం వచ్చింది. 'ఆవిరి మూలమున ఎగురుచుండెను' అని నువ్వు ఇప్పుడు చెప్పుకోగలవనుకో. అప్పుడు ఎవరికీ తెలీదు. మేష్టర్లకి కూడా తెలీదు. ఏం?...

(బాలవైజ్ఞానిక సీరియల్ 'విమానం కథ')

★ న్యూటన్ అనే ఇంకో కుర్రాడు ఉండేవాడు. కొంచెం పెద్దాడేలే. ఒక రోజుని అతను చెట్టుకింద బెంచిమీద కూర్చున్నాట్ట. ఒక ఆపిలు గబుక్కున అతని నెత్తిమీద పడింది. సుబ్బరంగా తినేసి పోవచ్చుగా. సందేహాలు పుట్టి చివరికి బండరాముడికి అందరి గోళీకాయలు లాక్కోవాలని బుద్ధి ఉన్నట్లే, భూమిని అందర్నీ అన్నిటినీ తన దగ్గిరగా లాక్కోవాలని ఒక గుణం ఉన్నట్టు తెలుసుకున్నాడు.

(బాలవైజ్ఞానిక సీరియల్ 'విమానం కథ')

★ "ఒరేయ్ వాడు పచ్చి రౌడీ నంబర్ వన్ తెలుసా? వాళ్ళింటోనే కాదు మా ఇంట్లో పుస్తకాలు కూడా చెక్కేస్తాడు. ఓ సారి నేను వాడి పెనసలు దాచేశా. మళ్ళీ నాకు తెలీకుండా దాన్ని వాడు దొంగతనం చేశాడు. అప్పట్నుంచీ వాడితో మాట్టాడ్డం మానేశా".

భోగిమంట (1955).

★ అమ్మ కిందకి వెళ్ళిపోయింది కామోసు. ఇంక ఎలాగూ వినబడదు ఏడ్చినా. అందుకని నాగరాజు ఏడుపు మానేశాడు.

(విమానం కథ).




స్వాతంత్ర్యం వచ్చాక జమిందారీ పద్ధతుల పట్ల సామాజికంగా వచ్చిన అభిప్రాయాల వల్ల కొందరు అభ్యుదయవాదులు తీసిన సినిమాలు వస్తున్న రోజులవి.'దున్నేవాడిదే భూమి' అనే నినాదాన్ని బలపరుస్తూ చిత్రం మొత్తం అంతా గ్రామీణ వాతావరణ నేపథ్యంలో తయారుచేసిన కథతో 1955లో తీసిన చిత్రమే సారథీ వారి

# రోజులు మారాయి

అక్కినేని నాగేశ్వరరావు, షావుకారు జానకి, సి.యస్.ఆర్., రేలంగి, పెరుమాళ్ళు, అమ్మాజీ ముఖ్యతారాగణం. ఈ చిత్రానికి దర్శకుడు తాపీ చాణక్య. మాటలు కొండేపూడి లక్ష్మీనారాయణ. పాటలు తాపీ ధర్మారావు, కొసరాజు. సంగీత దర్శకుడు మాస్టర్ వేణు. ఆయన కెరీర్‌లో ఓ పెద్ద మలుపు, మైలురాయి, మహత్తరమైన మజిలీ అని చెప్పుకోదగ్గ చిత్రం ఈ "రోజులు మారాయి". మాస్టర్ వేణు అంతకుముందు విజయాసంస్థలో ఇన్‌ఛార్జిగా ఉండేవారు. ఈయన వివిధ వాద్యప్రవీణుడు. హార్మోనియం, పియానో, సితార్, గిటార్, దిల్‌రుబా, మాండొలిన్, ఎకార్డియన్, ఫ్లూట్, సెల్లో, వుడోఫోన్, జలతరంగిణి, హెమండ్ఆర్గన్ వంటి పదిహేను రకాల వాద్యాలను అవలీలగా వాయించగల దిట్ట. సారథీవారి పిలుపునందుకొని విజయా సంస్థను వదిలివెళ్ళారాయన. 'రోజులు మారాయి' చిత్రంకోసం ఆయన స్వరపరిచిన పాటలలో ఓ అయిదిటి గురించి...:

ఆ: ఇదియే హాయి కలుపుము చేయి
వేయి మాటలేలనింక (2) ఓ... ॥ఇదియే॥
అ: ఇదియే హాయి కలుపుము చేయి
వేయి మాటలేనింక (2) ఓ... ॥ఇదియే॥
ఆ: ఆ చూపులోనె కురియును తేనె
చిరునగవాహా వెలుగున వాలె
మనసేదో హాయి సోలునే ఓ... ॥మన॥
నీ వాడిన మాట సాటిలేని పూల బాట
సాటిలేని పూలబాట ॥ఇదియే॥
అ: అందాలలోన నడవడిలోన
తొలుతవు నీవే తెలియగరావె
బ్రతుకున మేలు చూపవె ఓ... ॥బ్రతు॥
నీ చూపే చాలు
అదే నాకు వేలవేలు ఓ... ॥అదే॥ ॥ఇదియే॥
ఇ: ఈ లోకమేమొ మరీ లోకమేమొ
మనసులతోనే తనువులు తేలే
బ్రతుకికక తూగుటూయలే ఓ... ॥బ్రతు॥
ఈ నాటి ప్రేమ లోటులేని మేటి సీమ
లోటులేని మేటి సీమ ఓ... ॥ఇదియే॥



ఈ పాటను ఘంటసాల, జిక్కిపాడగా అక్కినేని నాగేశ్వరరావు, షావుకారుజానకి అభినయించారు మాస్టర్‌వేణు శైలిఇదీ అని పట్టి ఇచ్చే పాటయిది. మధ్యమావతి, శ్రీ రాగాలను మిశ్రమం చేసుకుంటూ తన గురువైన నౌషద్ స్టయిల్ ఆఫ్ కంపోజిషన్‌ను గుర్తుచేస్తూ వరసల్ని కల్పించటం మాస్టర్ వేణు ట్యూన్ చేసే పద్ధతి. కావాలంటే నౌషద్ సంగీత దర్శకత్వంలో 'అన్‌మోల్‌ఘడీ' చిత్రంకోసం నూర్జహాన్ పాడిన 'ఆజా... మెరీ బర్‌బాత్ మొహబ్బత్‌కే' అనే పాటని సంపాదించి వినండి. మాస్టర్‌వేణు స్వర రచనలలో నౌషద్ ప్రభావం ఎంత ఉందో తెలుస్తుంది.

రండయ్య పోదాము మనము
లేచి రండయ్య పోదాము మనము
ఇకను కొండలన్నీ పిండికొట్టి పారేద్దాము ॥రండయ్య॥
బసవన్న చెండించి రంకె వేస్తున్నాడు
పాలేరు మనతోటి పయనమౌతున్నాడు
భూదేవి కరుణించి పులకాంకురంబెత్తి ॥భూదేవి॥
రత్నాల ముత్యాల రాసి కురిపిస్తుంది ॥రండయ్య॥
కాపు బీదే కాని గడ్డ బీదే కాదు
కోటి విద్యలు కూడా కొండకే లోకువ ॥కోటి॥
ఏకధాటిగ మనము ఏకమై నడవాలి
కరువు రక్కసి గుండె ఠారెత్తిపోవాలి ॥రండయ్య॥
తుంగభద్రా కృష్ణ గోదావరి నదులు
చెంగు చెంగున పొరలి చేలపై తిరగాలి చేలపై తిరగాలి
గట్లు తల్లుక పంట కాలువలు పారాలి కాలువలు పారాలి
గర్భదారిద్ర్యం కడతేరిపోవాలి ॥రండయ్య॥
బంజర్లన్నిటిని పద పదాలుగ చేసి
అడవులన్నీ హతా హతముగా చెక్కేసి హతముగా చెక్కేసి
దేవుడిచ్చిన తీర్థమెవడడ్డగించినా... (2)
ప్రవహింప చేస్తాం బ్రతుకుసాగిస్తాం (2)
గంగా మహాదేవి గబగబారావాలి గిరగిరా జరజరా తిరిగి హోరెత్తాలి
జలజలా బొల బొలా (2) నదులు పరుగెత్తాలి
మేలుకోళ్ళేకమై ఎగసి నీళ్ళురకాలి
కదలి రావమ్మా... దూకి రావమ్మా... పొంగి రావమ్మా...








ఈ పాటను ఘంటసాల, బృందం ఆలపించగా అక్కినేని నాగేశ్వరరావు, షావుకారుజానకి, సీతారాం మొదలైనవారు అభినయించారు. బిళహరి రాగాన్ని ప్రధాన ఆధారరాగంగా తీసుకుని అన్యస్వరాలను కూడా చేర్చుకుని పూర్తి జానపద ధోరణిలో మలచారీపాటని. పాట మొదలైన దగ్గర్నుంచి చివర్న గట్లు తెంచుకుని పారే నీళ్ళ శబ్దం వరకు మొత్తం పాటనంతటినీ పాడేవాళ్ళు ఇప్పటికీ ఆంధ్రదేశంలో కొన్ని కొన్ని ప్రాంతాలలో మనకి కనిపించినా ఆశ్చర్యపోనవసరం లేదు. ఈ పాట వేసిన ముద్ర అలాంటిది!

ఈ పాటలో కొసరాజు ఉపయోగించిన పదాలు చూడండి - చెండించి/పులకాంకురంబెత్తి/కాపు బీదే గాని గడ్డ బీదే కాదు/ ఠారెత్తి పోవాలి/ గట్లు తల్లుక పంట కాలువలు పారాలి/ పద పదాలుగా చేసి/హతాహతముగా చేసి/బొలబొలా/మేలుకోళ్ళు ఏకమై ఎగసి నీళ్ళు ఉరకటం - ఇలా... జనాల హృదయాలను పట్టుకునే పల్లెపట్టు పదాలతో పాటను రక్తించాడు కనుకనే ఆయన 'జానపదకవి బ్రహ్మ' అయ్యాడు.

కల్లా కపటం కాననివాడ లోకం పోకడ తెలియనివాడ
ఏరువాక సాగారో రన్నో - చిన్నన్న

చ: 1. నవధాన్యాలను గంపకెత్తుకుని
చద్ది అన్నమూ మూట గట్టుకుని (2)
ముల్లుగర్రను చేతబట్టుకుని
ఇల్లాలును నీ వెంటబెట్టుకొని ॥ఏరువాక॥

చ:2 పడమట దిక్కున వరద గుడేసె
ఉరుముల మెరుపుల వానలు కురిసె (2)
వాగులు వంకలు ఉరవడి జేసె
ఎండిన బీళ్ళు ఇగుళ్ళు వేసె ॥ఏరువాక॥

చ:3 కోటేరును సరిజూసి పన్నుకో
ఎలపడ దాపట ఎడ్ల దోలుకో
సాలుదప్పక కొండ్ర దున్నుకో
విత్తనమ్ము లిసిరిసిరి చల్లుకో ॥ఏరువాక॥

చ:4 పొలాలమ్ముకుని పోయేవారు
టౌనులో మేడలు కట్టేవారు
బ్యాంకులో డబ్బులు దాచేవారు
నీ శక్తిని గమనించరు వారు ॥ఏరువాక॥

చ:5 పల్లెటూళ్ళలో చెల్లనివాళ్ళు
పాలిటిక్సుతో బతికేవాళ్ళు
ప్రజాసేవయని అరచేవాళ్ళు ॥ప్రజా॥
ఒళ్ళు వంచి చాకిరికి మళ్ళరు ॥ఏరువాక॥
పదవులు స్థిరమని భ్రమిసే వాళ్ళే
ఓట్లు గుంజి నినుమరిచే వాళ్ళే
నీవే దిక్కని వత్తురు పదవోయ్ (2)
రోజులు మారాయ్ రోజులు మారాయ్
మారాయ్ మారాయ్ మారాయ్ రోజులు మారాయ్ ॥ఏరువాక॥










తెలుగు సినిమా సంగీతంలో జానపద గీతాల ప్రభావం అనే అంశం గురించి ఎవరైనా ప్రస్తావించవలసి వస్తే 'రోజులు మారాయి' చిత్రంలోని 'ఏరువాక సాగారో రన్నో చిన్నన్న' పాటను ఉదహరించకుండా ముందుకు వెళ్ళలేరు. ఒక్క తెలుగునాట మాత్రమే కాక మొత్తం భారతదేశంలోని సంగీత ప్రపంచానికి సంబంధించి వారందరినీ ఒక ఊపు ఊపిన పాట అది. కొసరాజు రాఘవయ్య చౌదరి రాసిన ఈ పాటను పాడినది జిక్కి. వహీదారెహమాన్ నృత్యంచేసి అభినయించగా అక్కినేని నాగేశ్వరరావు, షావుకారు జానకి, సీతారాం మొదలగువారు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఈ పాటలో డప్పు వాయిస్తూ వహీదారెహమాన్ పక్కన కనిపించే ఒక వ్యక్తి కె.యస్.రెడ్డి తర్వాతి రోజుల్లో నృత్య దర్శకుడిగా, దర్శకుడిగా పేరు తెచ్చుకున్నారు.

నృత్య దర్శకుడిగా అప్పటికే లబ్దప్రతిష్టుడైన వెంపటి పెద్దసత్యం ఈ చిత్రం గురించి విన్నారు. హుటాహుటిన నిర్మాత సి.వి.ఆర్.ప్రసాద్‌గారి దగ్గరకెళ్ళి 'అదేంటండీ...ఒక్క డాన్సు కూడా లేకుండా ఎలా...నన్ను మర్చిపోయారా...నేను సారథీవారి మనిషిని కానా?' అని అడిగారట. దాంతో ప్రసాద్‌గారు ఆలోచనలో పడ్డారు. ఆ చిత్రంలో ఒక్క పాట తప్ప మిగిలిన పాటలన్నిటినీ రాసిన కొసరాజుగారిని పిలిపించారు. "పెద్దసత్యం ఇలా అన్నాడు. నిజమే కదా...ఎక్కడ పాట పెడతాం?" అని ఆలోచించారు. కలెక్టర్ వచ్చి బంజరుభూముల్ని పేదరైతులకు పంచి ఇచ్చే సీను ఉంది. అది బడుగురైతుల విజయమే కదా, అక్కడ పెడితే బాగుంటుంది అనుకున్నారు మరి ఏం రాయాలి, ఎలా రాయాలి అని చర్చించుకుంటుండగా, ఏరువాక పౌర్ణమికి అరకులు కట్టే సంప్రదాయం గురించి గుర్తుచేశారు నిర్మాత సి.వి.ఆర్.ప్రసాద్. "ఆ...వచ్చేసింది" అన్నారు కొసరాజు వెంటనే. అంతే...అశువుగా చెప్పుకుంటూపోయారు పాటని. సినిమాలో అయిదు చరణాలే ఉన్నాయిగానీ ఆ రోజు ఆయన నోట వెలువడ్డ చరణాలు ఎన్నో..ఎన్నెన్నో...తెలుగు సినిమాల్లో జానపద సాహిత్యానికి సంబంధించిన గీతాలు రాయాలన్నా, హాస్యగీతాలు రాయాలన్నా కొసరాజుని మించిన కవి లేరన్నది నిర్వివాదాంశం. ఆయన తర్వాత ఆ లోటు ఇప్పటికీ భర్తీ కాలేదు గనుక ఆయనే 'కొస'రాజు అని సినీజనులు చమత్కరిస్తుంటారు కూడా. పల్లెటూళ్ళలో పొలం దున్నుకునే వారి నుడికారానికి ఓ ప్రాకారం కట్టి పాటరూపంలో ఆయన స్వరార్చన చేసిన ఈ పాటలోని ప్రతీపదం జీవగుణాన్ని సంతరించుకున్నదే.

ఇక ఈ పాటకి మాస్టర్ వేణు ఇచ్చిన ట్యూన్‌కి యూనిట్ అంతా కదిలిపోయింది. మరి డాన్సర్‌గా ఎవరిని పెడదాం అని ఆలోచనలో పడ్డారు. అప్పటికి కొందరు ప్రసిద్ధులైన నర్తకీమణులు ఇండస్ట్రీలో ఉన్నా, వారిలో శాస్త్రీయత విపరీతంగా తొంగిచూస్తూ ఉండటం వల్ల వద్దనుకున్నారు. వాహినీ సంస్థలో పని చేసే వేదాంతం జగన్నాథశర్మ ఈ విషయం తెలిసి మాటసాయం చేశారు. "రాజమండ్రిలో మున్సిపల్ కమిషనర్‌గా పనిచేస్తున్న రహమాన్ గారికి వహీదా, షహీదా అనే ఇద్దరమ్మాయిలున్నారు. వాళ్ళు బాగా డాన్స్ చేస్తున్నారు. ఒకసారి ప్రయత్నించి చూడండి" అని సలహా ఇచ్చారు. వెంటనే వహీదా రహమాన్‌ను పిలిపించి ఓ.కే.చేశారు సారథీవారు.

ప్రతిరోజు కనీసం మూడు గంటల నుండి - ఆమె ఆడిఆడి అలసిపోయే వరకు కనీసం ఓ నెలరోజులపాటు రిహార్సల్స్ జరిగాయి. మాస్టర్ వేణు హార్మోనియం వాయించేవారు. కొసరాజుగారే పాడేవారు. పాటలో డప్పులుంటే బాగుంటుందని పాత డప్పుల్ని చల్లపల్లి పంపించి తిరిగి కొత్త చర్మం వేయించి ఉపయోగించేవారు.

ఆ డప్పులే ఆ పాటకి ప్రధాన ఆకర్షణ అయికూర్చున్నాయి. అంతేకాదు. పాటలో పల్లవికి కట్టిన ట్యూన్‌నే ఇంటర్‌లూడ్‌గా వాడుకున్నారు. నిజానికి అప్పటికి అదో ప్రయోగం. పల్లవి మీద ఎంత నమ్మకం లేకపోతే దానిని తిరిగి ఇంటర్లూడ్‌గా వాడుకుంటారు? ఏ మాత్రం బాగులేకపోయినా అది మొనాటనీ అయ్యే ప్రమాదం ఉంది కదా!? ఆ ప్రయోగం ఎంతగా విజయం సాధించిందంటే ఆ తర్వాత తమిళ రంగంలో ఒకేసారి అయిదు చిత్రాల్లో ఇటువంటి పాటలు వచ్చాయి. ఇవన్నీ ఒక ఎత్తు. మొత్తం సంగీత దర్శకులందరూ ఎంతో గౌరవంగా 'బర్మన్‌దా' అంటూ పిలుచుకునే ఎస్.డి.బర్మన్ కూడా ఈ 'ఏరువాక సాగారో' ట్యూన్‌ని తీసుకుని 'బొంబై కా బాబు' చిత్రంలో 'దేఖ్‌నే మే భోలా హై బాబూ చిన్నన్న' అనే పాటను స్వరపరచడం మరో ఎత్తు. సంగీత దర్శకుడిగా మాస్టర్ వేణు ఘనవిజయంగా చెప్పుకోవచ్చు ఈ సంఘటనని. మరోవిధంగా ట్యూన్‌తో పాటు 'చిన్నన్న' అనే తెలుగుపదం ప్రభావంలో తప్పించుకోలేని విధంగా బర్మన్ వంటి మహానుభావుణ్ణి సైతం పడేసిన కొసరాజు విజయం కూడా.

చిరునవ్వులు వీచే అదిగోనా ఆశలు ఫలియించే (2)
మదిలోని ఊహలు పూవులు పూచి వలపులు కురిపించే ॥చిరు॥
పరుగెత్తెను కాలువనీళ్ళు తలయెత్తెను ఆవేశాలు
పులకించెను నవభావాలు ఉలికించెను ఆలోచనలు
అనుకున్న వన్నెకాడె అనురాగం చూపెగా (2)
ఆహ హో వలలో చిక్కెనుగా ఆహో నీ వలలో చిక్కెనుగా
అదియేమొ గాని అదిగో నీ ఆశలు ఫలియించె ॥చిరు॥
చిలకంచుల చీర గట్టి
సిగ పూలతో షికారు కెళ్ళె
నిలువెత్తున పెరిగిన చేను
నిను జూచి కన్ను గీటెగా
వరికన్నె రమ్మని నిన్నే సైగలెన్నో చేసెగా (2)
మురిపాలు చూడమని నవ్వెగా
ఉలిపాట పాడమని నవ్వెగా
అదియేమోగాని ॥అదిగో॥
వరి కెంపుల సొంపులు తీరే
వదినమ్మకు లేదేం నోరే
కలహాలన్నీ గతించె
వరహాల రోజులు వచ్చే
నువ్వు గంటే భాగ్యం పండి
పాపాయింట్లో దోగును (2)
పై రీనిన పాతర నిండును
దేశానికి సౌఖ్యం గల్గును
ఆనందమౌను
అదిగో మన ఆశలు ఫలియించె... ॥చిరు॥



ఈ పాటను ఘంటసాల, జిక్కి, కృష్ణకుమారి పాడగా అక్కినేని నాగేశ్వరరావు, షావుకారుజానకి, అమ్మాజీ అభినయించారు. సోగ్గాడు, యవ్వనం కాటేసింది, రిక్షారాజీ చిత్రాలలో హీరోయిన్‌గాను, ప్రస్తుతం టీవీరంగంలో క్యారెక్టర్ నటిగాను ప్రేక్షకులకు తెలిసిన జయచిత్రకు ఈ అమ్మాజీ తల్లి.

మాస్టర్ వేణు మచిలీపట్నంకి చెందినవాడు కావటంచేత బందరులో అప్పట్లో మంచి పేరు తెచ్చుకున్న కృష్ణకుమారిని గాయనిగా ఈ పాటకోసం తీసుకొచ్చి పాడించారని, ఆ తరువాత ఆమె సినీగీతాలు పెద్దగా పాడలేదని 'రోజులు మారాయి' చిత్రానికి ప్రొడక్షన్ వ్యవహారాలు చూసిన తమ్మారెడ్డి కృష్ణమూర్తి 'హాసం'కు తెలిపారు. తమ్మారెడ్డి కృష్ణమూర్తి - తర్వాతి రోజుల్లో నిర్మాతగామారి లక్షాధికారి, జమీందార్, ధర్మదాత వంటి విజయవంతమైన చిత్రాలు నిర్మించారు. నేటి దర్శక నిర్మాత తమ్మారెడ్డి భరద్వాజ ఈయన కుమారుడే.

ఇక పాట విషయానికొస్తే - దేశ్ రాగాన్ని ప్రధానరాగంగా తీసుకుని మధ్య మధ్య బృందావన సారంగ రాగం కూడా అనిపించేట్టుగా స్వరపరిచారీ పాటని.

అభ్యుదయవాదులు తీసిన చిత్రం కనుక సరదాగా పాడుకునే ఇటువంటి - అన్నా ఒదినా చెల్లి కలిసి పాడుకునే -పాటలో కూడా దేశానికి సంబంధించిన ప్రసక్తి ఉండటాన్ని మూడవచరణంలో గమనించవచ్చు.

ఎల్లిపోతుందెల్లి పోతుంది జోడెడ్లబండి
ఎల్లిపోతుందెల్లి పోతుంది పెళ్ళోరిబండి ॥ఎల్లి॥
అతుకు బొతుకుల్లేని బండి
గతుకులకు భయపడని బండి
కాల చక్రం ధాటి కన్నా గబా గబా పరుగెత్తుబండి ॥ఎల్లి॥
కోడెలంటె కోడెలా ఈ బండి లాగే కోడెలు
ఓయ్ అందమైన కోడెలు భల్ పందెమాడే కోడెలు
సాలూరు సంతకాడ సై అన్న కోడెలు
కోటయ్య కొండకాడ నేతన్న కోడెలు
జిగమగ కోడెలు టంగువాడ కోడెలు
పాలపండ్ల కోడెలు పరుగులెత్తె కోడెలు
వంటిమీద చెయ్యేస్తే మింట పోయే కోడెలు ॥ఎల్లి॥
పెళ్ళంటే పెళ్ళిరా పేరు మోగే పెళ్ళిరా ఇది
పేరు మోగే పెళ్ళిరా
వీధిలోన నిలువబెట్టి వేలు వేలు పాకపెట్టి
వెర్రి ఆవేశాలు బుట్టి కన్నవారి కాళ్ళుపట్టి
ఇల్లు వాకిలి కుదువపెట్టి
అల్లుడికి కట్నంకట్టి
చుట్ట పక్కాలందారికి
పెట్టలేక చాత బట్టి
రభసచేసే పెండ్లి కాదిది
రట్టులోపడు పెండ్లి కాదిది
చూడచక్కని పెండ్లిరా బహు వేడుకైన పెండ్లిరా
వేడుకైన పెండ్లిరా ॥ఎల్లి॥
పల్లెటూరి బాబులంతా భళీ భళీ అని మెచ్చుబండి
హరి హరాదులే అడ్డగించినా ఆపశక్యం కాని బండి
గంటల గణగణ నాదం తోటి
మువ్వల గలగల మోదం తోటి ॥గంటల॥
పెళ్ళివారి పందిరిలో ఘల్లుఘల్లునా దూకే బండి ॥ఎల్లి పో॥





వల్లం నరసింహారావు



మోదుకూరి సత్యం

ఈ పాటను మాధవపెద్ది సత్యం పాడగా ప్రధానపాత్రధారిగా వల్లం నరసింహారావు అభినయించారు. పెళ్ళికి తరలివెళ్ళే బృందంలోని ఓ పెద్దగా వ్యవహరించిన మోదుకూరి సత్యం రెండవ చరణాన్ని అభినయించారు. తరువాత రోజుల్లో విఠలాచార్య సినిమాలద్వారా ఈ మోదుకూరి సత్యం హాస్యనటునిగా పేరు తెచ్చుకున్నారు.

శంకరాభరణం రాగంలోని స్కేల్‌ని తీసుకుని స్వరపరిచిన ఈ పాటలో రెండవ నిషాదమైన కైశికనిషాదాన్ని ('ని' అనే స్వరం) కూడా కలపటంతో హరి కాంభోజి రాగం అనిపించడానికి కూడా ఆస్కారం ఉంది. సాధారణంగా జానపదగీతాలు ఎక్కువగా హరికాంభోజి రాగం ఆధారంగానే ఉంటుంటాయి. అంచేత ఫోక్‌సాంగ్స్‌కి కావలసిన ఊపు, తూగు కూడా పాటకు జతపడింది. చివరి చరణంలో సాధారణ గాంధార ప్రయోగం ('గ' అనే స్వరం) కూడా జరిగింది, దాంతో సంపూర్ణ స్వతంత్ర సంచారం లభించి పూర్తిస్థాయి జానపదగీతంలా విలసిల్లిందీ గీతం.

పాట మొత్తం గమనిస్తే - బండి, ఎడ్లు, పెళ్ళి, వీటికి సంబంధించిన అంశాలను ఓసారి సూటిగా, మరోసారి తిప్పుతూ - గ్రామీణ వాతావరణంలో వాడుకునే మాటలతో ఎంత తెలివిగా రాశారోనని అనిపిస్తుంది. ఇక గాయకుడిగా మాధవపెద్ది సత్యం కంఠానికుండే రేంజ్ ఈ పాటకు ఒక మంచి వేదికగానే కాకుండా బహువేడుకగా అమరింది.

ఎప్పుడైనా 'రోజులు మారాయి' చిత్రం టీవీలో వచ్చినప్పుడుగాని, రెంటల్ లైబ్రరీలలో సీడీ ద్వారా వీడియో క్యాసెట్ల ద్వారా దొరికినప్పుడుగాని మనసుని ఆరోజులలోకి పంపించి ఏ టెన్షన్లూ, హడావుడి లేకుండా తీరిగ్గా కూర్చుని చూడండి - ఆ తర్వాత మనసుకి కలిగే ఆనందాన్ని బేరీజు వేసుకుని చూడండి - ఎంత తృప్తిగా, గర్వంగా ఉంటుందో తెలుస్తుంది!

************************************

## దేవాంతకుడు

రచన : ఆరుద్ర సంగీతం : అశ్వత్థామ గానం: పి.బి.శ్రీనివాస్, జానకి

ప: గో-గో-గో గో గోంగూర
జై-జై-జై-జై జై ఆంధ్రా
గోంగూర జై ఆంధ్రా గోంగూర జై ఆంధ్రా
కోరుకో - కోరుకో మనసారా ఓ మనసారా
చ: ఘాటు ఘాటు ఎర్ర మిరపకాయలు
కమ్మనైన వెల్లుల్లిపాయలు
పిసరంత ఇంగువ పేరిన నెయ్యి
కలిపికొట్టు కలిపికొట్టు కావేటిరంగా ॥గోగో॥
చ: తనివి తీర అన్నంలో కలుపు
దాని ముందు అమృతం దిగదుడుపు
తినరా గోంగూర ఇది తెలిసి
తిన్నవాడు సాటిలేని ఉక్కుమనిషి ॥గోగో॥

## జీవిత చక్రం

రచన : ఆరుద్ర సంగీతం:శంకర్ జైకిషన్ గానం: ఘంటసాల

ప: కంటిచూపు చెపుతోంది
కొంటెనవ్వు చెపుతోంది
మూగమనసులో మాట.... ఓ పిల్లా ॥కంటి॥
ఆశలూ - దాచకూ ॥కంటి॥
చ: ఆడపిల్లా - పూలతీగె
ఒక్కలాగె చక్కనైనవి (2)
ఆడపిల్లా - పూలతీగే ఒక్కలాగె
అండ కోరుకుంటాయి
ఆ........ హో..........
అందమైన మగవాడు
పొందుకోరి వచ్చాడు
ఎందుకలా చూస్తావు..... ॥ఓ పిల్లా॥
స్నేహము చేయవా... స్నేహము చేయవా... ॥కంటి॥
చ: కొమ్మమీదా గోరువంకా
రామచిలుక జోడు కూడె
కొమ్మమీదా గోరువంకా
రామచిలుకా ముద్దుపెట్టుకున్నాయి
ఆ... హో...
మెత్తనైన మనసు నీది కొత్త చిగురు వేసింది
మత్తులోన మునిగింది ఓ పిల్లా...
మైకమూ పెంచుకో..... మైకమూ పెంచుకో..... ॥కంటి॥
చ: చెప్పలేని వింత వింత అనుభవాలు విరగబూసె
చెప్పలేనీ వింత వింతా అనుభవాలూ ఎదురుచూస్తున్నాయి
ఆ... హో...
నువ్వు నన్ను చేరాలి నేను మనసు ఇవ్వాలి
ఎడములేక ఉండాలి ఓ పిల్లా...
వస్తావా -మనసిస్తాను
వస్తావా - మురిపిస్తావా
ఓ పిల్లా... హేయ్... ॥కంటి॥

## బందిపోటు

రచన : సి.నారాయణ రెడ్డి సంగీతం, గానం: ఘంటసాల

ప: వగలరాణివి నీవే సొగసుకాడను నేనే
ఈడు కుదిరెను జోడు కుదిరెను మేడ దిగిరావే
॥వగల॥
చ: పిండి వెన్నెల నీకోసం పిల్లతెమ్మెర నాకోసం (2)
రెండు కలసిన నిండు పున్నమి రేయి మనకోసం
॥వగల॥
చ: దోరవయసు చినదానా ఓరచూపు నెరజాణా (2)
బెదురుటెందుకు కదులు ముందుకు ప్రియుడనేగాన
॥వగల॥
చ: కోపమంతా పైపైనే చూపులన్నీ నా పైనే (2)
వరుని కౌగిట ఒరిగినంతట కరిగిపోదువులే
॥వగల॥

## దొరికితే దొంగలు

రచన:సి.నారాయణరెడ్డి సంగీతం:ఎస్.రాజేశ్వరరావు గానం:ఘంటసాల

ప: ఎవరికి తెలియదులే ఇంతుల సంగతి (2)
ఇంతుల సంగతి పూ బంతుల సంగతి ॥ఎవరికి॥
చ: జడలో మల్లెపూల జాతర చేస్తుంటారు
బంగారు పెదవులపై రంగులు పూస్తుంటారు (2)
ఈ షోకులన్నీ ఇంకెవరికోసమంటారు (2) ॥ఎవరికి॥
చ: ముసిముసి నగవులతో మిసమిస చూపులతో (2)
దాచుకున్న తలపులతో దోచుకున్న వలపులతో (2)
మొదట కసిరికొడతారు పిదప చల్లబడతారు(2)॥ఎవరికి॥
చ: పందిరి లేకుంటే తీగె పైకి పోతుందా (2)
గోడలు లేకుంటే గోపురమే ఉంటుందా
పురుషులు లేకుంటే తరుణులపని గోవిందా (3)
గోవిందా...గోవిందా ॥ఎవరికి॥

## మంచి మనిషి

రచన : కొసరాజు సంగీతం : టి.చలపతిరావు గానం : ఘంటసాల

ప: ఏమండీ - ఏమండోయ్....ఏమండీ - ఇటు చూడండీ...
ఒక్కసారి ఇటు చూసారంటే మీ సొమ్మేమీ పోదండీ...
॥ఏమండీ॥
చ: సిగలోన దాగిన మల్లెమొగ్గకు బిగువెందుకో చెప్పాలండీ
వరసైన వన్నెల రామచిల్కకు పొగరు కాస్త తగ్గాలండీ
మన స్నేహము మోమాటము పాడిమాటలతోనే పోదండీ
॥ఏమండీ॥
చ: మనసంత మాపై ఉందిలెండి తెలుసులెండి మీ తాపం
మొగమంత కన్నులు చేయకండి దాచుకోండి మీ కోపం
వగలెందుకు సెగలెందుకు ఈ సారికి ఏదో పోనీండి
॥ఏమండీ॥
చ: మిము నమ్ముకున్న నేస్తగాడు మీ వెంటనే ఉన్నాడండి
ఏ నాటికీ, ముమ్మాటికీ తన మనసే మీదన్నాడండీ
కవ్వించక కథ-పెంచక ఔనంటే అంతే చాలండీ
॥ఏమండీ॥

## రాణీ రత్నప్రభ

రచన: ఆరుద్ర సంగీతం: ఎస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల

ప: నిన్న కనిపించింది నన్ను మురిపించింది
అందచందాల రాణీ ఆ చిన్నది
చ: ఆమె చిరునవ్వులోనే హాయున్నది
మనసు పులకించగా
మధుర భావాలు నాలోన కలిగించింది ॥నిన్న॥
చ: మరచిపోలేను ఆ రూపు ఏనాటికీ
మమతలేవేవో చెలరేగె ఇది ఏమిటీ
తలచుకొనగానే ఏదో ఆనందమూ
వలపు జనియించగా
ప్రణయగీతాలు నాచేత పాడించింది ॥నిన్న॥
చ: సోగ కనులారా చూసింది సొంపారగా
మూగకోరికలు చిగురించె ఇంపారగా
నడచిపోయింది ఎంతో నాజూకుగా
విడచి మనజాలను
విరహతాపాలు మోహాలు రగిలించింది ॥నిన్న॥

## లక్షాధికారి

రచన: సినారాయణరెడ్డి సంగీతం: టి.చలపతిరావు గానం: ఘంటసాల

సా: నా చెంప తాకగానే
నీ చేయి కందెనేమో
నా చూపు సోకగానే
నాజూకు తగ్గెనేమో
నా చెంప తాకగానే
చెలీ నీ చేయి కందెనేమో
నా చూపు సోకగానే
అరెరె నాజూకు తగ్గెనేమో
నాపైన నీకు కోపమా - కాదేమి విరహతాపమా
పలుకగారాదా - అలుక మరియాదా
నీ పదునౌ చూపుల అదిరింపులకు
బెదరను బెదరను బెదరనులే
దాచాలంటే దాగదులే దాగుడుమూతలు సాగవులే
వలపుల సంకెల బిగిసేదాకా
వదలను వదలను వదలనులే ॥దాచా॥
చ: నీ కులుకు నడక చూచి రాజహంసలకు సిగ్గు గలిగె
నీ తళుకు మోముచూచి నింగిజాబిలికి సిగ్గు తరిగె
॥నీ కులుకు॥
అయ్యారే మేని అందము వయ్యారితీగె చందము (2)
మరులుగొలిపేనూ - మనసు దోచేనూ
ఈ కమ్మని రాతిరి కరిగేదాకా
కదలను కదలను కదలనులే ॥దాచా॥
చ: నీ నల్లని వాల్జడలో విరిసిన మల్లెలు రమ్మనెను
నీ ఎర్రని బుగ్గలపై సిగ్గులు ఎదురై పొమ్మనెను ॥నీ నల్లని॥
నువ్వు లేకపోతే జాబిలి ఈ లోకమంత చలిచలి
నువ్వు లేకపోతే జాబిలి లోకమే చలి
ఏమి చేసేను - ఎటుల పోయేను
నీ వెచ్చని కౌగిట ఒదిగేదాకా
విడువను విడువను విడువనులే ॥దాచా॥

## మంచి మనసుకు మంచి రోజులు

రచన: కొసరాజు సంగీతం, గానం: ఘంటసాల

సాకి: వేళగాని వేళలో ఊరు విడచి దూరంగా కారెక్కి ఒంటిగా
గాలమేయ వచ్చిన బూచీ సంగనాచీ
పా: అనుకున్నదొక్కటి అయినది ఒకటి
బోల్తా కొట్టిందిలే బుల్‌బుల్ పిట్ట (2)
గుట్టు నిముషంలో తెలిసిందిలే
గుండె దిగజారి నిలిచిందిలే ॥అనుకున్నదొక్కటి॥
చల్లని వెన్నెల కాస్తుంటే చల్లగా ఇంట్లో నేనుంటే
తలుపు మూసీ చెప్పకనే
దొడేసిన రాకాసి - ఓ రాకాసీ ॥అనుకున్నదొక్కటి॥
ఏ బస్తీ కిలాడీ నా పేరే పల్లెటూరి వస్తాదు రౌడీ
నీ తెలివంతా జూపి నను గెలిచావా లేడీ
చిక్కావు చేతిలో కేడీ షోకైన లేడీ ॥అనుకున్నదొక్కటి॥

## జగదేకవీరుని కథ

రచన: పింగళి సంగీతం: పెండ్యాల గానం: ఘంటసాల

ప: ఓ దివ్య రమణులారా
నేటికి కనికరించినారా
కలకాదు కదా సఖులారా
ఓ సఖీ ఓహో చెలీ ఓహో మదీయమోహిని
చ: కలలోపల కనిపించి వలపించిన చెలులోహో
కనులవిందు చేసారే.... కనులవిందు చేసారిక
ధన్యుడనైతిని నేనహ ॥ఓ సఖీ॥
చ: నయగారము లొలికించి
ప్రియరాగము పలికించి
హాయినొసగు ప్రియలేలే....
హాయినొసగు ప్రియలేమరి
మాయలు సిగ్గులు ఏలనే ॥ఓ సఖీ॥
చ: కనుచూపులు ఒకవైపు మనసేమో నా వైపు
ఆటలహో తెలిసెనులే.... ఆటలహో తెలిసెను
చెలగాటము నాకడ చెల్లునే ॥ఓ సఖీ॥

## దాగుడుమూతలు

రచన: దాశరథి సంగీతం: కె.వి.మహదేవన్ గానం: ఘంటసాల

ప: గోరొంక గూటికే చేరావు చిలక
భయమెందుకే నీకు బంగారుమొలక ॥గోరొంక॥
చ: ఏ సీమదానవో ఎగిరెగిరి వచ్చావు
అలసి వుంటావు
మనసు చెదరి ఉంటావు ॥ఏ సీమ॥
మా మల్లెపూలు నీకు మంచి కథలు చెప్పునే
ఆదమరచి ఈ రేయి హాయిగా నిదురపో ॥గోరొంక॥
చ: నిలువలేని కళ్ళు నిదురపొమ్మన్నాయి
దాగని చిరునవ్వులు వద్దన్నాయి
అబ్బ ఉండన్నాయి
పైట చెంగు రెపరెపలు పదపదలెమ్మన్నాయి
పలుకైన పలుకవా బంగారు చిలకా ॥గోరొంక॥

ఎన్నో గీతాలకు తన అభినయంతో ప్రాణ ప్రతిష్ట చేసిన ఎన్టీఆర్ జయంతి
(మే 28)ని పురస్కరించుకుని
అభిమానుల కోసం



